# ఆటే శాశ్వతం

## -రితికా సింగ్

**బాక్సర్ నుంచి నటిగా మారిన మిక్స్‌డ్ మార్షల్ ఆర్ట్స్ క్రీడాకారిణి రితికా సింగ్. క్రీడా మైదానం నుంచి రంగుల ప్రపంచంలోకి వచ్చేవారు చాలా తక్కువ. వచ్చినా ఎక్కువ కాలం ఇక్కడ నిలదొక్కుకోలేరు. గతంలో కొంతమంది క్రీడాకారిణిలు వెండి తెరమీద కనిపించినా, వాళ్ళు ఒకటి రెండు సినిమాలకే పరిమితం అయ్యారు. కానీ రితికా సింగ్ మాత్రం తక్కువ కాలంలోనే నాలుగైదు సినిమాలు చేసింది. మరికొన్ని సినిమాలు చేయడానికి గ్రీన్ సిగ్నల్ కూడా ఇచ్చింది. క్రీడారంగం నుంచి వెండితెరకు ఎలా దూసుకు వచ్చిందో ఆమె మాటల్లోనే.....**

**క్రీడారంగం నుంచి సినిమాల వైపు ఎలా వచ్చారు?**

2012లో ఓ టీవీ రియాల్టీ షోలో పాల్గొన్నాను. ఆ కార్యక్రమంలో నా మాటలు విన్న దర్శకులు సుధా కొంగర గారు, నటులు మాధవ్‌గారు నాకు 'గురు' సినిమాలో అవకాశం ఇచ్చారు. అది త్రిభాషా చిత్రం. ఆ సినిమాతో నాకు అవార్డు కూడా వచ్చింది. అప్పటి నుంచి అంటే దాదాపు నాలుగైదు సంవత్సరాలుగా వరుసగా సినిమాలు చేస్తూనే ఉన్నాను.

**క్రీడారంగాన్ని వదిలేసినట్టేనా?**

నా విషయంలో సినిమాలు శాశ్వతం అనుకోను. ఆటే శాశ్వతం. ఆటతోనే నాకు గుర్తింపు వచ్చింది. దానిని వదిలే ప్రసక్తే లేదు. వదులుకోవలసి వస్తే సినిమాలే వదులుకుంటాను.

**ఇప్పటికీ కిక్ బాక్సింగ్ ప్రాక్టీస్ చేస్తున్నారా?**

ఆరోగ్యంతో పాటు మంచి శరీరాకృతిని కూడా సొంతం చేసుకోవాలనుకుంటే కిక్‌బాక్సింగ్ రోజూ ప్రాక్టీస్ చేయాల్సిందే! చెప్పానుగా ఆటను ఎట్టి పరిస్థితుల్లోనూ వదులుకోనని. రోజూ కనీసం ఓ గంట ప్రాక్టీసు చేస్తుంటాను.

**బాక్సింగ్‌తో పాటు డ్యాన్స్ కూడా నేర్చుకున్నారా?**

లేదు. డ్యాన్స్ నేర్చుకునేటంత సమయం నా దగ్గర లేదు. సెట్‌లో డ్యాన్స్ మాస్టర్ చెప్పినట్టు చేయడమే!

**అరవింద్ స్వామి లాంటి సీనియర్ హీరోతో చేసినప్పుడు ఎలా అనిపించింది?**

కొన్ని ప్రేమ సన్నివేశాలలో నటించాల్సి వచ్చినప్పుడు మాత్రం తెగ ఇబ్బంది పడ్డాను. నా ఇబ్బందిని ఆయన గమనించారు. 'తెరమీద నటించేటప్పుడు ఎదుటి వ్యక్తిని కేవలం హీరోగానే చూడు. నువ్వు ఎలా చేసినా ఎవరూ విమర్శించరు. దర్శకుడికి ఏం కావాలో ఆయన అడుగుతారు. అలాగే చెయ్యి' అని సలహా ఇచ్చారు. ఆయన సలహా నాకు చాలా ఉపయోగపడింది. సినిమా సినిమాకీ నా నటనను మెరుగు పరుచుకుంటున్నాను.

**సినిమాల్లోకి రాకముందు నటనలో శిక్షణ తీసుకున్నారా?**

ఎలాంటి శిక్షణా తీసుకోలేదు. దర్శకుడు చెప్పింది చేస్తే సరిపోతుందని సుధాకొంగర గారు చెప్పారు. ఆ మాటను తూ.చ. తప్పకుండా పాటిస్తున్నాను. సెట్‌లోకి రాగానే నా డైలాగులు ఒకటికి రెండుసార్లు చదువుకుంటాను. దాంతో ఏ సమస్యా లేదు.

**బాలీవుడ్‌లో సినిమా ఒప్పుకున్నారా?**

మంచి ప్రాజెక్ట్ కోసం వెయిట్ చేస్తున్నాను.

**తెలుగులో సినిమాలు చేస్తున్నారా?**

చేయమని అడుగుతున్నారు. నేనే వేటికీ ఓకే చెప్పలేదు. త్వరలోనే ఓ సినిమా చేస్తాను.

–బికె

## సరదాగా....

**చీటింగ్**

అంకుర్ తన ప్రియురాలు గీత మీద అరుస్తున్నాడు.

**అంకుర్:** మనిద్దరం రిజిస్టర్ మ్యారేజ్ చేసుకుందామని అనుకున్నాం కదా! నెలముందే డేట్ కూడా బుక్ చేసుకున్నాం. కానీ నిన్న నువ్వు రాలేదు. నన్ను చీట్ చేశావ్...

**గీత:** నేనేం చేశాను? నిన్న పొద్దుట్నించీ నీకోసం చూస్తూ అక్కడే ఉన్నాను. నువ్వే రాలేదు...?

**అంకుర్:** ఏంటీ...నేను రాలేదా? నీకోసం పోస్టాఫీసులో నిన్నంతా పడిగాపులు పడి చచ్చాను. అసలు ఇదంతా కాదుగానీ, నువ్వు నాకు సరిపోవు. నీమొహం నాకు చూపించకు అని వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

**ఒక ప్రశ్న?**

వెంకయ్యది ఓ సాధారణ రైతు కుటుంబం. పదెకరాల ఆసామి అతను. ఈమధ్యనే ఇంకో ఎకరం పొలం కొన్నాడు. కొత్తగా కొన్న పొలంలో బోరు కూడా తవ్వించాడు. ఆ రోజు పొలం దున్నుతున్నాడు వెంకయ్య. నాగలికి ఏదో గట్టిగా తగిలింది. నాగలిని పక్కకి లాగి అక్కడ తవ్వి చూశాడు. కొద్దిలోతులో రెండు లంకెబిందెలు కనిపించాయి. ఒక్కసారిగా అతని కళ్ళు జిగేల్‌మన్నాయి. వాటిల్లో బంగారపు అచ్చులు పోత పోసినట్టుగా మెరుస్తున్నాయి. వాటిని మళ్ళీ అక్కడే కప్పెట్టి, అర్ధరాత్రి ఊరంతా నిద్రలో ఉండగా, వాటిని ఇంటికి తీసుకు వచ్చాడు. ఆ రెండు బిందెల్లో 4 కిలోల అచ్చులు 4, 2 కిలోల అచ్చులు 2, 1 కిలో అచ్చు 1 ఉన్నాయి. అంటే మొత్తం 21 కిలోల బంగారం ఉంది. వాటిని ఎలాగైనా సరే అమ్మి సొమ్ము చేసుకోవాలనుకున్నాడు. రెండు జతల బట్టలు బ్యాగులో సర్దుకొని, వాటికింద అచ్చులు పెట్టి, పట్టణానికి వెళ్లాడు. తనకెంతో నమ్మకమైన దుకాణానికి వెళ్ళాడు. కానీ అది మూసి ఉంది. పక్క దుకాణదారుని అడిగాడు. ఆ దుకాణ యజమాని తీర్థయాత్రలకి వెళ్ళాడనీ, ఇంకో వారం రోజుల వరకూ రాడనీ చెప్పాడతను. దాంతో వెంకయ్య ఎలాగైనా వాటిని అమ్మకుండా కదలకూడదని నిర్ణయించుకుని, ఆ ఊళ్ళోనే ఉన్న ఓ పూటకూళ్ళింటికి వెళ్ళాడు. వారం రోజులపాటు బస చేస్తానని, అందుకు ఏమివ్వమంటావని అడిగాడు. వెంకయ్య వాలకం చూసి ఏమనుకున్నాడో ఏమో కానీ రోజుకి కిలో బంగారం చొప్పున ఇవ్వాలని, అదీ ఏరోజుకారోజు ఇవ్వాలని పట్టుబట్టాడా పూటకూళ్ల యజమాని. ఇక తప్పలేదు వెంకయ్యకి. తనగురించి ఎవరికీ ఏ వివరాలూ చెప్పవద్దని మాటతీసుకున్నాడు. సరేనన్నాడా ఇంటి యజమాని. చక్కగా వారంపాటు అక్కడ మకాం వేసి, ఎనిమిదో రోజు మిగిలిన బంగారం అమ్ముకుని తనదారిన తను వెళ్ళిపోయాడు వెంకయ్య. అయితే ఇక్కడ ప్రశ్న ఏంటంటే... వెంకయ్య దగ్గర ఉన్నది బంగారపు అచ్చులు కదా! అదీ 4, 2, 1 కిలో అచ్చులు....మరి అతను ఏరోజుకారోజు కిలో బంగారం చొప్పున ఎలా ఇచ్చాడు? మెదడుకు మేతలాంటి ఈ ప్రశ్నని ఛేదించండి మరి.

**సమాధానం**

వెంకయ్య మొదటిరోజు 1 కిలో అచ్చును ఇచ్చాడు. రెండోరోజు ఆ 1 కిలో అచ్చును తీసుకుని, 2 కిలోల అచ్చును ఇచ్చాడు. మూడోరోజు తిరిగి 1 కిలో అచ్చు ఇచ్చి, నాలుగో రోజున ఆ 1 కిలో అచ్చును తీసుకుని, 4 కిలోల అచ్చును ఇచ్చాడు. ఐదోరోజు మళ్ళీ ఆ 1 కిలో అచ్చు ఇచ్చాడు. ఆరో రోజు ఇంకొకటి 2 కిలోల అచ్చు ఇచ్చి, 1 కిలో అచ్చును తీసుకున్నాడు. ఇక ఆఖరిరోజు 1 కిలో అచ్చు ఇచ్చేసి, ఆ ఇంటి నుంచి బయటపడ్డాడు.

## తీన్ మార్

బాచి..

మా తోపగలు పనిచేయించి రాత్రి రెస్టు యిస్తున్నారు గానీ... రాత్రిపూటయితే ఎంతపనైనా చేస్తాం.. ఆలోచించండి హెడ్డుగారూ!!

బాచి

మీటర్ రేటే తీసుకున్నాడట!!

బాచి

రామ్మా రా! లోపలికి రా!! లోనికొచ్చి తల తుడుచుకో.. లేకపోతే జలుబు చేస్తుంది!!



8

## కృష్ణం వందే జగద్గురుమ్

శ్రీకృష్ణుడు కర్మయోగి. మోముపై చెరగని చిరునవ్వుతో ఎన్నో సవాళ్ళను పరిష్కరించిన స్థితప్రజ్ఞుడు. ఆయనొక ఆదర్శ విద్యార్థి, మిత్రువు కూడా. కర్తవ్యహీనులకు లక్ష్యం బోధించి ముందుకు నడిపించే మేనేజ్‌మెంట్ గురు! ఆగస్టు 14 శ్రీకృష్ణజన్మాష్టమి సందర్భంగా కృష్ణతత్వ విశ్లేషణ.

**56**

### సెల్ఫ్ వెడ్డింగ్!!

మనమీద మనకు ప్రేమ లేకపోతే ఇతరుల్ని ప్రేమించలేం. అభిమానించలేం. అంతమాత్రంచేత మనల్ని మనమే పెళ్ళి చేసుకుంటామా? విడ్డూరంగా ఉందికదూ?

**70**

### ఇంటర్వ్యూ

తాజాగా 'నిన్నుకోరి' చిత్రంలో తండ్రిపాత్రలో అలరించిన బహుభాషా నటుడు మురళీశర్మ. విలనిజం ఒక చేదుమందు అంటున్నాడు. ఆయనతో ఇంటర్వ్యూ ఈ వారం

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: ప్రగ్యాజైస్వాల్


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### ఇన్‌కం

"అడుక్కోవడం పెద్దకళ. అది మనవల్ల కాదు." అన్నాడు శీను.

"ఏం కాదు. నేను అడుక్కుని చూపిస్తాను, ఎంతి స్తావు?" అడిగాడు ప్రభు.

"రెండు వేలిస్తాను, అయితే నేను చెప్పినచోట నువ్వు అడుక్కోవాలి. అలాగే పొద్దున నుంచీ సాయంత్రం దాకా అడుక్కోవాలి. పందెవా? ఒకవేళ ఓడిపోతే నువ్వు నాకు రెండువేలివ్వాలి. "

"ఓకే! చెప్పు? ఎక్కడ అడుక్కోను?"

"సెంటర్ ఆఫ్ ది సిటీ అమీర్‌పేటలో అడుక్కోవాలి."

"డన్"

పొద్దుననగా అడుక్కోవడం ప్రారంభించాడు ప్రభు. సాయంత్రం వరకూ అడుక్కున్నాడు. గమనించాడది శీను. ఓడిపోయానంటూ రెండువేల రూపాయలు ప్రభుకి చెల్లించాడు. మర్నాడు మళ్ళీ ప్రభు అడుక్కోవడం చూశాడు శీను. అడిగాడిలా.

"మన పందెం నిన్నటితో అయిపోయిందిగా! మళ్ళీ ఎందుకు అడుక్కుంటున్నావు?"

"ఇన్‌కం బాగుంది గురూ, అందుకే కంటిన్యూ చేస్తున్నాను." అన్నాడు ప్రభు.

### డాక్టర్

"రావుగారున్నారే, ఆయన అలాంటిలాంటి డాక్టర్ కాదు. చాలా గొప్ప డాక్టర్."

"అని ఎలా చెప్పగలవు?"

"రోజంతా బద్ధకంగా ఉంటోంది. ఆయాసంగా ఉంటోం దంటే...నిన్న మా ఆవిణ్ణి ఆయన దగ్గరకు తీసుకెళ్ళాను. అంతే! దెబ్బకి ఎగిరిపోయాయి."

"ఏ మందిచ్చారేం?"

"మందుకాదు, ఒకే ఒక మాటన్నారు, వయసుపై బడుతోంది కదమ్మా, ఇవన్నీ సహజం అన్నారు. అంతే! పనులన్నీ చేసుకుంటోంది మా ఆవిడ."

### ప్లానింగ్

ఆఫీసర్‌ని సరదాగా లంచ్‌కి పిలిచాడు కల్యాణ్. ఇద్దరూ కలిసి భోంచేస్తున్నారు. కల్యాణ్‌భార్య వడ్డిస్తోంది వారికి.

"సీత అని నా భార్యసార్! మంచి ప్లానింగ్ ఉన్న లేడీ" ఆఫీసరుకి భార్యను పరిచయం చేశాడు కల్యాణ్.

"గుడ్"

"రేపటి పనిని ఇవాళే చేసేస్తుంది."

"వెరీగుడ్"

"ఇప్పుడు ఈ వంటంతా నిన్న చేసిందే."

"!!!!"

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 24
16-8-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## సర్కస్

ఎవరో చెప్పారు, ఊరిలోకి సర్కస్ వస్తున్నదని. బాబు ఆనందానికి అంతులేకుండాపోయింది. సర్కస్ గుడారాలు ఎక్కడ వేస్తున్నదీ తెలుసుకున్నాడు. అక్కడే పొద్దుటి నుంచీ సాయంత్రం దాకా ఉండిపోయాడు. గోతులు తవ్వడం దగ్గర నుంచీ గుడారం పూర్తి అయ్యేంత వరకూ కళ్ళు విప్పార్చుకుని చూశాడు. సెర్చ్‌లైట్ ఏర్పాటు కూడా చూసి పొంగిపోయాడు. ఒంటెలూ, ఏనుగులూ, గుర్రాలూ, పులులూ, సింహాలూ, కోతులూ, ఎలుగుబంట్లుసహా హాస్యగాళ్ళు తరలిరావడం చూసి చప్పట్లు చరిచాడు. వారంరోజులపాటు సర్కస్ ఏర్పాట్లు చూస్తూ స్కూలుకి వెళ్ళలేదు బాబు. వెళ్తున్నానని తండ్రికి అబద్ధం చెప్పాడు. మర్నాటి నుంచి సర్కస్ ప్రారంభం అంటే...ముందురోజు రాత్రి సెర్చ్‌లైట్ వెలుగు డాబాపై పారాడ్డాన్ని చూశాడు. తండ్రికి దాన్ని చూపించాడు. సర్కస్ నాన్నా! సర్కస్ వచ్చిందని చెప్పాడు. ఎప్పుడు తీసుకెళ్తారు నాన్నా? అడిగాడు. వెళ్దాం! రెండు మూడురోజులు పోనీ అన్నాడు తండ్రి. టిక్కెట్‌ధరలు బాగా పెరిగిపోయాయి. గ్యాలరీనే వందరూపాయలంటే మిగిలినక్లాసులెంత ఖరీదో! తట్టుకోలేం అనుకున్నాడతను. అయినా తప్పదు, బాబుని తీసుకుని వెళ్ళాల్సిందే! వాడికి సర్కస్ అంటే ప్రాణం అనుకున్నాడు తండ్రి. వారంరోజులుగా బాబు స్కూలుకి వెళ్ళట్లేదని తెలుసు. ఎక్కడికి వెళ్తున్నదీ తెలుసు. పిల్లలకది సరదా అని సరిపెట్టుకున్నాడతను.

ప్రచారం భారీగా మొదలైంది. సర్కస్ ప్రారంభం అయింది. ప్రచారరథం మీద హాస్యగాడి చేష్టలు చూస్తూ వాడి వెనకే పరుగుదీశాడు బాబు. వీధివీధీ తిరిగాడు. బాగా అలసిపోయాడు. జ్వరం వచ్చింది ఆ రాత్రి. మర్నాడు కూడా మంచంమీద నుంచి లేవలేకపోయాడు. ఆ మర్నాడు లేచాడు. లేస్తూనే నాన్నా! సర్కస్ అన్నాడు. ఇవాళ వెళ్దాం అన్నాడు తండ్రి. అన్నమాట ప్రకారం ఆ సాయంత్రం డ్యూటీ నుంచి త్వరగా ఇంటికి చేరుకున్నాడతను. ఆసరికే ముస్తాబై సిద్ధంగా ఉన్నాడు బాబు. సర్కస్ చూస్తూ తినడం కోసం తల్లి ఇచ్చిన జంతికలు, పొట్లం కట్టుకుని మరీ సిద్ధమయ్యాడు. పద అన్నాడు తండ్రి. బయల్దేరాడు బాబు. తాను సర్కస్‌కి వెళ్తున్నానని, కుంకుడు చెట్టుకింద క్రికెట్ ఆడుకుంటున్న స్నేహితులకి చెప్పాడు బాబు. గుడిదగ్గర కలిసిన స్నేహితురాలు పద్మకి కూడా తండ్రిసహా తాను సర్కస్‌కి వెళ్తున్న సంగతి చెప్పి, తండ్రిని చూపించాడు. తల్లి ఇచ్చిన జంతికలు కూడా చూపించాడు ఆ పిల్లకి. త్వరగా వెళ్ళు ఆరుగంటలకే మొదటాట అని తొందరచేసింది పద్మ. అవునవును అంటూ తండ్రిని తొందరచేశాడు బాబు. పావుగంట ముందుగానే సర్కస్‌దగ్గరకు చేరుకున్నాడు. గ్యాలరీ టిక్కెట్లదగ్గర బాగా రద్దీగా ఉంది. టిక్కెట్లకోసం ఒకరినొకరు తోసుకుంటున్నారు. ఆ తోపులాటలో కిందపడి కనిపించాడు బాషా అంకుల్. నాన్నా! బాషా అంకుల్ అని ఆందోళన చెందాడు బాబు. తండ్రి అతన్ని లేవనెత్తి, మంచినీళ్ళు తాగించి, అతగాడు తేరుకునేదాకా ఊరుకోలేదు బాబు.



భార్య, ఎనిమిదిమంది పిల్లలుసహా సర్కస్‌కి వచ్చాడు బాషా. మళ్ళీ టిక్కెట్ కౌంటర్‌ని సమీపించాడు. డబ్బు కోసం జేబులో చేయిపెట్టి చూస్తే డబ్బులేదు. ఆందోళన చెందాడు. ఆ జేబూ, ఈ జేబూ వెదికాడు. డబ్బు లేదు. కొట్టేశారెవరో! ఇప్పుడెలా? పిల్లలనీ, భార్యనీ బాధగా, బేలగా చూశాడతను. వెయ్యిరూపాయలు! రెండు అయిదువందల నోట్లు కొట్టేశారెవరో అని కన్నీరు పెట్టుకున్నాడు. చూసి తట్టుకోలేకపోయాడు బాబుతండ్రి. తన జేబులో గల రెండు అయిదువందల నోట్లూ తీసి, కిందపడేసి, ఇవేనా అంటూ తీసిచ్చాడతనికి. ఇవేనని ఆనందించాడు బాషా. టిక్కెట్లు తీసుకుని భార్య, పిల్లలుసహా సర్కస్ గుడారంలోనికి వెళ్ళిపోయాడతను. టిక్కెట్లు తీసుకోక, ఒట్టి చేతుల్తో కౌంటర్ దగ్గరనుంచి బయటికి నడిచాడు తండ్రి. సర్కస్ రేపు చూద్దాం, డబ్బుల్లేవు అన్నాడు బాబుతో. నాకంతా తెలుసు! నేనంతా చూశాను అన్నాడు బాబు. ఎగిరి, తండ్రిని గట్టిగా కౌగలించుకున్నాడు. ముద్దుపెట్టుకున్నాడతన్ని. వాడికి గుడారంలోని సర్కస్‌కన్నా తండ్రి గుండె చేసిన సర్కస్ ఎంతో నచ్చింది.

మనిషిలో, మనసులో సర్కస్ సాగుతూ ఉంటుంది. సాగనివ్వాలి. దేన్నీ పెద్దగా పట్టించుకోకూడదు. సాగిసాగి అదే ఓ కొలిక్కి వస్తుంది. చివరికి మంచే జరుగుతుంది. ఆనందం కలుగుతుంది. ఆ సంగతి తండ్రికి బాగా తెలుసేమో! బాబుని భుజాల మీది కెక్కించుకుని వెనుతిరిగాడతను.




**బుధవారం: 9 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: విదియ రా. 12.43 తదుపరి తదియ
నక్షత్రం: శతభిషం తె. 5.46 తదుపరి పూర్వాభాద్ర
వర్జ్యం: మ. 12.21 నుంచి 2.01 వరకు
దుర్ముహూర్తం: ఉ. 11.56 నుంచి 12.47 వరకు
అమృతఘడియలు: రా. 10.18 నుంచి 11.58 వరకు
రాహుకాలం: మ. 12.00 నుంచి 1.30 వరకు
సూర్యోదయం: 6.01
సూర్యాస్తమయం: 6.41

**గురువారం: 10 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: తదియ రా. 12.33 తదుపరి చవితి
నక్షత్రం: పూర్వాభాద్ర పూర్తి
వర్జ్యం: మ. 12.17 నుంచి 1.55 వరకు
దుర్ముహూర్తం: ఉ. 10.14 నుంచి 11.05 వరకు, మ. 3.18 నుంచి 4.09 వరకు
అమృతఘడియలు: రా. 10.04 నుంచి 11.42 వరకు
రాహుకాలం: మ. 1.30 నుంచి 3.00 వరకు
సూర్యోదయం: 6.01
సూర్యాస్తమయం: 6.41

**శుక్రవారం: 11 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: చవితి రా. 11.58 తదుపరి పంచమి
నక్షత్రం: పూర్వాభాద్ర ఉ. 6.13 తదుపరి ఉత్తరాభాద్ర
వర్జ్యం: మ. 3.49 నుంచి 5.25 వరకు
దుర్ముహూర్తం: ఉ. 8.33 నుంచి 9.24 వరకు, మ. 12.46 నుంచి 1.37 వరకు
అమృతఘడియలు: రా. 1.26 నుంచి 3.02 వరకు
రాహుకాలం: ఉ. 10.30 నుంచి 12.00 వరకు
సూర్యోదయం: 6.02
సూర్యాస్తమయం: 6.40

**శనివారం: 12 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: పంచమి రా. 10.07 తదుపరి షష్ఠి
నక్షత్రం: ఉత్తరాభాద్ర ఉ. 6.14, రేవతి తె. 5.50 వరకు
వర్జ్యం: సా. 6.02 నుంచి 7.36 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.02 నుంచి 6.52 వరకు
అమృతఘడియలు: తె. 3.29 నుంచి 5.03 వరకు
రాహుకాలం: ఉ. 9.00 నుంచి 10.30 వరకు
సూర్యోదయం: 6.02
సూర్యాస్తమయం: 6.39

**ఆదివారం: 13 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: షష్ఠి రా. 9.32 తదుపరి సప్తమి
నక్షత్రం: అశ్విని తె. 5.04 తదుపరి భరణి
వర్జ్యం: రా. 1.12 నుంచి 2.45 వరకు
దుర్ముహూర్తం: సా. 4.58 నుంచి 5.49 వరకు
అమృతఘడియలు: రా. 10.06 నుంచి 11.39 వరకు
రాహుకాలం: సా. 4.30 నుంచి 6.00 వరకు
సూర్యోదయం: 6.02
సూర్యాస్తమయం: 6.39

**సోమవారం: 14 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: సప్తమి రా. 7.46 తదుపరి అష్టమి
నక్షత్రం: భరణి తె. 3.57 తదుపరి కృత్తిక
వర్జ్యం: మ. 2.13 నుంచి 3.45 వరకు
దుర్ముహూర్తం: మ. 12.46 నుంచి 1.36 వరకు, మ. 3.17 నుంచి 4.07 వరకు
అమృతఘడియలు: రా. 11.22 నుంచి 12.57 వరకు
రాహుకాలం: ఉ. 7.30 నుంచి 9.00 వరకు
సూర్యోదయం: 6.02
సూర్యాస్తమయం: 6.39

**మంగళవారం: 15 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: అష్టమి సా. 5.40 తదుపరి నవమి
నక్షత్రం: కృత్తిక రా. 2.31 తదుపరి రోహిణి
వర్జ్యం: మ. 3.14 నుంచి 4.44 వరకు
దుర్ముహూర్తం: ఉ. 8.33 నుంచి 9.24 వరకు, రా. 10.22 నుంచి 11.06 వరకు
అమృతఘడియలు: రా. 12.16 నుంచి 1.46 వరకు
రాహుకాలం: మ. 3.00 నుంచి 4.30 వరకు
సూర్యోదయం: 6.02
సూర్యాస్తమయం: 6.38

# మెయిల్ బాక్స్

### నిజంగానే విచిత్రం

చిత్రమైన థియేటర్లు నిజంగానే విచిత్రంగా ఉన్నాయి. కారులో సినిమా, అతిచిన్న థియేటర్ అలరించాయి. లావుతగ్గాలమ్మా, హార్ట్‌బీట్ వినపడటం లేదు అనే కార్టూను కడుపుబ్బ నవ్వించింది. మిగిలిన కార్టూన్లన్నీ భలే నవ్వించాయి. సీరియల్స్ ఒక దాన్నిమించి మరొకటి మనోరంజకంగా ఉన్నాయి. కథలు ఆకట్టుకుంటున్నాయి. చేయి తిరిగిన రచయిత ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి 'సంగతులూ సందర్భాలూ' నూతనంగా ఉండి ఆనందంలో ముంచెత్తుతోంది.

—ఆర్.శాంతిసమీర, వాకలపూడి

### అలరిస్తున్న కొత్త శీర్షికలు

కొత్తగా ప్రవేశపెట్టిన నూరుకట్ల పిశాచం కథలు, జీవనతరంగాలు, సంగతులూ సందర్భాలూ, శుభవేళ శీర్షికలు ఎంతగానో అలరిస్తున్నాయి. పాఠకులకు కావాల్సినవాటిని సమకూర్చడంలో మీ చొరవ శ్లాఘనీయం. అన్వేషణ సీరియల్ ఆరంభమే అదుర్స్. గమ్మత్తు గొడుగులు, లిఫ్ట్‌గర్ల్ సంధ్య జీవితం, యూట్యూబ్ మహారాణి వంటల మస్తానమ్మ అంశాలు బాగున్నాయి.

—కె.ప్రసన్న, పేరాజుపేట

### వీక్లీకి హైలైట్

మొదటిపేజీ 'కృతజ్ఞత' వీక్లీకి హైలైట్. అంతటి విశాలహృదయం ఎంతమందికి ఉంటుందోకదా. 'నిగ్గదీసి అడగాలి' కథ చదువుతుంటే తాతమనవడు సినిమా గుర్తుకొస్తుంది. మదర్స్ డే విషయం తండ్రికి కుర్రవాడు గుర్తుకుతేవడం నిజంగా ఆ తండ్రి సిగ్గుపడాల్సిన విషయం. అన్వేషణ మొదట్లోనే సస్పెన్స్‌లో పెట్టింది. అతిసర్వత్రవర్జయేత్ కథ బాగుంది. అయినవాళ్ళు కథ సూపర్.

—ఎస్.శివన్నారాయణ, నెల్లూరు

### అద్భుతమైన వ్యాఖ్యలు

రెజీనా ముఖచిత్రం నేత్రానందాన్నిచ్చింది. స్వామి పర్యవేక్షణలో రాయుడు కృతజ్ఞతకు ప్రతిరూపంగా మారిన కథనంలోని అద్భుతమైన వ్యాఖ్యలు మొదటి పేజీని మరచిపోకుండా చేశాయి. శ్రీకృష్ణలీలలు అరణి హరివంశంలో కొత్తగా ఉండి ఆసాంతం ఆసక్తిగా చదివించాయి. ఫిడ్జెట్ స్పిన్నర్ ఉపయోగాలు, గమ్మత్తు గొడుగులు వ్యాసాలు ఆసక్తి రేకెత్తించాయి. సంగతులూ సందర్భాలూలో నాటి వివాహ విశేషాలు అలరించాయి.

—మాధవరపు కృష్ణ, కాకినాడ

### సినిమా చూసిన అనుభూతి

మధుబాబుగారి సీరియల్ స్టార్‌ఫైటర్ చదువుతున్నంతసేపూ ప్రత్యక్షంగా సినిమా చూస్తున్నంత అనుభూతి కలుగుతోంది. కథలు చాలా బాగున్నాయి. నవ్య వీక్లీని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుతున్న ఎడిటర్‌గారికి ప్రత్యేక అభినందనలు.

—జిట్టా రమణమోహన్, మదనపల్లి

### చిత్తుచేస్తోంది

రెజీనా ముఖచిత్రం బాగుంది. కవర్‌పేజీ ఎప్పుడూ ఆకర్షణీయమే. వినోద విజ్ఞానాలు పంచుతున్న నవ్య వీక్లీ పాఠకుల్ని తన రచనలతో చిత్తుచేస్తోంది. అన్వేషణ సీరియల్ రసభరితం.

—పక్కి బాలకృష్ణారావు, విజయనగరం

### జైని సీరియల్‌కే ప్రయారిటీ

ప్రభాకర్‌జైనిగారి సీరియల్ లాకర్ నెంబర్ 369 ఆకట్టుకుంటోంది. ఫ్యాన్సీ చీర గెలుచుకోవడానికి సరైన తేదీలోపు కూపన్ మీ వద్దకు చేరడానికి వీలుగా మొదట ఆ సీరియలే చదువుతున్నాం.

—టి.బాలముకుందసింగ్, అమరచింత



**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి

# వెరికోస్ వీన్స్‌కు వైద్యం లేదని ఎవరన్నారు?

కొంతమంది సమస్య వల్ల ఎటువంటి బాధ కలగడం లేదు కదా అని చికిత్స వెళ్లకుండా ఉంటారు. మరికొంతమందికి దానికి చికిత్స ఉన్న విషయం కూడా తెలియదు. చాలా మందిలో సాధారణంగా కనిపించే ఆ సమస్య పేరు వెరికోస్ వెయిన్స్. కాలి పిక్కల భాగంలో మెలిపడిపోయిన నరాలు అని చెబితే ఎవరైనా ఇట్టే గుర్తుపట్టే ఈ సమస్యకు హోమియోలో మంచి మందులు ఉన్నాయి. సిరలు మెలిపడటం వల్ల ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. సాధారణంగా రక్తం ఉపరితల సిరల నుంచి డీప్ వెయిన్స్‌కు, అక్కడ నుంచి గుండెకు సరఫరా అవుతుంది. అయితే ఈ ప్రక్రియ విఫలమైనప్పుడు రక్తం ఉపరితల సిరల్లోనే నిలిచిపోతుంది. ఫలితంగా సిరలు ఉబ్బిపోతాయి. సిరల్లో కవాటాలు ఉంటాయి. ఆ కవాటాల్లో లోపం ఏర్పడినపుడు లేక ఏదైనా అవరోధం ఏర్పడినపుడు ఈ సమస్య తలెత్తుతుంది.

### లక్షణాలు ఇలా ఉంటాయి

సిరలు ముదురు నీలం రంగులో, చర్మం కింద ఉబ్బిపోయి, మెలిపడి కనిపిస్తుంటాయి. కాలు బరువుగా ఉంటుంది. కాలి పిక్కల దగ్గర నొప్పి ఉంటుంది. ముఖ్యంగా ఎక్కడైతే వెరికోస్ వెయిన్స్ సమస్య ఉందో అక్కడ నొప్పి ఉంటుంది. నడుస్తున్నప్పుడు నొప్పి తీవ్రత చాలా ఎక్కువగా ఉంటుంది. పడుకున్నప్పుడు కాలి పిక్కలు పట్టేయడం జరుగుతుంది. ఎక్కువసేపు కూర్చున్నప్పుడు లేదా నిలుచున్నప్పుడు లక్షణాలు తీవ్రంగా ఉంటాయి. వెరికోస్ వెయిన్స్ ఉన్న ప్రాంతంలో దురద, చర్మం రంగు మారుతుంది. వాపు, సమస్య తీవ్రంగా ఉన్నప్పుడు కాలు వాయడం వంటి లక్షణాలు కూడా కనిపిస్తాయి. కాళ్లను పరిశీలించడం ద్వారా వెరికోస్ వెయిన్స్ నిర్ధారణ చేయవచ్చు.

### హోమియో చికిత్స

చాలా మంది ఈ సమస్యకు చికిత్స లేదని వైద్యుల దగ్గరకు వెళ్లకుండా ఉండిపోతారు. కానీ హోమియో వైద్యంతో ఈ సమస్య సమూలంగా తొలగిపోతుంది. హోమియో వైద్యంలో మూలకారణాన్ని తొలగించే విధంగా చికిత్స ఉంటుంది. కాబట్టి వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి లభిస్తుంది. పైగా ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు.

# హెపటైటిస్, హెర్పిస్‌ల భయమే వద్దు

హెపటైటిస్ అంటే కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిరోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. కాలేయ కేన్సర్‌కు దారితీయవచ్చు. అందుకే ప్రపంచ ఆరోగ్య సంస్థ ఈ వ్యాధి నివారణ కోసం అత్యంత ప్రాముఖ్యతనిస్తోంది.

**లక్షణాలు :** ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్ లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, ఒళ్లంతా దురదలు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం, తలనొప్పి, రక్తహీనత, రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది.

**హెర్పిస్ :** హెర్పిస్ వైరస్ పురుషుల నుంచి స్త్రీలకు, స్త్రీల నుంచి పురుషులకు లైంగిక సమయంలో వ్యాప్తి చెందుతుంది. లైంగిక కలయిక సమయంలో చర్మం చిట్లినపుడు గాయాలు, పుండ్ల ద్వారా ఈ వైరస్ వస్తుంది. ఈ చర్మం చిట్లినపుడు వైరస్ లోపలకు ప్రవేశిస్తుంది. ఈ వైరస్ కొద్ది రోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది. తొలిదశలో జననాంగాల్లో మంట, నొప్పి, మూత్రంలో దురద, జ్వరం వచ్చినట్లుగా ఉండటం జరుగుతుంది. ఒళ్లంతా నొప్పులు, గజ్జలలో, చంకలలో గడ్డలు కట్టినట్లుగా ఉంటుంది. తరువాత క్రమక్రమంగా లైంగిక భాగాలపై చిన్న చిన్న నీటిపొక్కులు కనిపిస్తాయి. రెండు, మూడు రోజులలో పగిలి పుండ్లలాగా తయారవుతాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. శాస్త్రీయతను సంతరించుకున్న హోమియో చికిత్స మూలకారణాన్ని గుర్తించి దాన్ని తొలగిస్తుంది. దీనివల్ల అద్భుతమైన ఫలితాలు సాధించవచ్చు.

# సయాటికా నొప్పికి సమాధానం!

కీళ్లనొప్పులకు సంబంధించిన వ్యాధులలో సయాటికా ఒకటి. శరీరంలో అతి పొడవైన నరం సయాటికా. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం శరీరంలో ఎంత దూరం వెళితే అంత దూరం నొప్పి వస్తూనే ఉంటుంది.

**లక్షణాలు :** చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. తరువాత మోకాళ్ల, పాదాల చివరకు, పిక్కలు, మడమలకు వ్యాపిస్తుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. ఒక్కోసారి తిమ్మిర్లు, మంట వంటి లక్షణాలు ఉంటాయి.

**హోమియో చికిత్స :** నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. సయాటికా సమస్యలకు హోమియో వైద్య విధానంలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. హోమియో మందుల ద్వారా నడుము నొప్పిని పూర్తిగా దూరం చేయవచ్చు. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల మంచి ఫలితం ఉంటుంది.

మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ,
కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106





# కృష్ణం వందే జగద్గురుమ్

**ఆదౌ దేవకీదేవి గర్భజననం గోపీ గృహే వర్ధనమ్**
**మాయాపూతన జీవితాపహరణం గోవర్ధనోద్ధారణమ్**
**కంసచ్ఛేదన కౌరవాది హననం కుంతీసుతాంపాలనమ్**
**ఏతత్ భాగవతం పురాణకథితం శ్రీకృష్ణలీలామృతమ్**

శ్రీకృష్ణలీలలను వర్ణించలేము. విన్నా, చదివినా తనివి తీరదు. లీలామానుష విగ్రహరూపుడైన ఆ నందనందునిలో చిలిపితనం, శృంగారం, శౌర్యం, లోకోపకారం, ధర్మం, ఇలా ఏభావనతో చూసినా అవన్నీ శ్రీకృష్ణ పరమాత్మలో కనిపిస్తాయి. యశోదమ్మ ముద్దుల తనయుడు, రాధాగోపీజన మనోహరుడు, తత్వోపదేశకుడు, ధర్మస్థాపకుడు, సర్వశ్రేష్ఠమైన విశ్వతత్వాన్ని మానవాళికి తెలియజేసి మార్గదర్శకం చూపించిన జగద్గురువు శ్రీకృష్ణుడు సదా పూజనీయుడు.

శ్రీకృష్ణనామంలో నిరవధిక ఆనందం ఉంది. 'కృష్ణ' అన్న రెండు అక్షరాలు ప్రణవమంత్రంతో సమానమైనవి. అనేక భయాలను, అనేక విఘ్నాలను తొలగించి, విజయమార్గంలో నడిపించే అద్భుత చైతన్యనామం శ్రీకృష్ణ నామం. సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ. ఆనందోబ్రహ్మ వంటి ఉపనిషత్ వాక్యాల సారం శ్రీకృష్ణనామమే. తనివితీరా కృష్ణా అని పిలిస్తే చాలు మనసులో అలౌకిక ఆనందం మన సొంతమవుతుంది. ఆగస్టు 14 'శ్రీకృష్ణాష్టమి' సందర్భంగా ఆ దివ్యలీలలను మరోసారి స్మరించుకుందాం.

### శ్రీకృష్ణ జన్మాష్టమి

రోహిణీ నక్షత్రంతో కూడిన శ్రావణ బహుళ అష్టమి తిథే శ్రీకృష్ణ జన్మాష్టమి. దీన్నే గోకులాష్టమి, శ్రీజయంతి, కాలాష్టమి అని కూడా అంటారు. భూదేవి ప్రార్థన మేరకు, సాక్షాత్తూ విష్ణుమూర్తి వృష్ణి వంశంలో, యదుకులంలో, అర్ధరాత్రి సమయాన, కంసుని చెరసాలలో దేవకీదేవి అష్టమగర్భాన జన్మించాడు. జన్మిస్తూనే శంఖ చక్ర గదా పద్మములు ధరించిన చతుర్బాహువులతో జననీజనకులకు తన నిజరూప సందర్శన భాగ్యం కలిగించిన మధుమోహనుడు కృష్ణుడు. తన జన్మ కారణాన్నీ, వారి తక్షణ కర్తవ్యాన్నీ వివరించాడు.

**యథాయథాహి ధర్మ స్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుద్ధానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం!!**
**పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే!!**

ధర్మగ్లాని సంభవించినప్పుడు ధర్మ సంరక్షణకు అవతరిస్తానని చెప్పాడు. చెప్పినమాట ప్రకారం ధర్మరక్షణ చేసి జాతిని ధర్మరథం ద్వారా గమ్యానికి నడిపించి, లోకంలో సుస్థిరత కల్పించడానికి అవతరించాడు పరమాత్ముడు. శ్రీకృష్ణుడికి ఎనిమిది సంఖ్యకు సంబంధం ఉంది. ఆయన పుట్టిన తిథి అష్టమి. దశావతారాల్లో ఎనిమిదవ అవతారం శ్రీకృష్ణుడు. దేవకీ వసుదేవులకు అష్టమగర్భంలో జన్మించినవాడు. ఆయనకు ఎనిమిదిమంది సతులు. కృష్ణుని జన్మనక్షత్రమైన రోహిణి, నక్షత్రక్రమంలో నాలుగవది. అంటే అష్టమ సంఖ్యలో సగం. పదహారు వేలమంది గోపికలు. పదహారు సంఖ్యలో సగం ఎనిమిదే!!

### జగత్ రక్షకుడు ఆ పరమాత్మ

**'యతో ధర్మస్తతో కృష్ణ, యతో కృష్ణస్తతో జయతి'**

అంటే ఎక్కడైతే ధర్మం ఉంటుందో అక్కడ కృష్ణుడు ఉంటాడు. ఎక్కడ కృష్ణుడు ఉంటాడో అక్కడ విజయం ఉంటుంది. ఆనాడు పాండవులపక్షంలో ఉండి ధర్మాన్ని కాపాడి వారికి విజయం చేకూర్చాడు. ఆనాడే కాదు, ఈనాడూ భక్తులకు ఇదే సూత్రం వర్తిస్తుంది. సదా ఆ కృష్ణపరమాత్ముడినే నమ్మి, ధర్మాన్ని ఆచరించేవారి పక్షాన నిలిచి ఆ భక్తులకు

## • జన్మాష్టమి వ్రతం •

శ్రీకృష్ణ జన్మాష్టమి వ్రతం మహాఫలప్రదం. అత్యుత్తమం, సకల కల్యాణకరం అని బ్రహ్మవైవర్త పురాణంలో పేర్కొనబడింది. నాటి నుంచి నేటి వరకూ శ్రీ కృష్ణాష్టమిని కన్నుల పండువగా దేశప్రజలందరూ జరుపుకోవడం ఆనవాయితీ, సంప్రదాయం. ఈ పుణ్యదినాన ఉదయమే లేచి నువ్వుల పిండి నలుగు పెట్టుకొని, అభ్యంగన స్నానం చేయాలి. పగలు ఉపవాసం చేయాలి. కృష్ణుడు రాత్రి పుట్టినందున రాత్రి శ్రీకృష్ణపూజ నిర్వహిస్తారు. తులసీదళాలు స్వామికి సమర్పించాలి. బాలకృష్ణునికి పాలు, వెన్న, అటుకులు, బెల్లం, శొంఠిపొడి, నెయ్యి, వేయించిన మినపప్పులతో ప్రసాదం తయారుచేసి, నైవేద్యంగా పెట్టి స్వీకరించాలి. ఇది ఆరోగ్యానికీ, జాగరణకీ చాలా మంచిది. చిన్నికృష్ణుడు ఇంటిలోకి వస్తాడనడానికి సూచనగా ఆరోజు ముగ్గుతో ఇంటిముందు శ్రీకృష్ణుడి పాద ముద్రలు వేస్తారు. చిన్నపిల్లలకు రాధాకృష్ణుల వేషధారణ చేస్తారు. దేశంలోని అన్ని రాష్ట్రాల్లోనూ ఉట్టికొట్టే ఉత్సవం చేస్తారు.



# చిరునవ్వే కృష్ణతత్వం

కృష్ణుడు మానవజన్మ ఎత్తాడు, మానవునిగానే పెరిగాడు, అనేక కష్టసుఖాలు అనుభవించాడు. చివరకు బోయవాని చేతిలో ప్రాణం వదిలాడు. అయినప్పటికీ ఆయనను మనం దైవంగా భావిస్తాం. ఎందుకంటే కృష్ణుడు స్థితప్రజ్ఞుడు. ఎలాంటి విపత్కర పరిస్థితి వచ్చినప్పటికీ ఆయన మోముపై చిరునవ్వు చెరగదు. శ్రీకృష్ణుని జీవితం పూల పాన్పుకాదు. పసిగుడ్డుగా ఉన్నప్పటి నుంచీ జీవన్మరణ సమస్యే. కన్నయ్యను వధించేందుకు మేనమామ కంసుడు ఎన్నో ఎత్తుగడలు వేశాడు. పూతన, శకటాసుర, బకాసుర, వృషభాసురాది రాక్షసులను ఉసిగొల్పాడు. వీరితో పోరాడితేగానే కృష్ణుడికి విజయం దక్కలేదు. చిరునవ్వుతోనే సవాళ్ళను స్వీకరించాడు, ఆత్మబలంతో విజయాలు అందుకున్నాడు. ముసలంపుట్టి యాదవ వంశం నశించినా అదే చిరునవ్వు, విజయాలు వరించినా అదే చిరునవ్వు. అదే శ్రీకృష్ణతన్మయానంద తత్వం. అందుకే నేటికాలంవారు కృష్ణుడిని మేనేజ్‌మెంట్ గురువుగా అభివర్ణిస్తుంటారు.



విజయాన్ని అనుగ్రహిస్తాడు. భగవద్గీతలో 'అనన్యాశ్చింతయంతోమాం' అంటూ కృష్ణభగవానుడు స్వయంగా హామీ ఇచ్చాడు కదా! 'యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు' అని ఆహార విహారాలలో మానవుడి జీవనగమనం గురించి, అంత్యకాలంలో తననే స్మరిస్తూ శరీరాన్ని వీడినవాడు తన స్వరూపాన్నే పొందుతాడని, పగటిని జీవి ఉత్పత్తితోనూ, రాత్రిని తుది ఘడియగానూ విశ్లేషించాడు. ప్రతిఫలం ఆశించక ఎల్లప్పుడూ తనభక్తులను రక్షిస్తూ, సంసార సాగరం నుంచి తరింప చేస్తాడు. కృష్ణునియందే ఈ సకల జగత్తు ఆధారపడి ఉంది. మనసులో మాధవుడై కొలువుండి జగదోద్ధారకుడై సకల జగత్తునూ సంరక్షిస్తున్నాడు. పత్రం, ఫలం, పుష్పం, తోయం ఇలా ఏది సమర్పించినా హృదయపూర్వకంగా స్వీకరించి, అపరిమిత అనుగ్రహాన్ని ప్రేమగా అందించే భక్తవత్సలుడు శ్రీకృష్ణపరమాత్మ.

### ఆదర్శానికి నిదర్శనం

మర్యాదపాలన, నిరంకుశ నిర్మూలనతో సంపూర్ణ మానవజాతి కల్యాణమే కాక సమస్త ప్రాణికోటి శ్రేయస్సు కోరి అవతరించిన శ్రీకృష్ణుడు దివ్యపురుషుడు. జీవితంలో ఎదురయ్యే అనేక పరిస్థితులను సమన్వయపరిచి ఎలా చతురతతో పరిష్కరించాలో తన జీవితచరిత్ర ద్వారా విశేషంగా తెలియజేశాడు. అందుకే ఆయన అపూర్వ విజయాలు సాధించిన చారిత్రక పురుషుడు. చెరసాలలో జన్మించి, గోసంరక్షునిగా పెరిగాడు. ఆదర్శ విద్యార్థిగా, కర్మయోగిగా, రాజశ్రేష్ఠుడిగా, మంచి మిత్రుడిగా, మానవజీవితాన్ని ఆదర్శంగా ఎలా గడపాలో లోకానికి చూపుతూనే మరోపక్క విశ్వరూప సందర్శనం, గీతాప్రవచన ఘట్టాలలో తన అవతార పరమార్థాన్నీ, భగవదాంశనూ ప్రదర్శించాడు. అర్ధరాత్రివేళ చీకటిలో వసుదేవుడు యమునానది దాటే సమయంలో సాక్షాత్తూ ఆ యమున వైదొలగి మార్గాన్నిచ్చిన వైనం చదివితే, భగవంతుడిని నమ్మినవారికి ఆయనే తోడు నిలిచి ముందుకు నడిపిస్తాడని మనకు అవగతమవుతుంది. తన వేణుగానంలో ఓలలాడించడంద్వారా మన వెన్నంటి ఉండేవారిని ఎల్లవేళలా సంతోషపరచాలని చెప్పాడు. ఎదుటివారి తప్పులను వీలైనంత వరకు క్షమించాలని, మితిమీరినప్పుడు దండించాలని తన మేనబావ శిశుపాలుడిని వధించడం ద్వారా తెలియజెప్పాడు. మేనమామ కంసుడు పంపిన రాక్షసులను వధించి దుష్టశిక్షణకు వయసుతో పనిలేదని చాటి ప్పాడు. ధర్మానికి హాని కలిగించినవారు ఎవరైనా సరే బాంధవ్యాలు, తరతమభేదాలకు తావులేకుండా శిక్ష అనుభవించాల్సిందేనని కంసవధ ద్వారా చాటి చెప్పాడు. స్నేహానికి అంతస్తులతో పనిలేదని కుచేలుని ఉదంతంతోనూ, కన్నవారైనా, పెంచుకున్నవారైనా ఒక్కటేనని తల్లిదండ్రులను ప్రేమించాలని యశోదమ్మకు పంచిన ప్రేమతోనూ నిరూపించాడు. వ్యవసాయం, పశుసంపదలవల్ల దేశం సౌభాగ్యంతో తులతూగుతుందని ప్రపంచానికి చాటి చెప్పాడు. ఇలా కన్నయ్య జీవితంలోని ప్రతి ఘట్టమూ ఆదర్శప్రాయమే.

### గీతాచార్యుడు గోవిందుడు

కృష్ణపరమాత్మ మనకు అందించిన పవిత్ర గ్రంథం భగవద్గీత. వేదసాహిత్యాన్ని అందరూ చదివి అర్థం చేసుకోలేరు. అందుకోసం ఉపనిషత్తులు వచ్చాయి. ఆ ఉపనిషత్తుల సారాంశమే భగవద్గీత. భక్తి, జ్ఞాన, కర్మ, ధ్యాన, అభ్యాసాలద్వారా నిరాకార తత్వాన్ని అందుకోవచ్చని గీత చెప్తోంది. భగవత్ తత్వం, ఆత్మతత్వం బోధించిన గ్రంథం భగవద్గీత.



కర్తవ్యహీనులకు కర్తవ్యం బోధించి, లక్ష్యం దిశగా నడిపించడమే భగవద్గీత లక్ష్యం. భగవద్గీత నేడు ఒక నిర్వహణా శాస్త్రగ్రంథంగా నిలిచింది. మేనేజ్మెంట్ కోర్సుల వ్యక్తులను, వనరులను ఎలా నిర్వహించాలో నేర్పుతుంటే, భగవద్గీత ఆత్మ నియంత్రణ, ఆత్మ నిర్వహణను నేర్పుతున్నది. అందుకే విశ్వవ్యాప్తంగా పలు విశ్వవిద్యాలయాలలో గీతను అత్యుత్తమ మేనేజ్మెంట్ గ్రంథంగా అధ్యయనం చేస్తున్నారు. యుద్ధరంగంలో నిలిచిన సంశయాత్మ అర్జునుడు. అతడికి భగవానుడు ప్రబోధించిన ఈ గీతను అన్ని ధార్మికవాదాల ఆచార్యులు తమతమ వాదాలకు ఆలంబనగా తీసుకున్నారు. ఆదిశంకరుల నుంచి మధుసూదన సరస్వతి వరకు భగవద్గీతకు భాష్యం చెప్పారు. భగవద్గీత అనువాదం లేని భాష లేదు. అంతటి మహత్తరమైన భగవద్గీత గ్రంథాన్ని కేవలం ఆరాధించడం లేదా పఠించడంవల్ల ప్రయోజనం లేదు. గీతాసారాన్ని అర్థం చేసుకున్నప్పుడే జీవితానికి సార్థకత. అందుకే, 'భగవద్గీతలో ఒక్క శ్లోకాన్నైనా అర్థం చేసుకుని జీవితంలో అనుసరిస్తే మోక్షం లభిస్తుంది' అని ఆదిశంకరులు తమ భజగోవిందంలో బోధించారు. శ్రీకృష్ణ పరమాత్మ నడిపించిన మహాభారత గాథ చిరస్మరణీయం. నిత్యనూతనమైన శ్రీకృష్ణగాథ ఏనాటికీ మాయని అమరగాథ.

అణువోగాక కడున్ మహావిభవుడో యచ్చిన్నుడో ఛిన్నుడో
గుణయో నిర్గుణుడో, యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్వమో
ర్గణులై యే విభుపాదపద్మ భజనోత్కర్షంబులం దత్త్వ వీ
క్షణముం జేసెద రట్టి విష్ణు పరమున్ సర్వాత్ము సేవించెదన్

అనే పోతన పదములు నిజరూపంగా అంతరంగంలో పరంధాముడై ఆవిష్కరించబడతాయి. చరిత్రకే మార్గదర్శకుడై సంభవామి యుగే యుగే అంటూ సర్వకాల సర్వావస్థలలో దేవదేవుడై, దుష్టశిక్షకుడై, శిష్ట రక్షకుడై బాసటగా నిలుస్తాడు శ్రీకృష్ణ భగవానుడు.

—సంతోషలక్ష్మి దహగాం



# రోల్ మోడల్స్

పి.వి.డి.ఎస్. ప్రకాష్

**"సిన్మాలు చూస్తావా?" తన ఎదురుగా ఉన్న కుర్చీలో అతి నిర్లక్ష్యంగా కూచున్న పదిహేనేళ్ళ మేనల్లుడు తేజ వంక కించిత్ కోపంగా చూస్తూ అడిగాడు సూర్యం.**

**"ఓ...చూస్తాను. స్కూల్లోకన్నా థియెటర్లో ఉండటమే నాకెంతో ఇష్టం" అన్నాడు వెకిలిగా నవ్వుతూ.**

**"వారానికి ఎన్ని సినిమాలు చూస్తావ్"**

**"ఏడు రోజులూ ఏడు సినిమాలు. ఒక్కోసారి చూసిన సినిమాల్నే మళ్ళీమళ్ళీ చూస్తుంటాను. ఎందుకంటే, ఆ హీరోయిజాన్ని ఒంటబట్టించుకుంటేనే కదా స్కూల్లో ఆడపిల్లలందరి ముందూ నా కాల రెగిరేది" లేటెస్ట్‌గా చూసిన ఓ సినిమాలో హీరోలా చూయింగ్ గమ్ నములుతున్నట్టు ఫోజిస్తూ స్టయిల్‌గా ఒక్కోపదాన్ని ఒత్తిమరీ చెప్పాడు తేజ.**

'చెల్లాయ్, నీ కొడుకు చెడిపోయాడే. వీడిని బాగుచేయడం నావల్ల కాదేమో? అనవసరంగా పిలిపించావ్ నన్ను' మనసులోనే అనుకున్నాడు సూర్యం. రెండ్రోజుల క్రితం మాధవి హైదరాబాద్ నుంచి విజయవాడలో తన పుట్టింటికి ఫోన్‌చేసి "ఒరేయ్ అన్నాయ్! నువ్వొకసారి అర్జంట్‌గా రావాలిరా" అంది ఇంచుమించు ఏడుపుగొంతుతో.

"ఏమైందే? బావ కానీ మళ్ళీ గృహహింస పెడుతున్నాడా?" ఆత్రుతగా అడిగాడు సూర్యం.

"బావని ఏమీ అనకు, కళ్ళు పోతాయి. ఏదో పెళ్ళైన మొదటి రెండేళ్ళలో అత్తగారు బతికున్న రోజుల్లో ఇబ్బంది పెట్టినమాట నిజమేగానీ, నువ్విచ్చిన షాక్ ట్రీట్‌మెంట్‌తో అప్పుడే దార్లోకి వచ్చాడు. అయితే, ఈసారి దారితప్పుతున్నది నీ మేనల్లుడు తేజ. టెన్త్‌క్లాస్‌లోకి వచ్చాడేగానీ, బుద్ధీ జ్ఞానం లేదు. పొద్దస్తమానం సినిమాలు, షికార్లు, ఇంటికివచ్చి పోకిరీ డైలాగులు, రౌడీ ఫోజులు. వాణ్ణి అదుపులో పెట్టాలని నేనూ, మీ బావ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. వాణ్ణి అలా వదిలేస్తే మనకు కాకుండాపోయే ప్రమాదం ఉంది" కంప్లయింట్ చేసింది మాధవి.

"పిల్లల్ని పెంచడం ఓ ఆర్ట్. ఆ ఆర్ట్ మీ ఇద్దరికీ లేకపోయింది. ముద్దొస్తున్నాడని పెద్దయినా చంకన ఎక్కించుకున్నారు. ఇక వాడు ఆడింది ఆట, పాడింది పాటగా చలామణీ అవుతోంది. ఇంతకీ అక్కడికి నేను వచ్చి మాత్రం చేసేదేముంది?" అడిగాడు సూర్యం.

"పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తున్నావు కదా! నువ్వంటే కాస్తంత భయం వాడికి. ఓసారి నువ్వు వచ్చి అదరించో బెదరించో దార్లోకితెస్తే బాగుంటుంది. ఉన్నపాటున ఈ రాత్రికే బయల్దేరి రా"

హడావుడి చేసింది చెల్లెలు.

“సరే...వస్తాన్లే! మీ ఇద్దరిమాట విననట్టే వాడు నామాట కూడా వినకపోతే నా ఖాకీ డ్రస్ పరువే పోతుంది” అన్నాడు సూర్యం.

“అలా జరగదనే అనుకుంటున్నాను, త్వరగా రా” అంటూ ఫోన్ పెట్టేసింది మాధవి. చెల్లెలు అప్పగించిన అసైన్‌మెంట్ మేరకు ఉదయానికల్లా ఇంట్లో వాలిపోయాడు సూర్యం. సాయంత్రం వాడు కాలేజీ నుంచి వచ్చేదాకా ఆగి...ఇదిగో ఇలా ఇంటరాగేషన్ మొదలెట్టాడు. పదిహేనేళ్ళ వయసంటే, ఓ పక్క సెలవు పుచ్చుకుంటున్న బాల్యం, మరోపక్క నూనూగు మీసాల నూతన యవ్వనంలోకి అడుగిడుతున్న ప్రాయం. అది టీనేజ్ గందరగోళం. చుట్టూ చూస్తున్న ప్రపంచం అర్థమై, అర్థంకాని దశ అది. ఏది మంచో, ఏది చెడో తెలిసే వయసు కాదది. చేస్తున్న స్నేహాలు, చూస్తున్న సినిమాలు బ్రహ్మజెముడు డొంకల్లోకి నడిపిస్తుంటే... గమ్యం తెలియకుండా ప్రయాణించే వయసు అది. అందుకే వాడి ఆలోచనలు పసిగట్టే ప్రయత్నంలో మాధవి ఇచ్చిన వేడివేడి కాఫీ నెమ్మది నెమ్మదిగా సిప్ చేస్తూ తేజాతో సంభాషణ ప్రారంభించాడు సూర్యం. అయితే, గతంలో కన్నా ఈసారి తేజాలో కొట్టొచ్చిన మార్పు వాడు కూర్చోవడంలోనే కనిపెట్టాడతడు. నుదుటిపై అల్లరల్లరిగా ఎగురుతున్న ముంగురుల్ని సవరించుకోవడంలోనే చిన్నపాటి పొగరు కనిపిస్తోంది. కాలుమీద కాలు వేసుకుని కూచున్న భంగిమ పెద్ద వాళ్ళపట్ల ఆ వయసులో ఉండాల్సిన వినయం కొరవడిందన్న సంగతి చెప్పకనే చెబుతోంది. జవాబు చెబుతూ తల ఎగరేయడంలోనే నిర్లక్ష్యం ప్రత్యక్షమవుతోంది.

‘తన కొడుకు తనముందు ఇలాగే బిహేవ్ చేస్తే లాగి ఒక్కటిచ్చేవాడు. కానీ, ఇది తన ఇల్లు కాదు. తన చెల్లాయిది. చెల్లాయి తనొదిలేసిన పాలు తాగి, తన రక్తం పంచుకున్నదే అయినా, బావ పరాయివాడే. తెలియని కొన్ని హద్దుల్లో ఉంటూనే వాడిలో పరివర్తన తీసుకురావాలి. ఖాకీబట్టలేసుకున్న పోలీస్ డిపార్ట్‌మెంట్ వాడైనప్పటికీ, కరడుకట్టిన దొంగతో వ్యవహరించినట్టు వీడితో వ్యవహరించకూడదు. అలాగని మెత్తబడ్డానన్న భావం వాడిలో కలుగనీయకూడదు. కత్తికున్న పదును చూపిస్తూనే గాయం చేయకుండా అతి సున్నితంగా వాడిని హేండిల్ చేయాలి. ఎంత పరీక్షపెట్టావే’ అనుకున్నాడు సూర్యం.

‘వాడి అభిరుచులు, స్నేహితులు, సినిమాలు, నచ్చే హీరోలు, హీరోయిన్లు, ఇలా ఒక్కొక్క సంగతి తెలుసుకుంటే వాడి మనస్తత్వం కొంతలో కొంత అర్థమవుతుంది. వాడు ఏ దిశగా ప్రయాణిస్తున్నాడో అవగతమవుతుంది. ఆ తర్వాతే... వాడికి చేయాల్సిన చికిత్స చేసేందుకు వీలవుతుంది అనుకుంటూ’, “ఏ హీరో సినిమాలు చూస్తావ్?” అడిగాడు.

కొండవీటి చాంతాడంత లిస్టు వరుసపెట్టి చదివాడు తేజ. వాడు చెప్పిన ఏ ఒక్కడూ సూర్యం దృష్టిలో హీరోయే కాదు. అందుకు కావాల్సిన ఉదాహరణల్ని గుక్కతిప్పుకోకుండా ఇవ్వగలిగిన సమర్థత కూడా అతడికి ఉంది. తేజ చెప్పిన ఏ హీరోకి కూడా అర్థవంతంగా ఓ డైలాగ్ చెప్పడం రాదు సరి

**ఒకప్పుడు యువతకు మహాత్మాగాంధీ జవహర్‌లాల్ నెహ్రూ, స్వామి వివేకానంద వంటివారే రోల్ మోడల్స్.**
**కానీ ఇప్పుడు....! కాలం మారింది. డబ్బు సంపాదనే ఏకైకలక్ష్యంగా అంతులేని అక్రమాలకు పాల్పడిన నేరస్థుడే ఈ కథలో ఒక నవయువకుడికి రోల్‌మోడల్!**
**తప్పుదోవ పడుతున్న ఆ యువకుణ్ణి చూసి ఆవేదన చెందాడతను. ఆ నవయువకుడి జీవితాన్ని చక్కదిద్దేందుకు అతను చేసిన ప్రయత్నం ఫలించిందా?**

కదా, సీన్ డిమాండ్‌ను బట్టి ఆర్ద్రంగా హావభావాల్ని ప్రదర్శించడం కూడా అసలు రాదు. ఇక వాళ్ళు నటించిన సినిమా శీర్షికలా? ‘డర్టీరోగ్’, ‘స్టుపిడ్’, ‘జులాయి రాజా’, పోకిరీ రాణి, నంబర్ వన్ చోర్....ఇలా పేర్లలోనే విలనిజాన్ని సంపూర్ణంగా నింపుకుంటూ ఆ సినిమాల్లో హీరోలనిపించుకుంటున్న విలన్లు వాళ్ళు. రెడ్‌కార్పెట్ పరచిన వారసత్వంతో స్టూడియోల్లో దర్జాగా జొరబడి కన్ను ముక్కు తీరు బాగుండకపోయినా వరుస ప్లాస్టిక్ సర్జరీలతో ఏ భావం పలకని చెక్కముఖాల్ని చెక్కుకుని స్క్రీన్‌ని షేర్ చేసుకుంటున్న వారే వాళ్ళంతా అని సూర్యం నిశ్చితాభిప్రాయం. అలాంటివాళ్ళు తేజాకి రోల్‌మోడల్స్!

“అస్తమానం సినిమాలే అంటే క్లాసు పుస్తకాలు ఎప్పుడు చదువుతావు?” అడిగాడు సూర్యం.

“క్లాసు పుస్తకాలా?” హేళనగా నవ్వి, “చదువుకుని ఉద్యోగం చేస్తున్నవాళ్ళే పైకొస్తారా?” సూర్యానికి ఎదురుప్రశ్న వేశాడు తేజ.

“ఏం ఉద్యోగం చేయాలన్నా చదువంటూ చదవాలి కదా!”

“అంకుల్, మీకు వల్లభ్ తెలియదా?” అడిగాడు తేజ.

“ఎందుకు తెలీదు...! బాగా తెలుసు” అన్నాడు.

వల్లభ్ అవినీతికి మారుపేరు. డబ్బు సంపాదించడమే ఏకైక లక్ష్యంగా అతడు చేసిన అక్రమాలకు అంతేలేదు. తలపండిన రాజకీయ నేతలతోపాటు, తలొంచుకుని పనిచేసే అధికారులు, పారిశ్రామికవేత్తలు...ఇలా ఎంతోమంది ఆ అక్రమాల్లో ఇరుక్కుని న్యాయస్థానాల చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. వల్లభ్ ఆర్జించిన అవినీతి సొమ్మెంతో లెక్కలు కట్టడం ప్రభుత్వాలవల్ల కూడా కాలేదు. అవినీతి నిరోధకశాఖ నమోదుచేసిన కేసుల్లో ఏ వన్ నిందితుడతడు. ఇప్పటికీ ఆ కేసులు న్యాయస్థానాల్లో విచారణలో ఉన్నాయి. రేపోమాపో వల్లభ్‌ని అరెస్టు చేసి జైలుకు పంపిస్తారనే ఊహాగానాలు మీడియాలో జోరుగా ప్రసారమవుతున్నాయి.

## సినిమాలు కాకపోతే వ్యవసాయం చేస్తుందట!

వ్యవసాయం చేయాలన్న కోరిక ఏ హీరో కన్నా కలిగితే అతని సింప్లిసిటీని అందరూ మెచ్చుకుంటారు. కానీ ఇలాంటి కోరిక హీరోయిన్ శ్రద్ధాకపూర్‌కి కలిగింది. తనకు వ్యవసాయం అంటే ఎక్కువమక్కువట! భవిష్యత్తులో సినిమాలు వదిలేస్తే కచ్చితంగా ఇంటికి వెళ్ళి పొలం పనులు చేసుకుంటానని చెబుతోంది. వినడానికి ఇది కొద్దిగా వింతగా ఉన్నా సినిమాల తరువాత తను చేసేపని అదే అంటోంది. ఇంటికి వెళ్ళి రకరకాల కూరగాయలు పండిస్తానని అంటోంది. హీరోయిన్లు ఇతర వ్యాపారాల మీద ఆధారపడుతుంటే శ్రద్ధా మాత్రం పుడమి తల్లిని నమ్ముతానంటోంది.



"వల్లభ్‌లో ఏం చూశావ్?" అడిగాడు సూర్యం.

"తెలివి" అన్నాడు చటుక్కున తేజ.

"తెలివా?"

"ఔను. తెలివే. చట్టాలు చేసిన ప్రభుత్వాల్ని సైతం దద్దమ్మలుగా చేసి తానేంటో ప్రూవ్ చేసుకున్నాడు."

"రేపోమాపో జైలుకి పోతాడు కదా!"

"అంత ధైర్యం ఎవరు చేస్తారు?" ప్రశ్నించాడు తేజ.

"న్యాయం గెలుస్తుంది. ధర్మం నిలుస్తుంది. సత్యం జయిస్తుంది. అన్యాయాలు, అరాచకాలు, ఎంతోకాలం చెల్లవు" చెబుతున్న సూర్యం మాటలకు మద్దతు ఇస్తున్నట్టుగా టీవీలో ఓ బ్రేకింగ్ న్యూస్ వెల్లడైంది. చెవులు దద్దరిల్లిపోయేట్టుగా బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్. "కోట్లాదిరూపాయల అవినీతి కేసులో వల్లభ్ అరెస్ట్" అంటూ గ్రాఫిక్ ప్లేట్ల హడావుడి మధ్య న్యూస్‌యాంకర్ గొంతుచించుకునిమరీ అరుస్తోంది.

విజయగర్వంతో తేజావైపు చూశాడు సూర్యం. ఆ చూపుల్లో 'చూశావుగా, అవినీతికి పాల్పడితే ఏమైందో' అనే అర్థం ఉంది.

'జైల్లో వల్లభ్‌కి కేటాయించిన నంబర్ 7702. వల్లభ్ సామాన్య ఖైదీతప్ప అతడికి ప్రత్యేక సౌకర్యాలు లేవు. జైల్లో వల్లభ్ మొదటిరాత్రి...ఒకే ఒక్క రోటీ, అరగ్లాసు పాలతో సరిపెట్టుకున్నాడు. దోమలతో అర్ధరాత్రివరకు నిద్రపోలేదు. ఉదయం లేచిన వెంటనే అరగంట వ్యాయామం. ఆ తర్వాత స్నానం, పావుగంట పాటు మెడిటేషన్, అనంతరం పత్రికా పఠనం...' ఇలా మీడియా కథనాలు పోటెత్తాయి.

అవినీతి సొమ్ముతో రాజమహల్ లాంటి అత్యాధునిక భవంతిని కట్టి, అందులో సకల సౌకర్యాలు అనుభవించిన వల్లభ్, జైల్లో పడుతున్న ఇబ్బందులు వార్తాపత్రికలకు వరుస కథనాలయ్యాయి. 'అడవిలో ఉన్నా, కటకటాల మధ్య ఉన్నా పులి పులే' మురిసిపోతున్నాడు తేజ.

"ఎందుకలా?" అడిగాడు సూర్యం వాడి ఆనందానికి కారణం ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలంతో. "వల్లభ్‌ని జైల్లోనే పెట్టారుకానీ, అతడి గురించి ప్రసారమవుతున్న వార్తలు హీరో వర్షిప్‌ని పెంచేలా లేవూ..."

## నవ్వుల రమణయ్య

అలనాటి మేటి హాస్యనటుడు రమణారెడ్డి మొదట్లో హెల్త్‌ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి ఇంటర్వ్యూ నిమిత్తం ఒకప్పటి బెజవాడ వెళ్లారు.

ఇంటర్వ్యూలో అధికారి రమణారెడ్డిని రెండు ప్రశ్నలు అడిగారు.



"మురికి కాలువల్ని ఎవరు శుభ్రం చేస్తారు?"

"సూర్యుడు".

"రోడ్లప్రక్కన మనుషులు విసర్జించిన మలాన్ని ఎవరు శుభ్రం చేస్తారు?"

"పందులు"

అధికారి నవ్వుకున్నాడు ఈ సమాధానాలకు.

'అయ్యా, నేను బెజవాడ వచ్చినప్పట్నుంచీ చూస్తున్నా. మీరు అడిగిన రెండు పనులూ నే చెప్పిన వారే చేస్తున్నారు" అన్నారు రమణయ్య.

తర్వాత రమణారెడ్డి హెల్త్ ఇన్‌స్పెక్టర్‌గా ఉద్యోగంలో చేరారు.

*సేకరణ: ఎస్. తారకరామారావు*

"అంతులేని విలాసాల్లో తేలియాడిన ఓ అవినీతి స్వామ్రాట్ జైల్లో పడుతున్న కష్టాలకు కలరింగ్ ఇచ్చి టీఆర్పీ రేటింగ్ పెంచుకుంటున్న మీడియాను చూస్తే జాలేస్తోంది" అన్నాడు సూర్యం.

"అయినా చట్టం తనపని చేసుకుంటూనే పోతుంది. తప్పుచేసినవాళ్ళని ఎక్కడ ఉంచాలో అక్కడే ఉంచింది" అన్నాడు మళ్ళీ.

"తనపని తాను చేసుకున్నట్టు కనిపిస్తుంది కానీ, అజ్ఞాతంగా ఆ చట్టాన్ని నడిపించేవాళ్ళున్నారు" అన్నాడు తేజ. పదిహేనేళ్ళ తేజ ఓ పోలీసు ఆఫీసర్‌కి చట్టం గురించి చెబుతున్నాడు. అతడివైపు ఆశ్చర్యంగా చూశాడు సూర్యం.

"చట్టానికి నువ్వు ఏ నిర్వచనం ఇచ్చినా సరే, వల్లభ్ ఇప్పుడు జైల్లో ఉన్నాడన్న సంగతి కొట్టిపారేయలేని నిజం. తగినశాస్తే జరిగింది" అన్నాడు సూర్యం.

"బెయిల్‌కి అప్లయ్ చేశాడుగా..." చెప్పాడు తేజ.

"బెయిల్ మంజూరైతే కదా!"

"ఎందుకు రాదు..."

"వల్లభ్ అవినీతిపరుడు. అందుకే బెయిల్ రాదు" అన్నాడు సూర్యం.

"బెయిల్ ప్రతిపౌరుడి హక్కు. పౌరుడిగా వల్లభ్‌కి కూడా ఆ హక్కు ఉంటుంది. కచ్చితంగా అతడు బయటకు వస్తాడు" న్యాయశాస్త్రం పుక్కిటపట్టిన ఓ న్యాయవాదిలా అన్నాడు తేజ. వాడి మాటల్నిబట్టి వాడు వల్లభ్‌కేసు క్షుణ్ణంగా పరిశీలిస్తున్నట్టు అర్థమవుతోంది. ఆ కేసుకు సంబంధించిన వార్తా కథనాలు, టీవీల్లో మేధావులు, న్యాయశాస్త్ర కోవిదుల చర్చోపచర్చలు, పోలీస్, ఏసీబీ అధికారుల వాదోపవాదాలు....ఇలా ఎన్ని వున్నా అతడికి సపోర్ట్ చేయడానికి యువత వెనుకాడడం లేదంటే, అతడి ప్రభావం ఎంతలా ఉందో ఇట్టే అర్థమవుతోంది. బెయిల్ ఇచ్చి వల్లభ్‌ను వెంటనే విడుదల చేయాలంటూ కొన్నిచోట్ల కొంతమంది యువకులు రిలే నిరాహారదీక్షలు చేశారు. మరికొంతమంది మహిళలు ప్రతిఊళ్ళోనూ బృందాలుగా ఏర్పడి అన్ని మతాలకు చెందిన మందిరాల్లో ప్రార్థనలు చేస్తున్నారు. ఈ సమాజానికి ఏమైంది? అవినీతిపరుడనే ముద్రతో జైలుకు వెళ్ళిన ఓ వ్యక్తికి మద్దతుగా ఉద్యమిస్తోంది. వెల్లువలా సానుభూతి వ్యక్తం చేస్తోంది. ఆలోచనలతో వేడెక్కిపోతున్నాడు సూర్యం. ఇక, అక్కడ ఉండి చేసేదేమీ లేక మాధవితోచెప్పి ఆ రోజే విజయవాడ బయలుదేరిపోయాడు. వెళుతూ వెళుతూ తేజాని పిలిచి, "చిల్లర సినిమాలు జీవితాన్ని ఇవ్వవు. వల్లభ్‌లాంటి వ్యక్తుల్ని ఆరాధిస్తే ఒరిగేదేం లేదు. స్పష్టంగా నీకు ఒక్కటే చెప్పదలుచుకున్నాను. ఈ వయసులో నువ్వు నమ్ముకోవాల్సింది తరగతిగదినే. ఆరాధించాల్సింది చదువు నేర్పించే గురువుల్ని. పూజించాల్సింది అక్షరాల్ని. ఆ అక్షరాల్ని నెత్తినపెట్టుకున్న పుస్తకాల్ని. ఈ విషయాలు మస్తిష్కానికి ఎక్కించుకుంటే బాగుపడతావు. లేకుంటే...." మిగిలిన వాక్యం పూర్తిచేయలేకపోయాను. శాపనార్థాలు పెట్టడానికి వాడు పరాయివాడు కాదు. ఎంతైనా వాడు నా చెల్లెలు కొడుకు...మేనల్లుడు.

***

నెలలు గడుస్తున్నాయి. అడపాదడపా మాధవికి ఫోన్‌చేసి తేజ గురించి ఆరా తీస్తూనే ఉన్నాడు సూర్యం. ఎప్పట్లాగానే మాధవి "వాడిక బాగుపడడన్నాయ్...చెడు తిరుగుళ్ళు ఎక్కువయ్యాయి" అంటూ బాధపడుతూ ఉంది. ఒకవైపు నెలలు గడిచినా వల్లభ్‌కి బెయిల్ మంజూరు కాలేదు. దాంతో, వల్లభ్ సమస్య సమాజ సమస్యగా మారింది. ఈ కేసులో ఎన్నో భావోద్వేగాలు. మొగుడికి దూరమైన భార్య ఆక్రందన, పిల్లల ఆవేదన వెరసి సెంటిమెంట్‌తో వండి వడ్డించిన తెలుగు సినిమా చూస్తున్నట్టు ఈ కేసును ప్రజలంతా ఉత్కంఠతో వీక్షిస్తున్నారు. వల్లభ్‌కి సంబంధించి ఏ చిన్న వార్త వెలువడినా అది ప్రముఖంగానే ప్రచురితమవుతోంది. అన్ని కేసుల్లోనూ మీడియా ఇంత ఇదిగా స్పందిస్తోందా? అంటే కచ్చితంగా లేదనే సమాధానం వస్తుంది.

ఓ రోజు అనూహ్యంగా వల్లభ్‌కి బెయిలు మంజూరైంది. అదీ షరతులతో కూడిన బెయిల్. సిటీ విడిచి ఎక్కడికీ వెళ్ళకూడదనేది ప్రధాన షరతు. అలాగే, ఈ కేసుకు సంబంధించిన కీలక వ్యక్తుల్ని



## ఆ కారణంతో సినిమాలు చేయడం లేదట!

అందంగా లేకపోతే, నటించడం రాకపోతే హీరోయిన్‌గా అవకాశాలు రాకపోవచ్చు. కానీ ఓ హీరోయిన్ విషయంలో ఆమె ఎత్తు ఆమెకు శాపంగా మారిందట! తెలుగులో చేసినవి తక్కువ సినిమాలే అయినా ఎక్కువ పేరు తెచ్చుకున్న హీరోయిన్‌గా అనుపమా పరమేశ్వరన్‌కు మంచి పేరుంది. అయితే ఆమె ఎత్తు తక్కువగా ఉండడం, టాలీవుడ్‌లో హీరోలందరూ ఆరడుగుల ఎత్తు ఉండటంతో వారి పక్కన అనుపమ మరీ పొట్టిగా కనిపిస్తుందని ఆమెకు అవకాశాలు ఇవ్వడం లేదట! తెలుగులో 'శతమానంభవతి' తరువాత అనుపమ కొందరు దర్శకులను కలిసి అవకాశాలు అడిగితే నువ్వు పొట్టిగా ఉన్నావని ఛాన్సులు ఇవ్వడం కుదరదని ముఖం మీదే చెప్పేశారట. వారి మాటలకు నొచ్చుకున్న అనుపమ ఇక ఎవరినీ ఛాన్సుల గురించి అడగకూడదని నిర్ణయించుకుందట! వారంతట వారుగా వస్తే తప్ప సినిమాలు చేయకూడదని డిసైడ్ అయిందట!

కలవకూడదని మరో షరతు. ఇలాంటి కొన్ని షరతులు విధించి మరీ బెయిల్ మంజూరు చేయడమంటే కాళ్లకి కస్టడీ సంకెళ్ళు వేసినట్టే. కాకపోతే, ఇల్లే జైలుగా మారుతుంది అంతే!

బెయిల్‌మీద విడుదలైన వల్లభ్ సృష్టించిన హడావుడి అంతాఇంతా కాదు. దేశం కోసం జైలుకు వెళ్ళిన మహానుభావుడిలా చిరునవ్వులతో మీడియా కెమేరాలకు ఫోజులు ఇవ్వడమే కాదు, జైలు నుంచి ఇంటికి వెళ్ళే మార్గంలో ఏడాదికి ఒకసారి జరిగే వినాయక నిమజ్జనంలాంటి పెద్ద ఊరేగింపు తీశాడు. వందలసంఖ్యలో వాహనాలు, వేలసంఖ్యలో అనుయాయులతో ఆ ఊరేగింపు సాగుతుంటే నగర వీధుల్లో ఎక్కడ చూసినా ట్రాఫిక్ జాం. అడుగుతీసి అడుగువేయడానికి కూడా వీలులేనంత రద్దీ.

టీఆర్‌పీ పెంచుకోవడమే ఏకైక లక్ష్యంగా నడుస్తున్న ఎలక్ట్రానిక్ మీడియా ప్రపంచంలోని మిగతా ముఖ్యవార్తలన్నింటినీ పక్కకునెట్టి మరీ ఊరేగింపును గంటలతరబడి లైవ్ టెలికాస్ట్ చేస్తోంది. మధ్య మధ్య కార్యకర్తల డ్యాన్స్‌లు మరింత ఫోకస్ చేస్తూ ప్రసారం చేస్తోంది.

పదిహేను, ఇరవైయేళ్ళ కుర్రాళ్ళే ఈ ఊరేగింపులో వినిపిస్తున్న పాటలకు అనుగుణంగా ఎగిరెగిరి డ్యాన్సులు చేస్తున్నారు. ఓ కుర్రాడి ఫేస్ పైనే కెమెరా ఫోకస్ చేస్తే, ఆ కుర్రాడిని చూసిన సూర్యం ఆశ్చర్యపోయాడు. వాడు మరెవడో కాదు, తేజ. తానెంతగానో అభిమానించే హీరోల డ్యాన్సుల్నీ స్టెప్పుల్నీ అనుకరిస్తూ పూనకం వచ్చినవాడిలా పేట్రేగిపోతున్నాడు. చుట్టూ జనపంజరం. చుట్టుముట్టిన వాహన శ్రేణులు. సామాన్య జనాల్ని ఇబ్బందులకు గురిచేస్తూ సాగిన ఆ ఊరేగింపు ఆ రోజు ఏ అర్ధరాత్రికో వల్లభ్ ఇల్లు చేరడంతో ఎట్టకేలకు ముగిసింది.

'హమ్మయ్య!' అని ఊపిరి తీసుకున్నారు జనం.

ఇక, ఓ క్షణం కూడా ఉండబట్టలేక మాధవికి ఫోన్ చేశాడు సూర్యం. "వాడున్నాడా?" అడిగాడు కోపంగా. "తేజాయేనా? ఇప్పుడే వచ్చాడు. ముఖం కాళ్లూ చేతులు కడుక్కుంటున్నాడు" చెప్పింది మాధవి.

"వాడికి ఒకసారి ఫోనియ్యి" అన్నాడు అసహనంగా. అయిదు నిమిషాల నిరీక్షణ తర్వాత ఫోన్‌లో తేజ గొంతు వినిపించింది. "హాయ్, మామయ్యా! లైవ్ చూశావా. నేనెంత బాగా డ్యాన్స్ చేశానో కదా!"

"అది డాన్సా? పిచ్చి గంతులు, కుప్పిగంతులు"

"అవే స్టెప్స్ సినిమాలో వేస్తే డ్యాన్సులనే అంటారులే మామయ్యా" అన్నాడు వాడు.

"అద్సరే! ఆ ఊరేగింపులో నువ్వెందుకు పాల్గొనడం"

"అదేంటి మామయ్యా అలా అంటావ్. వల్లభ్ నా రోల్‌మోడల్. ఆ సంగతి నీకూ తెలుసు కదా!"

"ఎలా రోల్‌మోడల్‌రా? వాడు చేసిన అవినీతికి, అక్రమాలకు అంతేలేదు" కోపంగా అన్నాడు సూర్యం.

"ఔనా! అయితే, ఈ సోకాల్డ్ ప్రభుత్వాలు ఏం చేయలేకపోయాయేం మావయ్యా? నీకు చెప్పేంతవాడిని కాదుగానీ, ఓ సంగతి చెబుతాను విను. అందరూ గొంగట్లో తింటున్నవాళ్ళే. పైగా వెంట్రుకలు వస్తున్నాయనే బాధ. అవినీతో, అక్రమమో... ఏం చేసైనా సరే..చేతుల్లో కరెన్సీ ఉంటే చాలు, ఈ సొసైటీని ఆటాడించొచ్చు. ఆ ఆటలో వల్లభ్ విజేత. నాలాంటి ఎందరికో స్ఫూర్తిప్రదాత. ఎస్. ఫ్యూచర్లో నేనూ ఓ వల్లభ్‌ని కావాలనుకుంటున్నాను. చాలీచాలని జీతాల్తో టెన్ టూ ఫైవ్ జాబ్‌లు నేను చేయను. నాకు నేనే బాస్‌ని. నా సామ్రాజ్యాన్ని నేనే నిర్మించుకుంటాను. అందులో, నల్లదో, తెల్లదో కోట్ల కొద్దీ డబ్బు నాకు ఎప్పుడూ అందుబాటులో ఉంటుంది..."

ఇంకా వాడేదో చెబుతున్నాడు. ఆ మాటలు వాడొక్కడే చెబుతున్నట్టు లేదు. సమాజంలో ఇరవైయేళ్ళ కుర్రాళ్ళంతా ఒకే గొంతుతో అరచి మరీ చెబుతున్నట్టుగా అనిపించింది సూర్యానికి. ఇందాకటి ఊరేగింపు ఇంకా కళ్ళముందు కదలాడుతుంటే, 'జై జై' నాదాలు అతడి చెవుల్లో గింగిర్లు తిరుగుతున్నాయి. సరిగ్గా అప్పుడే, సూర్యానికి తానెప్పుడో చదివిన స్వాతంత్ర్య సమరయోధుడు వావిలాల గోపాలకృష్ణయ్యగారి మాటలు గుర్తుకు వచ్చాయి. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"స్వాతంత్ర్యానికి ముందు యువతకో లక్ష్యం స్పష్టంగా ఉండేది. ఆ లక్ష్యం దేశానికి స్వాతంత్ర్యం తేవడమే. అప్పటి యువతకు రోల్‌మోడల్స్ ఉండేవాళ్ళు. వాళ్ళే దేశం కోసం అనుక్షణం తపనపడే మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ తదితర నాయకులు. స్వాతంత్ర్యం వచ్చిన ఇన్ని దశాబ్దాల తర్వాత యువత ముందు ఏ లక్ష్యం లేదు. ఒక్క నిర్లక్ష్యం తప్ప...." ఆ మాటలు వావిలాల గోపాలకృష్ణయ్యగారివి.

'ఔను నిజం! సినిమాల్లో వెర్రిమొర్రి వేషాలేస్తూ హీరోయిన్లను వెంటాడి టార్చర్ పెట్టే హీరోలే నేటి యువతకు రోల్‌మోడల్స్. అవినీతి అక్రమాలకు పాల్పడే వల్లభ్‌లాంటి వ్యక్తులే మార్గదర్శకులు, స్ఫూర్తి ప్రదాతలు. దేవుడా...రక్షించు నా దేశాన్ని' మనసులోనే అనుకున్నాడు సూర్యం. ఎడతెగని ఆలోచనలతో, తల వేయిముక్కలు అవుతుందేమో అన్న భయాందోళనతో పిచ్చిపట్టినవాడిలా ఇల్లంతా కలయదిరుగుతున్నాడు. అలా ఎంతసేపో......?

**సెల్: 90005 44160**






## పనిగంటలతో గుండెకు చేటు?

ఏపనీ చేయకుండా బద్ధకంగా ఓ చోట కూచుంటే శరీరం బరువు పెరిగి గుండె జబ్బులు వచ్చే అవకాశం ఉన్న సంగతి తెలిసిందే! అలాగని ఎక్కువ గంటలు పనిచేసినా గుండె సంబంధిత సమస్యలు 40 శాతం వచ్చే అవకాశం ఉందంటున్నారు పరిశోధకులు. ఇటీవల చేసిన అధ్యయనాల్లో ఈ విషయం వెల్లడైంది. సుమారు 85వేల మంది పనిగంటల మీద సుదీర్ఘకాలం అధ్యయనం చేశారు. వారంలో 55 గంటల కన్నా ఎక్కువ సేపు పనిచేసిన వారిలో సుమారు వెయ్యిమందికి గుండె సంబంధిత సమస్యలను అధ్యయనకారులు గుర్తించారు. పనిగంటలు ఎక్కువ అయితే పనిఒత్తిడి పెరగడం, అలసట, నిద్రలేమి, ఆహారం సరిగ్గా తీసుకోకపోవడం వంటి కారణాలు తోడై గుండె సంబంధిత సమస్యలు తలెత్తుతాయనీ, కొన్నిసార్లు ఇది ప్రాణాంతకం కూడా కావచ్చని వారు హెచ్చరిస్తున్నారు. వారంలో 48 నుంచి 50 గంటల పాటు పని గంటలు ఉండేలా చూసుకుంటూ కంటి నిండా నిద్రా, తగిన పోషకాహారం తీసుకుంటే గుండెజబ్బుల బారి నుంచి చాలా వరకూ తప్పించుకోవచ్చని వారు సూచిస్తున్నారు.



## నడుం చుట్టుకొలత పెరుగుతోందా?

కొంతమంది అన్ని రకాల ఆరోగ్య నియమాలను పాటించినా, వారి నడుం చుట్టుకొలత రోజురోజుకూ పెరుగుతూనే ఉంటుంది. ఈ సమస్యకు కారణం నిద్రలేమి కావచ్చంటున్నారు పరిశోధకులు. నిద్రలేమి కారణంగా నడుం చుట్టుకొలత మూడు సెంటిమీటర్లు పెరుగుతుందన్న విషయం ఇటీవలి అధ్యయనంలో వెల్లడైంది. సుమారు 1700 మంది మీద వీరు అధ్యయనం చేశారు. వీరి ఆహారపు అలవాట్లు, రక్తపోటు, బరువు, నిద్రపోయే సమయాలను పరిగణనలోకి తీసుకున్నారు. వీరిలో సగం మంది అంటే దాదాపు తొమ్మిదొందల మంది రాత్రి సమయంలో ఆరుగంటల పాటు మాత్రమే నిద్రపోయే అలవాటు ఉన్నవారు. మిగతా వారు ఏడు నుంచి తొమ్మిది గంటలు నిద్రపోతారు. కొన్ని నెలల అనంతరం వీరి బరువు, రక్తపోటు పరిశీలించగా ఆరుగంటలు నిద్రపోయే వారిలో 30 శాతం మంది నడుం చుట్టుకొలత మూడు సెంటీమీటర్లు పెరగడాన్ని గమనించారు. నిద్రలేమి కారణంగానే వీరిలో ఈ మార్పు సంభవించిన విషయాన్ని వీరు నిర్ధారించారు. నిద్రలేమితో ఎదురయ్యే ఆరోగ్య సమస్యలతో పాటు అధికబరువు కూడా తోడవుతుందని వీరు స్పష్టం చేస్తున్నారు.

## కెఫైన్ మంచిదే!




కాఫీలో ఉండే కెఫైన్ ఆరోగ్యానికి హానికరమని నిపుణులు పదే పదే హెచ్చరిస్తుంటారు. కెఫైన్ తీసుకోవడం వలన నిద్రలేమితో పాటు మరికొన్ని ఆరోగ్య సమస్యలు తప్పవన్న సంగతి గతంలో చేసిన పలు అధ్యయనాల్లో వెల్లడైంది. అయితే కాఫీ తాగడం వలన శరీరానికి కలిగే నష్టాలు చాలా స్వల్పమని బ్రిటన్ డైటీషియన్లు చెబుతున్నారు. ప్రతిరోజు నాలుగు కప్పుల కాఫీ లేదా ఎనిమిది కప్పుల టీ తాగడం వలన నిద్రలేమి సమస్య తలెత్తదని వీరు స్పష్టం చేస్తున్నారు. దీని మీద వీరు దీర్ఘకాలం అధ్యయనం చేశారు. కొంత మందిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి కాఫీ ఇవ్వలేదు. మరొక గ్రూపు వారికి రోజుకు నాలుగు కప్పుల కాఫీ ఇచ్చారు. కొన్ని నెలల అనంతరం వీరి నిద్రాసమయాన్నీ, ఆరోగ్యాన్నీ పరిశీలించారు. కాఫీ తాగిన వారిలో కన్నా తాగని వారిలోనే నిద్రలేమి సమస్యను వీరు గుర్తించారు. నిద్రలేమికి, కాఫీకి ఎలాంటి సంబంధం లేదన్న విషయం వీరి అధ్యయనంలో స్పష్టమైంది.

## తల్లి బరువు బిడ్డకు చేటు



తల్లికాబోయే స్త్రీలు అధికబరువు ఉంటే పుట్టబోయే పిల్లల్లో కొన్ని రకాల ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయని స్వీడన్ పరిశోధకులు చెబుతున్నారు. ఎక్కువ బిఎంఐ కలిగి ఉండే గర్భవతులకు పుట్టే పిల్లల్లో 3.5 శాతం పుట్టుకతోనే ఆరోగ్యసమస్యలు రావచ్చన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. దాదాపు పన్నెండులక్షల మంది గర్భవతుల మీద వీరు సుదీర్ఘకాలం చేసిన అధ్యయనంలో చాలా మంది గర్భవతులు ఉండవలసిన బరువు కన్నా అధిక బరువు ఉన్నారనీ, వీరికి పుట్టిన పిల్లలకు గుండె సంబంధిత సమస్యలు, కాళ్ళు, చేతుల్లో అవకరాలు, జీర్ణవ్యవస్థ పూర్తిగా ఎదగకపోవడం వంటి సమస్యలను గుర్తించారు. తల్లి అధికబరువు కారణంగానే పిల్లల్లో ఈ సమస్యలు తలెత్తాయా? అన్న విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

## మోకాలి నొప్పులకు కారణం నిద్రలేమి?



పెద్దవారి నుంచి చిన్నవారి వరకూ ఎదుర్కొనే మోకాలి నొప్పులకు కారణం నిద్రలేమి అంటున్నారు బ్రిటన్ పరిశోధకులు. మనం మెలకువగా ఉన్న సమయంలో మోకాలి దగ్గర కణజాలం ఎక్కువగా చేరుతుందనీ, నిద్రపోయే సమయంలో వెలువడే హార్మోన్లు ఆ కణజాలాన్ని కరిగిస్తాయని వీరు చెబుతున్నారు. ఈ కారణంగా మోకాలి నొప్పులు వచ్చే అవకాశాలు తగ్గుతాయని వారు అంటున్నారు. మోకాళ్ళ నొప్పులతో బాధపడుతున్న కొంత మంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. ఒక గ్రూపు వారిని సరిపడ నిద్ర పొమ్మన్నారు. రెండో గ్రూపు వారిని తక్కువ సేపు నిద్ర పొమ్మన్నారు. కొన్ని నెలల అనంతరం ఈ రెండు గ్రూపులను పరిశీలించారు. సరిపడ నిద్రపోయిన వారిలో మోకాళ్ళ నొప్పులు తగ్గిన విషయాన్ని గమనించారు. నిద్ర తక్కువయిన వారిలో ఆ నొప్పులు కొద్దిగా ఎక్కువైన సంగతిని గుర్తించారు. నిద్రపోయే సమయానికి, మోకాళ్ళ నొప్పులకు లింకు ఉందన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. అయితే ఈ విషయాన్ని పూర్తిగా నిర్ధారించేందుకు మరిన్ని అధ్యయనాలు నిర్వహించాలని వారు చెబుతున్నారు.

–అవినాష్

# మహావాస్తు

## పంచభూతములకు, పంచేంద్రియాలకు ఉన్న సంబంధం:

1. **ఆకాశం:** అనంతమైనది ఆకాశమంటారు. అన్నింటికీ తనలో స్థానములను ఏర్పాటుచేయడం ఆకాశ ధర్మం కాబోలు! శూన్యమున్నచోట పదార్థముండే అవకాశం లేదు. అలాగే.. పదార్థమున్న చోట శూన్యానికి తావులేదు. కానీ శూన్యానికీ, పదార్థానికీ తనలో చోటివ్వడం ఆకాశానికున్న అద్భుతమైన ధర్మం. ఆకాశంలో నిరంతరం భ్రమణ, పరిభ్రమణాలు గావిస్తున్న, పేలి పోతూ విస్తరిస్తున్న లక్షల కోట్ల గ్రహ, ఉపగ్రహ, శకల, నక్షత్ర, కృష్ణబిలాల సముదాయాల వలన ఏర్పడుతున్న శబ్దం వలన కావచ్చు.. ఆకాశం పూర్తిగా శబ్దమయమై ఉన్నది. అలా ఆకాశం **'శబ్దగుణము'** ప్రధానగుణము గలదిగా గుర్తింపు పొందింపబడినది. ఏడేడు పద్నాలుగు లోకాల పర్యంతం విస్తరింపబడి ఉన్న ఈ శబ్దాన్ని మనం చూడలేము, స్పృశించలేము, రుచి చూడలేము, వాసన చూడలేము. కాని వినగలుగుతాము. ఈ శబ్దమే ఓంకారమని, ప్రణవనాదమనీ ప్రస్తావించబడింది. ప్రంచేంద్రియాలలో ఒకటైన కర్ణేంద్రియానికి(చెవికి), పంచభూతాల్లో ప్రథమమైన ఆకాశధర్మానికి (శబ్దానికి) పరస్పర సంబంధం ఉంది.



2. **వాయువు:** భూమికున్న ఆకర్షణ శక్తి చేత **'వాయువు'** భూమిపై కొన్ని మైళ్ల పర్యంతం ఆకర్షింపబడి ఉన్నది. భూమిపై ఒక జీవి పుట్టి, జీవితం కొనసాగించటాని అవసరమైన పాళ్లల్లో వాయువు మిశ్రమ రూపంలో (ప్రాణ వాయువు, బొగ్గు పులుసు వాయువు, ఉదజని మొదలైన వాయువులు) ఉంది. అత్యంత అవసరమైన వాతావరణాన్ని ఏర్పాటు చేయడంలో వాయువు పాత్ర ముఖ్యమైనది. వాయువు చంచలమైనది. పీడనం ఉన్న వైపుకు నిరంతరం చలించే **'ధర్మము'** కలిగినది. వాయువు చలనములో 'శబ్దాన్ని' మనం వినగలుగుతాము. తన గమనములో అడ్డు వచ్చిన దేనినైన వాయువు స్పృశిస్తుంది. వాయువు **'స్పర్శ'**ను మనము **'చర్మేంద్రియము'** ద్వారా గ్రహించ గలుగుతాము. ఆకాశానికి ఉన్న **'శబ్దగుణము'**తో పాటు 'స్పర్శ **ప్రధాన గుణము**'గా గలది వాయువు. మన పంచేంద్రియాలలో ఒకటైన **'చర్మేంద్రియము'** పంచభూతాలలో ఒకటైన వాయువు యొక్క 'స్పర్శ **గుణము**'తో సంబంధమును గలిగిఉంది.

**వచ్చేవారం... పంచభూతములు, పంచేంద్రియాలు..**
**మంటకి - కంటికి ఉన్న సంబంధం..?**

## వాస్తు విద్వాన్, సాయిశ్రీ
## గౌ. డా. దంతూరి పండరీనాథ్



### ఇంట్లో ఎప్పుడు కలహాలే...

- మాది ఉమ్మడి కుటుంబం. ఎవరికి వాళ్లము అంతా బాగానే ఉంటున్నాము. కానీ కుటుంబ సభ్యుల మధ్యన పెద్ద కారణం లేకుండానే గొడవలు జరుగుతున్నాయి. మాటా మాటా అనుకోవటం, తరువాత 'ఎందుకు అన్నామా'? అని బాధపడటం, మళ్లీ అకారణంగానే గొడవలు పడటం, ఇలాపదే పదే జరుగుతున్నాయి. ఇంట్లో వాస్తు దోషాలు ఉండటం వలన ఇలా గొడవలు పడే అవకాశముంటుందా?

– **స్వర్ణ మయూరీ,** విజయవాడ.

✔ మీలాంటి సమస్య చాల మంది ఇండ్లలో ఉంటుంది. అందుకని అందరికీ ఉపయోగపడే విషయం ఇది. ఇంట్లో కుటుంబ సభ్యుల మధ్యన సరైన అవగాహన లేకపోవటానికి ముఖ్యంగా, వాస్తుపరంగా రెండు సాధారణ కారణాలుంటాయి.

1) ఆగ్నేయ దోషం... అంటే ఇంట్లో ఆగ్నేయం మూలన అగ్నికి సంబంధించిన క్రియ జరుగకపోవటం, ఇంట్లోగానీ, ఆవరణలోగానీ ఆగ్నేయంలో గోతులు, నీటినిల్వలు ఉండటం, ఇంటిపైన ఆగ్నేయంలో నీటినిల్వలు (ఓవర్‌హెడ్‌ట్యాంక్) ఉండటం.

2) ఇంటిపైకప్పు పైన శల్యాలు అంటే... ఎముకలు(పక్షులుతిని పారేస్తుంటాయి), గోళ్లు, వెంట్రుకలు, బొగ్గులు, పగిలిన అద్దాలు(కిటికి అద్దాలు, ఫొటో ఫ్రేమ్‌లు, డ్రెసింగ్ టెబుల్ అద్దాలు), కాలిన కలప(తలుపులు, ఫర్నీచర్, సగంకాలిన వంట చెరుకు, సగంకాలిన గుడ్డలు) మొదలైనవి ఉండటం.

కుటుంబ సభ్యుల మధ్యన కలహాలకు కారణాలు అనేకం! ఎవరి ఇంట్లోనైనా కుటుంబ సభ్యుల మధ్యన సరైన అవగాహన లేక పొవడమనేది పునరావృతం అవుతూఉంటే... పైన చెప్పిన వాస్తు దోషాలు ఒకసారి పరిశీలించండి. ఒకవేళ ఉంటే.. వాటిని సరిదిద్దుకోవటం లేదా తీసివేయటం వలన శీఘ్రంగా సత్ఫలితాలు కనిపిస్తాయి. ఒక ప్రయత్నం చేయండి.

**వచ్చేవారం...**
**'ఇంట్లో ఏ దోషం ఉంటే... రావలసిన డబ్బులు చేతికి అందవు..'**


దంతూరివారి 'విజయవాడ-విశాఖ'లో వాస్తు పర్యటన: ఆగస్టు నెల
**విజయవాడ: 12, 13** శని, ఆది / **విశాఖ: 19, 20** శని, ఆది
**For Personal Visits & Appointments**
Ph : 040 - 2781 7446, email: mahavasthu@gmail.com
**Cell: 988 544 6501, 988 544 9458**


వాస్తువిద్వాన్ **డా॥ దంతూరి పండరినాథ్** పాఠకుల జాతక మరియు వాస్తు సమస్యలకు 'మహావాస్తు'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసినది.

పూర్తి పేరు:.......................................................
పుట్టిన తేది:........................ ఊరు:...........................
జన్మనక్షత్రం:........................ తల్లి పేరు:...........................
చిరునామా:.......................................................
..................................................ఫోన్:.....................


మా చిరునామా : **వాస్తుసాయి సేవా ఆశ్రమం**
మహావాస్తు, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.




**పర్వతపాదం దగ్గర ఆగి, తలపైకెత్తి ఆలయగోపురం వైపు చూస్తూ నిధి చేతులెత్తి నమస్కరించాడు. క్షణకాలం పాటు గర్భాలయంలోని వాలీశ్వరలింగాన్ని మనోనేత్రంతో దర్శించి, తన ప్రయత్నాన్ని విజయవంతం చేయమనీ, త్వరగా పునర్దర్శనం ప్రసాదించమనీ ప్రార్థించాడు. ప్రణవంతో కలిపి పంచాక్షరీ మంత్రాన్ని పదకొండు పర్యాయాలు జపించి, నమస్కార ముద్రలో కలుసుకున్న చేతుల్ని విడదీసి, కళ్ళు తెరిచాడు.**

ఎవరో వేగంగా కొండ దిగుతున్నారు. ఎవరో భక్తురాలు ప్రదోషకాల దర్శనం చేసుకుని తిరిగి వస్తోంది. వేగంగా మెట్లు దిగుతూ ఆమె తన వైపు చేతిని ఊపుతోంది. ఎవరు? తనకోసం చేతిని ఊపుతోందంటే ఆమె తనను పోల్చుకుందని తెలుస్తోంది. ఆమె ఎవరో తనను పోల్చుకున్నప్పుడు తనెందుకు ఆమెను పోల్చుకోలేకపోతున్నాడు? నిధి ఆమెను నిర్లక్ష్యం చేస్తూ, తన కోసం వేచి చూస్తున్న శ్వేతాశ్వం వైపు తిరిగాడు.

"నిధీ!" ఆమె బిగ్గరగా పిలిచింది.

నిధి మెట్ల వైపు చూశాడు. "నిన్నే నిధీ! ఆగు!" అందామె.

నిధి కదలకుండా నిలుచున్నాడు. ఆమె ఒక మెట్టుమీద నుంచీ క్రింది మెట్టుమీదకి దూకుతూ, దగ్గరగా వస్తోంది. ఆమె.... సుగాత్రి! జుత్తు విరబోసుకుంది. ఒత్తుగా, పొడవుగా ఉన్న కేశరాశి నడుం కిందిదాకా వేళ్ళాడుతోంది. ఆమె రక్తవర్ణం దుస్తుల్లో ఉంది. విరబోసుకున్న జుత్తుతో, ఎర్రటి వస్త్రాల్లో సుగాత్రిని తాను ఎప్పుడూ చూడలేదు.

"నిధీ" దగ్గరగా వస్తూ ఉత్సాహంగా అంది సుగాత్రి.

నుదురు మీద వెడల్పుగా పట్టించిన విభూతి. విభూతి మీద ఎర్రటి కుంకుమబొట్టు, నివురు మీద నిప్పుకణికలా! కేశపాశం బరువుగా కిందికి జారింది. ఇంకా తడి ఆరినట్టు లేదు. చేతుల్లో పళ్ళెం.

"అక్కాయ్, ఏమిటీ వేషం? కొత్తగా ఉన్నావ్ సుమా! పోల్చుకోలేకపోయా!" నిధి నవ్వుతూ అన్నాడు.

"నన్ను ఈ వేషంలో చూడాలంటే నువ్వు బ్రహ్మీ ముహూర్తంలో నిద్రలేవాలి! వాలీశ్వర సేవ. నలభై దినాలు దీక్షతో చేయమన్నారు.."

"దేనికి?"

"నీకు ఏమీ తెలీదు. అక్కాయక్కాయ్ అంటావు గానీ, నీ అక్కయ్య గళంలో మంగళసూత్రం లేదన్న సత్యాన్ని ఇంతవరకూ చూడలేదు నువ్వు!" సుగాత్రి అంది.

"ఓహ్! మొగుడికోసం కొండెక్కుతున్నావన్న మాట!"

"ఒఠ్ఠి మొగుడి కోసం కాదు, మంచి మొగుడి కోసం. ఎక్కేకొండా, దిగేకొండా!"

"నలభై దినాలు ఇంకా పూర్తి కాలేదా?"

"ఒక మండలం అంటే నలభై దినాలు చాలన్నారు. నాలుగు నెలలు దాటింది. ఎక్కేకొండా, దిగేకొండా!" సుగాత్రి నిట్టూర్చింది.

"దీక్ష మోక్షమివ్వలేదంటావ్?"

"ప్చ్!" సుగాత్రి చప్పరించింది. "ఎందాకా ప్రయాణం? అదే... ఏ పనిమీద ప్రయాణం?"

"చెల్లెలుందిగా! దానికి మొగుణ్ణి వెదికే పనిమీద బయల్దేరాను. మొగుణ్ణి వెదికే పనిలో దీక్ష పట్టిన కన్నె ఎదురొచ్చింది. శుభశకునమో అపశకునమో చూడాలి!" నిధి నవ్వాడు.

"నా శకునం అందరికీ శుభమే! నాకేమో ఎవ్వరి శకునమూ కలిసి రావడం లేదు. ఇదిగో... విభూతి. దండం బెట్టుకో..." సుగాత్రి పళ్ళెంలోని విభూతి తీసి, నిధి నుదురుమీద అద్దింది.

"నీ మనసు మంచిదక్కాయ్!"

"అందుకేగా మంచి మొగుడు దొరకడం లేదు. సరేగానీ... నిజం చెప్పు.. ఏ కార్యం మీద కదిలావు?"

"చెప్పానుగా! అది నిజమే!"

"నువ్వు తిరిగి రాగానే నిజమో కాదో తెలిసిపోతుందిగా!" సుగాత్రి అంది.

"నువ్వు బయల్దేరిన వేళావిశేషం బాగుంది. నేనెదురొచ్చాను. క్షేమంగా వెళ్ళు. లాభంతో రా..."

నిధి నవ్వుతూ గుర్రం దగ్గరగా జరిగాడు. సుగాత్రి అప్పుడే గుర్తొచ్చినట్టు అంది "మాట!"

నిధి ఆగి, ఆమె వైపు చూశాడు.

"ఈ గుర్రాన్ని దివాణం అశ్వశాలలో చూశాను. ఎవరిచ్చారు? ఎందుకిచ్చారు?" సుగాత్రి కళ్ళు చిట్లిస్తూ ప్రశ్నించింది.

"మొన్న వీరదశమినాడు రాకుమారిగారి వెనుక నిలబడి మన ప్రతాపం చూశావుగా! గెలిచినా, ఓడించారు. దానికి పరిహారంగా నచ్చిన గుర్రాన్ని తీసుకొమ్మన్నారు. తీసుకున్నాను".

## జరిగిన కథ

బాకీపడ్డ కప్పం వెంటనే చెల్లించాలని సుభిక్ష రాజ్య మహారాజుకు చక్రవర్తి విజయానందులు లేఖ పంపిస్తాడు. అందుకు పరిష్కారంగా జ్యోతిష్కుడు నవనిధుల గురించి చెబుతాడు. నవనిధులను సాధించాల్సిందిగా నిధిని కోరతాడు మహారాజు. నిధి ముందు అశ్వత్థామ బహిర్గతమై, నవనిధుల సాధనలో అతనికి సహాయం చేస్తానని చెబుతాడు. అశ్వత్థామ సలహాతో అశ్వశాలలో శ్వేతాశ్వాన్ని ఎన్నుకుంటాడు నిధి. జ్యోతిష్కుడు నిధిని, అతడి కుటుంబసభ్యులను కలిసి, నవనిధుల వివరాలతోపాటు, రాజాజ్ఞను కూడా వినిపిస్తాడు.

ఆ తర్వాత...

"అలాగేం...పళ్ళెం ముత్యాల్ని చెల్లాచెదురు చేసి, ఈ గుర్రాన్ని పట్టుకున్నావన్నమాట. సరే... వెళ్ళిరా" సుగాత్రి నర్మగర్భంగా అంది.

నిధి శ్వేతాశ్వాన్ని ఒకసారి నిమిరి అధిరోహించాడు. ఇంటి నుంచీ పర్వత పాదం దాకా అతని వెనకే ఠీవిగా నడిచివచ్చిన శ్వేతాశ్వం, అతను అధిరోహించగానే, నూతనోత్సాహంతో ముందుకు కదిలింది. వెనక్కితిరిగి, సుగాత్రి వైపు చేతిని ఊపాడు నిధి. పళ్ళేన్ని రెండు చేతుల్తో పట్టుకున్న సుగాత్రి కళ్ళు చిట్లించి చూస్తూ ఉండిపోయింది. శ్వేతాశ్వం విసురుగా విసిరిన బంగారం రంగు తోక ఆమె ముఖం మీద చివాల్న వాలింది. సుగాత్రి ఉలికిపడింది.

***

నిధి బుర్రలో సుగాత్రి గురించి ఆలోచనలు సాగుతున్నాయి. 'చెల్లికి పెళ్ళి సంబంధం' అంశాన్ని ఆమె నమ్మినట్టు నటించింది. తనకు ఆ మాత్రం అర్థమైంది. మహారాజుగారి శ్వేతాశ్వం మీద తాను బయలుదేరిన విషయం కాసేపట్లో యువరాణిగారికి తెలిసిపోతుంది. తెలిస్తే వచ్చే నష్టం లేదు; పోయే లాభమూ లేదు! నవనిధుల కోసం తనను పంపించిన విషయాన్ని మహారాజుగారు మహారాణికి చెప్పకుండా ఉండరు. ఇవాళ కాకపోతే రేపు! మహారాజుగారు కాకపోతే సేనాని వీరకేసరి తన సోదరి మహారాణికి చెప్పకుండా ఉండడు. మహారాణికి తెలిసిన విషయం యువరాణికి తెలియకుండా ఉండదు. అత్యంత రహస్యం అంటూ పెద్దలు చెప్పుకునే నవనిధుల ఉనికి యువరాణికి తెలిసిపోయిందిగా!

ఆలోచనలు ముగించి, నిధి ముందుకు వంగి, 'వాయు'ను ప్రేమగా నిమిరాడు. యజమాని స్పర్శను అర్థం చేసుకున్న వాయు నడక వేగాన్ని కొద్దిగా తగ్గించింది. నిధి గుర్రం చెవిదాకా, బాగా వంగాడు. 'వాయూ! మనది చాలా దూరం సాగే ప్రయాణం. పగలంతా పరుగు, రాత్రి విశ్రాంతి. 'వాయు'వేగంతో వెళ్దాం! ఏం" అన్నాడు.

వాయుకి అర్థమైనట్టు రెప్పపాటులో తెలిసిపోయింది నిధికి. గుర్రం నడక పరుగుగా ఎదిగింది. రెండు వైపులా చెట్లున్న వెడల్పాటి బాటలో తెల్లగుర్రం గాలిని చీల్చుకుంటూ పరిగెడుతోంది. ఆకుల సందుల్లోంచీ సూర్యరశ్మి పడినప్పుడు దాని మీదున్న స్వర్ణరేఖ తళుక్కున మెరుస్తోంది.

అశ్వం ముందుకు తీసుకెళ్తోంది. ఆలోచనలు వెనక్కి తీసుకెళ్తున్నాయి నిధిని. ఆస్థాన జ్యోతిష్కుడు రాజాజ్ఞను అందజేసి వెళ్ళగానే, అమ్మ అన్నం పెట్టింది. అయితే కంచంలో గానీ, ఆకులో గానీ వడ్డించలేదు అమ్మ. చక్కగా కలిపిన అన్నాన్ని చేతిముద్దలుగా తన చేతిలో వేసి, ప్రేమగా తినిపించింది. త్వరత్వరగా మింగేస్తూ, చేతిని చాస్తూ చెల్లి నవనీత తనతో పోటీ పడింది. చెల్లి ఎంత రెచ్చిపోయినా, అమ్మ తనకే ప్రాధాన్యత ఇచ్చింది. 'ఉండవే! తరువాత తినొచ్చుగా! దూరప్రయాణం వెళ్తున్నాడు. వాణ్ణి తిననీ!" అంటూ మందలిస్తూ దాని అరచేతిలో గోలీకాయంత చిన్నచిన్న ముద్దలు పెడుతూ వచ్చింది.

వంటకాల రుచిని తమ ముఖాల మీద చూసిన నాన్న చెయ్యి చాస్తూ కూర్చున్నాడు. అమ్మ అరచెయ్యి పట్టనంత పెద్ద ముద్ద నాన్నచేతిలో వేసింది. "నెమ్మదిగా తినండి. పిల్లలతో తిండి విషయంలో పోటీపడే తండ్రిని మిమ్మల్నే చూస్తున్నాను" అంది. అమ్మ ఆడే మాటలు నంజుకుంటూ, తింటూంటే చేతిముద్దల రుచి పెరుగుతూ వచ్చింది. చివర పెరుగన్నం, నంజుకోవడానికి వడపిందెలు... "ఇంక చాలే! గుర్రం మోయాలిగా నన్ను!" అన్నాడు తను.

"నిన్నూ, అమ్మ సిద్ధం చేసిన చద్దన్నం మూటనూ మోయాలి!" నవనీత నవ్వుతూ అంది.

ఆలోచనలు మళ్ళీ అమ్మచేతి ముద్దలు తిన్నంత ఆనందాన్నిస్తున్నాయినిధికి. గుర్రం ఎక్కబోయే ముందు తను నాన్న పాదాలకూ, అమ్మ పాదాలకూ నమస్కరించాడు.

లేచాక, నాన్న దగ్గరగా తీసుకుని, వీపు నిమిరి, ధైర్యం చెబుతూ ఉత్సాహాన్నిస్తున్నట్టు భుజం తట్టాడు. "తన్నుమాలిన ధర్మం లేనట్టే, తన్ను మాలిన సాహసం లేదు!



**పచ్చగా, ఎత్తుగా పెరిగిన మహావృక్షాలు. వాటి మధ్య అక్కడక్కడా నల్లటి బండరాళ్ళు. చెట్లూ, పొదలూ, తీగలూ చల్లటి కొండగాలిని ప్రసారంచేస్తున్నాయి. నిధి ప్రయాణిస్తున్న కొండదారి ఉన్నట్టుండి సమతలంగా మారింది. పరిసరాలు గమనిస్తూ ముందుకు సాగుతున్న నిధి, ఎదురుగా ప్రత్యక్షమైన దృశ్యం చూసి ఆశ్చర్యపోయాడు. అసలతనికి ఏం కనిపించింది?**

సాధించాలంటే నువ్వు క్షేమంగా, ఆరోగ్యంగా ఉండాలి. నీ ప్రయాణ లక్ష్యం ఎవ్వరికీ చెప్పకు. ఒకరు జ్ఞాన నేత్రంతో దర్శించిన నవనిధుల్ని నువ్వు నీ చర్మచక్షువులతో దర్శించడానికీ, మూటకట్టి మోసుకు రావడానికీ వెళ్తున్నావు. జ్ఞాననేత్రదర్శనం స్వప్నదర్శనం లాంటిది. కలలో కనిపించిన కలిమి అనుకో! కంటికి కనిపిస్తే సరి... లేదంటే నిస్సంకోచంగా, నిర్భయంగా తిరిగిరా! అర్థమైందిగా నిధీ?" అన్నాడు నాన్న.

"అర్థమైంది నాన్నా!" అన్నాడు తను.

"ఆ నవనిధుల కన్నా నీ విలువ మాకు ఎక్కువ నాయనా! చూడు. కంటబడితే తీసుకురా. అంతే! కొండల్ని తవ్వుకుంటూ, ప్రాణాంతకమైన సాహసాలు చేయొద్దు. క్షేమంగా తిరిగిరా. లాభం లేకపోయినా సరే, క్షేమంగా రా తండ్రీ!" అంది అమ్మ తన తల నిమురుతూ. తనకి తెలుసు. అమ్మకంఠం జీరబోయినపుడు కళ్ళు చెమ్మగిల్లుతాయి. తల్లి హృదయం మంచు. ఇట్టే కరిగిపోతుంది.

అమ్మ తడికళ్ళల్లోకి ఒకసారి చూసి, చెల్లిని దగ్గరగా తీసుకుని, అలవాటు ప్రకారం బూరెలా ఉన్న బుగ్గమీద పెదవులతో సున్నితంగా రాశాడు.

"అన్నాయ్, మళ్ళీ చెప్తున్నా! ఆ మహారాజు గారి దురాశకోసం నువ్వు నవనిధుల వేటలో నీ ప్రతాపాన్ని ప్రదర్శించాల్సిన అవసరం లేదు.. క్షేమంగా తిరిగిరా! నాకు నచ్చే మొగుణ్ణి తేవాలి! మాటిచ్చావుగా! మరచిపోకు!" అంది నవనీత.

అమ్మ, నాన్న, చెల్లి – ముగ్గురూ నిధుల సాధన ముఖ్యం కాదనీ, తన క్షేమం ముఖ్యమనీ చెప్పారు. అయితే తాను, నామమాత్ర సాహసం చేసి, తిరిగి రాలేడు. తన ప్రయత్నం ఎన్నెన్నో సాహసాలతో కూడుకుంది. కొండగుర్తుల ఆధారంగా 'నిధి సన్నిధి'ని చేరుకోవాలి. గుహ కాదు, పర్వతగర్భం! పర్వత గర్భం అంటే ఏమిటో, అది ఎక్కడుందో కనిపెట్టాలి. నిధులు చాలాచాలా విలువైనవి. అయితే తమ ఉనికిని తెలియజేస్తూ సువాసనలు వెదజల్లవు. గలగలా నాణేలలాగా చప్పుడు చేయవు. తల్లిదండ్రుల 'జాగ్రత్త సూచనలు' గుర్తుంచుకుంటూనే, చిత్తశుద్ధితో, నిబద్ధతతో అన్వేషణ సాగిస్తాడు తను. అడుగువేసి ఆగిపోడు. సగం దూరం సాగి, తిరిగిరాడు. ఆత్మవంచన చేసుకోడు. ఇది తన శక్తికి పరీక్ష. నవనిధులు సాధించితే అది తనకు ఘనవిజయం. నవనిధులు లేవని తెల్సుకుంటే అదీ తనకు ఘనవిజయమే! 'నిధి సన్నిధి' గ్రంథం ఒక పుక్కిటి పురాణంగా తేలిపోతుంది. శ్వేతాశ్వం వాయు అలసట అనేది లేకుండా పరుగుతీస్తోంది. దారికి అటూఇటూ అక్కడక్కడా పొలాలూ, తోటలూ కనిపిస్తున్నాయి. పొలం పనుల్లో ఉన్న జనం గాలిలో తెల్లమబ్బు తునకలా వెళ్తున్న తన గుర్రాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారని నిధికి తెలుసు. వాయువేగాన్ని అందుకునే ప్రయత్నంలో నిమగ్నమైపోయి దూసుకెళ్తోంది వాయు.

దారిలో, శ్వేతాశ్వం నీడ – దానికి దారి చూపుతున్నట్టు ముందు పరుగెడుతోంది. గుర్రం నీడా, గుర్రం మీద ఉన్న తన నీడా పొడవు పెరుగుతున్నాయి. సూర్యకిరణాల వేడి తగ్గినట్టు తన వీపు తెలియజేస్తోంది. తల తిప్పి, వెనక్కి చూశాడతను. ఎర్రటి, గుండ్రటి సూర్యుడు రెండు పర్వతాల మధ్య క్రిందికి జారిపోతున్నాడు. ముందు పరిగెడుతున్న నీడ ఉన్నట్టుండి కుడి వైపుకి తిరిగింది. అంటే తనిపుడు ఉత్తరదిశగా ప్రయాణం చేస్తున్నాడన్న మాట. తన గమ్యం అదే!

దారి ఏటవాలుగా మారుతోంది. ఎదురుగా చిన్నకొండ కనిపిస్తోంది. దారి గుర్రాన్ని కొండ పైకి తీసుకెళ్తోంది. మధ్యాహ్నం చెట్టు నీడన, సెలయేటి ప్రక్కన భోజనం చేశాడతను. ఆ భోజన విరామ సమయం తప్పించి, ఉదయం నుండీ సాయంత్రం దాకా తన ప్రయాణం సాగింది. ప్రయాణం సామాన్యమైన వేగంతోకాదు; చాలావేగంతో. వాయు యథేచ్ఛగా కాలి కొద్దీ పరుగుతీసింది. ప్రయాణం ఎన్ని యోజనాలు సాగిందో తనకు తెలీదు.

పచ్చగా, ఎత్తుగా పెరిగిన మహావృక్షాలు. ఆ వృక్షాల మధ్య అక్కడక్కడా నల్లటి బండరాళ్ళు. ఆ బండరాళ్ళు పర్వతం మీద ఉన్న వృక్షసంపద హరిత వర్ణాన్ని హెచ్చవేత వేసి చూపిస్తున్నాయి. నిధి వెనక్కి చూశాడు. వాయు చాలా ఎత్తుకి ఎక్కేసింది. మసకచీకట్లు నెమ్మదిగా ముసురుకుంటున్నాయి. నీళ్ళు దూకుతున్న చప్పుడు. రెండు నల్లరాళ్ళ మధ్య తెల్లగా జారుతున్నాయి నీళ్ళు. జలపాతం! బండరాళ్ళకి ఏర్పడిన నెరియలలో మొలకెత్తి, పెరిగినచెట్లు గాలిలోకి ఏటవాలుగా వంగి, క్రిందపడిన నీళ్ళల్లో తమ అందాల్ని చూసుకుంటున్నట్టున్నాయి. జలదర్పణంలో సొగసు చూసుకుంటున్న తరువులు!

చెట్లూ, పొదలూ, తీగలూ చల్లటి కొండగాలిని ప్రసారం చేస్తున్నాయి. అంతసేపూ ఏటవాలుగా పైకి ఎక్కిన కొండదారి ఉన్నట్టుండి సమతలంగా మారింది. తను కొండపైకి చేరుకున్నట్టు గుర్తించాడు నిధి. కొండదారిలో అక్కడక్కడా పాదచారులూ, అశ్వారూఢులూ తగిలారు కొండపైకి ప్రయాణం చేస్తూ. అయితే వేగంగా దూసుకెళ్తున్న వాయు వాళ్ళను పలకరించే అవకాశం ఇవ్వలేదు తనకు. కొండమీది సమతల మార్గం ఎత్తుగా, నిలువుగా నిలుచున్న రెండు బండరాళ్ళ మధ్య, ఒక్కసారిగా మలుపు తిరిగింది. ఎదురుగా ప్రత్యక్షమైన దృశ్యం నిధిని ఆశ్చర్యంలో పడవేసింది.

కొండదారికి ఒకవైపున తూర్పువైపు ద్వారం ఉండేలా, ఎత్తుగా ఉన్న ప్రదేశంలో ఏదో ఆలయం ఉంది. ముందు ప్రధాన గోపురం, ప్రాకారం, గర్భాలయ గోపురం ఉన్నాయి. భక్తులు మెట్లెక్కి ప్రధాన గోపురాన్ని సమీక్షిస్తున్నారు. ఆలయానికి ఎదురుగా, దారికి సమానంగా విశాలమైన ప్రాంగణం ఉంది. ఆ ప్రాంగణంలో దర్శనానికి వచ్చిన భక్తులు తీసుకువచ్చిన ఎడ్లబండ్లూ, గుర్రాలూ, రథాలలాంటి వాహనాలూ ఉన్నాయి. ప్రాంగణంలో, ఆలయానికి అభిముఖంగా, గోపురాన్ని మించిన ఎత్తుతో ఒక నల్లటి బండరాయి ఉంది. అది ఒక శిల. ఎందుకో భక్తులు; స్త్రీలూ, పురుషులూ వరుసగా ఆ ఏకశిల వెనుకవైపు వెళ్తున్నారు. అప్పటికే వెళ్ళిన వాళ్ళు తిరిగి వస్తున్నారు.

నిధి గుర్రాన్ని ప్రాంగణంలోకి పోనిచ్చాడు. దిగి, ప్రాంగణం అంచున, పర్వతాన్ని ఆనుకుని ఉన్న చోటికి తీసుకెళ్ళాడు. అక్కడ గుర్రాలూ, ఎడ్లూ కట్టివేయబడి ఉన్నాయి. తన గుర్రాన్ని ప్రాంగణం మూలకి తీసుకెళ్ళి కట్టివేశాడు నిధి. తనెప్పుడూ ఇటువైపు రాలేదు. కొండమీద కోవెలను చూడలేదు. ఆలయంలో కొలువైన దేవుడు లేదా, దేవత ఎవరు? ప్రాంగణ ద్వారం ఇరువైపులా, ఎవరో పెద్దపెద్ద దివిటీలు వెలిగిస్తున్నారు. ఆలయ సోపానాల మీదుగా చాలా దివిటీలు వెలుగుతున్నాయి. నిధి అటూ ఇటూ చూశాడు. ఒక వృద్ధుడు చిన్న రాతిమీద కూచుని, ఆకుదొన్నెలోంచి ప్రసాదం తింటున్నాడు. నిధి అతని దగ్గరగా వెళ్ళాడు.

"తాతా.."

"ఏం నాయనా?" బోసినోటితో ప్రసాదం చప్పరిస్తూ అన్నాడు వృద్ధుడు. "ప్రసాదం కావాలా?"

"దర్శనం చేసుకున్నాక ప్రసాదం! ఇది ఏ దేవుడి గుడి తాతా?" నిధి చిరునవ్వుతో అన్నాడు. దివిటీల కాంతిలో వృద్ధుడి వెండి వెంట్రుకలు మెరుస్తున్నాయి.



ప్రసాదం తినడం ఆపాడతను.

"తెలీదా? ఇది హరిహరాలయం నాయనా! ఒకే విగ్రహంలో విష్ణువూ, శివుడూ ఇద్దరూ దర్శనమిస్తారు".

"హరిహరుల ఆలయమా! బాగుంది. భక్తులు అందరూ ఆ ఏకశిలవైపు వెళ్తున్నారు. దేనికి? అక్కడ ఏముంది?" నిధి అడిగాడు.

"అదా? ఆ శిల పేరు ఏకాక్షిశిల. పన్నెండు అడుగుల మందంతో ఉన్న శిల అది. పన్నెండు అడుగుల పొడవుతో దానిలో ఒక రంధ్రం ఉంది. ఆ రంధ్రం అంత దళసరి శిలలో ఎవరు తొలిచారు? ఎలా తొలిచారు? అని నన్ను అడగకు నాయనా. నాకు తెలీదు. నాకే కాదు, ఎవ్వరికీ తెలీదు. ఆ లయంలోని ఆ హరిహరనాథుడికే తెలియాలి! ఆ... ఒక కంటిని ఆ రంధ్రానికి ఆన్చి చూస్తే ఆలయం లోని హరిహరనాథ స్వామివారి పాదాలు దర్శనమి స్తాయి. ముందుగా ఆ దివ్య పాదాలను దర్శించి, దండం బెట్టుకుని, ఆ తరువాత ఆలయంలో స్వామి దర్శనానికి వెళ్తారు. నువ్వూ అలాగే చేయాలి సుమా! ఆ పాద మౌళి పర్యంతం – పాదాల నుండి శిరస్సు దాకా – క్రింది నుండి పైకి చేసుకోవాలి దైవదర్శనం".

"అలాగే తాతా... ఈ ఆలయం ఏ నగరం పరిధిలో ఉంది?"

"తెలీదా నాయనా, నీది ఏ ఊరు?" వృద్ధుడు ప్రసాదం తినడం పునః ప్రారంభిస్తూ అడిగాడు.

"కోటీర నగరం"

"అలాగా.. చాలా దూరం వచ్చావే! ఎప్పుడు బయల్దేరావు నిన్నా, మొన్నా?"

"కాదు తాతా. ఇవాళ ఉదయమే.."

"ఏంటీ! ఈ ఉదయం బయల్దేరావా? వాయు వేగంతో వచ్చినట్లున్నావు!"

"నా గుర్రం పేరు అదే! వాయువేగంతోనే వచ్చాను."

"అది జాతిగుర్రం అయివుండాలి. సరే.. ఇది హరిహరపురం అనే పట్టణానికి చెందిన ఆలయం నాయనా... ఊరు ఇక్కడికి దగ్గరేలే. కొండ దిగి కొంచెం దూరం వెళ్ళాలి. నీ ప్రయాణం అక్కడికేనా?"

"ఇంకొంచెం ముందుకెళ్ళాలిలే తాతా. వస్తాను. దర్శనం చేసుకుని వస్తాను.." నిధి వృద్ధుడికి నమస్కరించి కదిలాడు. ఏకశిల 'ఏకాక్షి' వైపు నడుస్తూ తన గుర్రం వైపు చూశాడు. జనం కొంచెం దూరంలో నిలుచుని గుర్రాన్ని చూస్తున్నారు. ఇప్పుడు అటు వైపున కూడా కొండలు వెలుగుతున్నాయి. తన గుర్రం మీద బంగారుగీత మెరుస్తోంది.

నిధి భక్తుల వెంట ఏకాక్షిశిల మెట్లు ఎక్కసాగాడు. సుమారు ముప్పై అడుగుల ఎత్తులో, నలుగురైదుగురు నిలుచోడానికి వీలుగా రాయి సమతలంగా ఉంది. నిధి కాస్సేపట్లో అక్కడికి చేరుకున్నాడు. ఒక భక్తురాలు కంటిని ఏకశిలకు ఆన్చి చూస్తోంది. తనివితీరా చూశాక హరిహర, హరిహర అని గొణుక్కుంటూ, లెంపలు వేసుకుంటూ మెట్లమీంచి క్రిందికి దిగింది. నిధి ఏకశిలకు దగ్గరగా జరిగాడు. విశాలంగా కనిపిస్తున్న కంటి ఆకారం. ఆ ఆకారం మధ్య గుండ్రటి రంధ్రం. నిధి కుడి కంటిని ఆ రంధ్రానికి ఆన్చాడు. క్షణంలో అతని కంటిముందు హరిహరుడి పాదాలు ప్రత్యక్షమయ్యాయి. దీపాల కాంతి పాదాలమీద పడుతోంది. కుడిపాదం మీద పంచె కుచ్చెళ్ళులాగా అలలు అలలుగా కనిపిస్తోంది. పాదం మీద కడియం అందంగా దర్శనమిస్తోంది. విష్ణు పాదం! రెండోపాదం పైభాగాన వస్త్రం లేదు. పాదానికి ఆనుకుని, పైభాగంలో కడియంలా చిన్న పాము చుట్టుకుని ఉంది. చిన్నపడగ పైకి లేచి ఉంది. శివ పాదం! నిధి హరిపాదాన్నీ, హరుడిపాదాన్నీ అబ్బుర పాటుతో కాసేపు చూసి మనసులో హరిహరనాథ దేవుడిని స్మరించుకున్నాడు. ఏకాక్షిశిల నుండి ఎడంగా జరిగి, దగ్గర్లో అసహనంగా ఎదురుచూస్తున్న భక్తుడికి దర్శనం చేసుకునే అవకాశం కల్పించాడు. మెట్లన్నీ దిగి, ప్రాంగణంలోకి చేరుకున్నాడు. బయలు దేరినప్పట్నుంచీ తన నడుమునే అంటిపెట్టుకున్న ఒరలో దాగిన కత్తిని గుర్తు చేసుకుంటూ, గుర్రం వైపు నడిచాడు. తనను చూడగానే కొద్దిగా కదుల్తూ వాయు స్పందించింది. కత్తితో బాటు ఒరనుతీసి, గుర్రానికి తగిలించాడు. అంతపెద్దకత్తితో దర్శనానికి వెళ్ళడం మంచిదికాదు.

"వాయూ, కత్తి జాగర్త!" అంటూ గుర్రాన్ని ఒక సారి నిమిరి ఆలయంవైపు తిరిగాడు నిధి.

మెట్లెక్కుతూ, గోపురం దాటి, ఆలయ ప్రాంగణంలోకి ప్రవేశించాడు నిధి. దైవనామస్మరణం చేసుకుంటూ దర్శనానికి వెళ్ళే భక్తులు వెళ్తున్నారు. దర్శనం చేసుకున్న భక్తుల నుదుళ్ళ మీద విభూతీ, అడ్డంగా ఉన్న విభూతి రేఖల మీద, మధ్యలో నిలువుగా ఎర్రటి నామాలు ధరించి హరిహరులకు భేదం లేదని ప్రకటిస్తున్నట్టు వస్తున్నారు. నుదుళ్ళ మీద హరిహర చిహ్నాలూ, చేతులలో ప్రసాదం దొప్పలూ...

నిధి 'హరిహర, 'హరిహర' అనుకుంటూ ఆలయంలోకి వెళ్ళాడు. దివిటీలూ, దివ్వెలూ ఆలయం లోపలి భాగాన్ని పట్టపగలుగా మార్చాయి. అర్థ నారీశ్వర విగ్రహంలో పార్వతీ పరమేశ్వరులిద్దరూ ఐక్యంగా ఉన్నట్టు, విష్ణువూ, శివుడూ ఒకే విగ్రహంగా మమేకంగా ఉన్నారు. ఏకాశిలా విగ్రహంలా కనిపిస్తున్న మూల విరాట్టు కనువిందు చేస్తోంది.

వృద్ధుడు చెప్పినట్టు నిధి 'ఆపాదమౌళి పర్యంతం' మూల విరాట్టును దర్శించసాగాడు. సన్నటి నడుం భాగంలో కేశవుడివైపు పాదాలదాకా వస్త్రం, శివుడి వైపు మోకాళ్ళకి పైదాకా గజ చర్మం. వక్షభాగంలో హారం, కౌస్తుభమణి. శివుడివైపు సర్పహారం. సగం హారం, సగం సర్పం! ముఖమూ అంతే. నుదుటి భాగంలో సగభాగంలో నామం, సగభాగంలో విభూతిరేఖ. హరి వైపు శిరస్సు మీద కిరీటం, హరుడి వైపు జటాజూటం; అందులో అర్థచంద్రుడు. కిరీటం సగం, జటాజూటం సగం...

అర్చకుడు అర్చన ముగించి నీరాజనం అర్పిస్తున్నాడు. "భక్తులారా, హరిహరనాథుని తారక మంత్రం ఉచ్చరిస్తాను. అందరూ ఆ మంత్రాన్ని పైకి పలకండి. తరువాత మనస్సులో మననం చేసుకోండి!" అంటూ నీరాజనాన్ని అందరికీ కనిపించేలా పైకెత్తి పట్టుకున్నాడు. మరుక్షణం ఆయన కంఠం స్పష్టంగా, బిగ్గరగా ఆలయంలో ప్రతిధ్వనించింది. స్వామి నామధేయం పలకండి. "విష్ణురూపాయ నమశ్శివాయ!" వెంటనే వందలాది కంఠాలు అందుకున్నాయి. "విష్ణురూపాయ నమశ్శివాయ!"

నిధి గొంతు కలిపాడు. తన ప్రయాణాన్ని ఫల వంతం చేయమని, అప్రయత్నంగా ప్రార్థించాడు. వరసగా కదుల్తున్న భక్తులు అతన్ని ప్రసాద వితరణ ప్రదేశం వైపు తోసుకెళ్ళారు. అక్కడ ఒకవ్యక్తి చొరవగా నిధి నుదుట విభూతి రాశాడు. రెండో వ్యక్తి వెండి కడ్డీతో నిలువుగా సింధూర నామం అద్దాడు. మూడవ వ్యక్తి తీర్థం ఇచ్చాడు. నాలుగవ వ్యక్తి ఆకుదొన్నెలో ప్రసాదం వేసి అందించాడు. ఘుమఘుమలాడుతూ నోరూరిస్తున్న ప్రసాదాన్ని దోసిట్లో ఉంచుకుని నిధి ముందుకు కదిలాడు. 'విష్ణురూపాయ నమశ్శివాయ!' నినాదాలు వినవస్తూనే ఉన్నాయి.

ప్రసాదం స్వీకరించడం ముగించి, చేతులు తుడుచుకుంటూ వాయు తనకోసం ఎదురు చూస్తున్న ఆవరణలోకి చేరుకున్నాడు నిధి. బంగారు గీత అందర్నీ ఆకర్షిస్తున్నట్టుంది. వాయు చుట్టూ జనం చేరారు. కొంచెం దూరంలో ఒక రథం ఉంది. రథం మీద ఒక భారీ వ్యక్తి నిలుచున్నాడు. కనకాంబరం రంగు వస్త్రాలు ధరించాడతను. భుజం మీద నీలిరంగు ఉత్తరీయం. వెడల్పాటి ముఖంలో ఎర్రటికళ్ళు. గొంగళిపురుగుల్లా గుబురు కనుబొమలు, మెలితిరిగిన మీసాలు. అతని ఎడమ చెయ్యి మీసాన్ని ప్రేమగా దువ్వుతోంది. నాలుగు వేళ్ళకీ ఉన్న దళసరి ఉంగరాలకు తాపడం చేసిన రంగురంగుల రత్నాలు తళుక్కు తళుక్కుమంటున్నాయి. రథానికి కట్టిన రెండు నల్లగుర్రాల ముందు సారథి కాబోలు నిల్చు

## వాటిని పట్టించుకోదట!



*ఓ సినిమా సక్సెస్‌కు తాను ఎలా బాధ్యురాలు కాదో, పరాజయానికి కూడా తను బాధ్యురాలు కాదంటోంది శ్రుతిహాసన్. తన సినిమా సక్సెస్ సాధిస్తే అదంతా తన క్రెడిట్ అని పొంగిపోననీ, అసలు ఓ సినిమా జయాపజయాలు సమిష్టిగా ఉంటాయే తప్ప ఏ ఒక్కరి తప్పు వలనో లేక కృషి వలనో సాధ్యం కావని చెబుతోంది. ఈ విధంగా ఉండడం తన తండ్రి దగ్గర నుంచి నేర్చుకున్నానని చెబుతోంది.*

న్నాడు. గుర్రాలు కదలకుండా, రథం మీద ఉన్న వ్యక్తి చూపులు జనం తలల మీదనుంచి, తన గుర్రం మీద వాలుతున్నాయి. అందగత్తెను గుడ్లప్పగించి చూసినట్టు అందరూ తన స్వర్ణరేఖ శ్వేతాశ్వాన్ని చూడాల్సిందే!

గుర్రాలకు దిష్టి తగులుతుందా? పాలిచ్చే పశువులకూ, ఈనబోయే ఆవులకూ దిష్టి తగులుతుందని తనకు తెలుసు. అలాంటి ఆవులకి ప్రతీ సాయంత్రం అమ్మ దిష్టి తీస్తుంది. గుర్రానికి కూడా, ఇంటికి తిరిగి వెళ్ళాక అమ్మచేత దిష్టి తీయించాలి. నిధి జనం మధ్య దూరి తన గుర్రాన్ని సమీపించాడు. అంతసేపూ గుర్రం మోస్తున్న తన కత్తిని తీసి, తన శరీరం మీద దాని స్థానంలో అమర్చుకున్నాడు. దగ్గరకు రాగానే గుర్రం మోరపైకెత్తి నిధి భుజం మీద ఆన్చి, వాత్సల్యంగా నొక్కింది. నిధి చెయ్యి గుర్రం మోరను నిమిరింది.

నల్లటి వస్త్రాల్లో, ఆ వస్త్రాల్లాగే నల్లగా, ఎత్తుగా, లావుగా ఉన్న ఒక వ్యక్తి నిధి దగ్గరగా వచ్చాడు. గుబురుగా ఉన్న మీసాలు అతని నోటిమీదికి దట్టంగా ఉన్న గడ్డిపోచల్లా వాలి ఉన్నాయి. ముక్కుచివర కుంకుడుకాయంత పులిపిరికాయ. చిన్నచిన్న ఏనుగు కళ్ళు మినుకు మినుకుమంటూ మెరుస్తున్నాయి. అతని కళ్ళు ఎర్రగా నిధి వైపు చూశాయి. నల్లటి పెదవులు కదిలాయి. గారపట్టిన పళ్ళు తొంగి చూశాయి.

"ఏ ఊరు మనది?" ప్రశ్నించాడతను.

నిధి చిరునవ్వు నవ్వాడు. "నాది కోటీర నగరం. నీది ఏ ఊరో నీకే తెలియాలి!"

అతను గొల్లున నవ్వాడు. "గుర్రాన్ని ఇస్తావా తమ్ముడూ?"

"ఇవ్వను అన్నా!"

"ఇస్తావా అంటే దానం చేస్తావా అని కాదు; 'అమ్ముతావా?' అని అర్థం!" ఆ వ్యక్తి తెలివిగా అన్నాడు.

"ఇవ్వను అంటే అమ్మను అని అర్థం!" నిధి చిన్నగా నవ్వాడు.

ఆ వ్యక్తి బిగ్గరగా నవ్వాడు. తటాలున నవ్వు ఆపి, పాము కళ్ళు చిట్లిస్తూ చూశాడు. "మన గుర్రం వెల ఎంతో?"

"విలువ కట్టలేను. అమూల్యం!" నిధి నవ్వుతూ అన్నాడు.




ఆ వ్యక్తి మళ్ళీ నవ్వాడు. అతని నవ్వు కళ్ళని అందుకోవడం లేదు. "వెలకట్టి ఉంటే మంచిది. అమూల్యమైతే మరీ మంచిది!"

నిధి అతన్నీ, అతని మాటనీ నిర్లక్ష్యం చేస్తూ కట్టువిప్పి, గుర్రాన్ని ముందుకు నడిపించాడు. జనం రెండుగా చీలి గుర్రానికి దారి ఇచ్చారు. నిధి అవలీలగా వాయుమీద కూర్చున్నాడు.

"చక్కని గుర్రం. జాగర్తగా చూసుకో!" నల్లటి వ్యక్తి బిగ్గరగా అన్నాడు.

నిధి తలతిప్పి చూశాడు. అతని ముఖం మీద చిరునవ్వు మెరిసింది. "గుర్రమే నన్ను చూసుకుంటుంది!"

నల్లటి వ్యక్తి మరో మాటకోసం బుర్రని కెలకడం ప్రారంభించాడు. నిధి చెయ్యి వాయుని నిమిరింది. అశ్వం లీవీగా, వేగంగా ప్రాంగణ ద్వారం వైపు నడక సాగించింది. క్షణంలో బాట మీదికి చేరింది. నిధి గుర్రాన్ని హరిహరపురం వైపు మళ్ళించాడు. అటువైపు వెళ్తున్న మనుష్యుల్నీ, వాహనాల్నీ, గుర్రాల్నీ తప్పించుకుంటూ వాయు తన ప్రయాణం సాగిస్తోంది.

శ్వేతాశ్వం కనుమరుగయ్యేదాకా తుమ్మచెట్టులా నిలబడ్డ నల్లటి వ్యక్తి కదిలాడు. పది అంగల్లో రథాన్ని సమీపించాడు. రథం మీద నిలుచున్న వ్యక్తి, అంతసేపు నిధి గుర్రాన్ని వెంటాడిన చూపుల్ని నల్లటి వ్యక్తి మీదికి మళ్ళించాడు. నల్లటి వ్యక్తి తల అడ్డంగా ఊగించాడు.

"ఏ ఊరో?" రథం మీద వ్యక్తి ప్రశ్నించాడు. మొండికత్తి మీద రాస్తున్న ఆకురాయిలా ధ్వనించింది అతని కంఠం.

"కోటీరనగరం దొరా?"

"ధర చెప్పాడా?"

"లేద్దొరా! కోడెగాడు మాటకారి దొరా! అమూల్యం అన్నాడు.. అమూల్యమైతే మరీ మంచిదన్నాన్దొరా?" గొల్లున నవ్వాడతను.

"కళ్ళారా చూశాన్రా. నవ్వుతూనే మాట్లాడావు. పేరు విషకంఠుడే గానీ, నీ మాటల్లో విషం లేదురా!"

"చిత్తం దొరా! విషం మాటలో ఉండకూడదు దొరా; కాటులో ఉండాలి!" విషకంఠుడు గర్వంగా నవ్వాడు.

"మన పేరు శరభాద్రి అనీ, ఈ పరగణానికి పాళెగాడు అనే దొర అనీ ఆ నూనూగు మీసాల్లోంచి ఎరుక జెప్పావా!"

"మన వివరాల్లోకి దూకేలోగా, గుర్రమెక్కిపోయినాడు దొరా... జారిపోనిస్తానా దొరా! మనం తొరగా బైల్దేరాలి..."

"దొరసానమ్మలకి ప్రసాదం రాలేదురా! ఒకరా! ఇద్దరా! ముగ్గురైరి! వారం వారం మనకీ ప్రసాదం కైవారం తప్పలేదుగానీ, ఒక్క దొరసాని కూడా నెల తప్పలేదు..." శరభాద్రి బరువుగా నిట్టూర్చాడు.

"ఆ హరిహరదేముడు కళ్ళు దెరవకపోడు; ఆ తల్లుల కడుపులు సల్లగా కాయలు కాయక పోవు" విషకంఠుడు ధైర్యం చెప్పాడు.

"ఆ నమ్మకంతోటే కదరా మనలో భక్తి పర్వతంలా పెరిగిపోతూనే ఉంది!"

"అయ్యా... ప్రసాదం!"

అటువైపునుండి వినిపించగానే, శరభాద్రి తిరిగిచూశాడు. ఆలయ పరిచారకుడు రథం దగ్గరగా నిలుచున్నాడు. అతని రెండు చేతుల్లో పెద్ద వెండి పళ్ళెం ఉంది. అందులో మూడు కొత్త మట్టి పాత్రలు ఉన్నాయి. వాటి మీద మూకుళ్ళున్నా కూడా ప్రసాదం సువాసన గాలిలో వ్యాపిస్తోంది.

"ఇలా అందియ్యి స్వాములూ" అంటూ శరభాద్రి వంగి, వెండిపళ్ళాన్ని అందుకున్నాడు. రథంలో తన ఆసనం ప్రక్కన భద్రంగా పెట్టి కూచున్నాడు.

"పోనీరా కాముడూ!" అంటూ సారధిని హెచ్చరించాడు.

"అయ్యా... మన్నించాలి... వెండిపళ్ళెం..." ప్రసాదం తెచ్చిన పరిచారకుడు వినయంగా అన్నాడు.

"వచ్చేవారం వస్తాగా! అప్పుడు తెస్తాగా?" శరభాద్రి బొంగురుగా అన్నాడు.

"ప్రధాన అర్చకులకు నామాటగా చెప్పు స్వాములూ!"

పరిచారకుడు నీరసంగా చూసి, వెనుదిరిగి, ఆలయం వైపు వెళ్తున్నాడు.

"ఒరేయ్ విషకంఠుడూ, సంస్కృతం మంత్రాలు వల్లెవేస్తారు గానీ, ఈ పిల్లస్వాములకు ఏమీ తెలీదురా! వారం వారం ప్రసాదం అందించాక, అతనిది అదే ప్రశ్న! మనది అదే సమాధానం!"

శరభాద్రి కంఠం ఆకురాయిలా శబ్దం చేసింది.

"దొరా... నాదో అనుమానం. వారానికో వెండి పళ్ళేనికీ, దొరసానమ్మలు అమ్మలు కాకపోవడానికీ ఏదైనా లంకె ఉంటుందా, ఆ హరిహర దేవుడి దయతో.." విషకంఠుడు అమాయకంగా అడిగాడు.

"ఛీ! పాడు నోరా నువ్వూ! అన్నానో లేదో అప్పుడే మాటలో విషం కక్కుతున్నావ్" శరభాద్రి హుంకరించాడు. ఆ దేముడికి కావాల్సింది వెండి పళ్ళేలూ, బంగారు చెంబులూ కాదురా; కొండంత పత్రీ కాదురా; పిసరంత భక్తి! మన దగ్గర అది ఉంది గదా!"

"చిత్తం దొరా! చిత్తం! పిసరంతేం ఖర్మ! మీ నిలువెల్లా భక్తే గదా!" విషకంఠుడు ఉద్రేకంతో అన్నాడు.

"సరే! ముందు పద... తెల్లగుర్రం ఊరుదాటకుండా చూడాలి!" శరభాద్రి హెచ్చరించాడు.

రథం కదిలింది. వెనక నల్లగుర్రం మీద నల్లటి విషకంఠుడు అనుసరించాడు "మనల్ని తప్పించుకుని ఈగ కూడా ఊరుదాటదు దొరా!"

***(ఇంకా వుంది)***

## మోకాలు నొప్పి ఇక బాధించదు

**మోకాళ్ల** నొప్పులు ముఖ్యంగా మోకాలు కీలు అరగడం వల్ల వస్తాయి. దీనిని వైద్యపరిభాషలో మోకాలి ఆస్టియోఆర్థరైటిస్ అంటారు. ఈ మోకాళ్లనొప్పులు ఎక్కువగా 45 సంవత్సరాల తరువాత అధికంగా కనిపిస్తాయి.

**ఎవరికి వచ్చే అవకాశం ఉంది? :** మోకాళ్ల నొప్పులు రావడానికి మొదటి కారణం అధిక బరువు అని చెప్పవచ్చు. శరీర బరువు వివిధ దశల్లో కీళ్ల మీద పడుతుంది. నడిచేటప్పుడు నాలుగురెట్లు అధికమై మోకాళ్ల మీద పడుతుంది. మెట్లు ఎక్కుతున్నప్పుడు 6 నుంచి 7 రెట్లు అధికంగా పడుతుంది. కీళ్లు ఆరోగ్యంగా ఉన్నప్పుడు ఎటువంటి ఇబ్బంది ఉండదు. కానీ కీలు దెబ్బతిన్నప్పుడు మాత్రం సమస్యలు వస్తాయి. బరువు పెరుగుతున్న కొద్దీ నొప్పి అధికమయ్యే అవకాశం ఉంటుంది.

**కీళ్లలో ఎటువంటి మార్పు వస్తుంది :** మెకాలు కీలు నిర్మితం కావడంలో మూడు ఎముకల పాత్ర ఉంటుంది. అవి ఫీమర్, టిబియా, పటెల్లా. ఈ ఎముకల మధ్యలో మెత్తటి స్పాంజిలాంటి పదార్థం ఉండి రాపిడి లేకుండా చేస్తుంది. దీన్ని మృదులాస్థి అంటారు. అలాగే మోకాళ్ల చుట్టూ కవచాల మాదిరిగా లిగమెంట్స్ ఉంటాయి. ఆస్టియోఆర్థరైటిస్ ఉన్న వారిలో ఈ మృదులాస్థి డెబ్బతినడం జరుగుతుంది. ఎముకలు అరగడాన్ని, దెబ్బతిన్న కార్టిలేజ్‌ను బట్టి వైద్యులు వ్యాధి తీవ్రతను గుర్తిస్తారు.

**హోమియో చికిత్స :** మోకాలి నొప్పులను దూరం చేయడంలో హోమియో మందులు అద్భుతమైన పాత్రను పోషిస్తాయి. హోమియో వైద్యంతో శాశ్వత పరిష్కారం లభిస్తుంది. పైగా ఎటువంటి దుష్ఫలితాలు ఉండవు. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే మోకాలు నొప్పి మళ్లీ వేధించదు.

## పార్శ్వపు నొప్పికి ఉత్తమ చికిత్స

**ప్ర**తి ఒక్కరు ఎప్పుడో ఒకప్పుడు తలనొప్పితో బాధపడే ఉంటారు. అయితే తలనొప్పి చాలా రోజులుగా ఉన్నా, తరచుగా వస్తున్నా, తీవ్రంగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం మంచిది కాదు. సరియైన కారణం తెలుసుకుని చికిత్స తీసుకోవాలి.

**మైగ్రేన్:** దీనిని పార్శ్వపు నొప్పి అని కూడా అంటారు. ఈ తలనొప్పి ఒక భాగంలో రావడం జరుగుతుంది. ఈ నొప్పి కొన్ని గంటల నుంచి కొన్ని రోజుల వరకు ఉంటుంది. వికారం వాంతి వంటి లక్షణాలుంటాయి. శబ్దాన్ని, కాంతిని భరించలేరు. ఘాటైన వాసనను భరించలేరు. పార్శ్వపు నొప్పి ఎక్కువగా ఆడవాళ్లలో వస్తుంది. ఈ నొప్పికి ఖచ్చితమైన కారణం తెలియదు. కానీ మెదడులోని రక్తనాళాలు, నరాలు ప్రేరేపితమై వాటి నుంచి వెలువడే కొన్ని రసాయన పదార్థాల వల్ల తలనొప్పి వస్తుందని భావిస్తుంటారు.

**మైగ్రేన్ ట్రిగ్గర్స్ :** సరియైన సమయానికి భోజనం చేయకపోయినా, నిద్ర తక్కువైనా, ఎండలో తిరిగినా, ఎక్కువ చలికి ఎక్స్‌పోజ్ అయినా, బాగా అలసిపోయినా, పగలు ప్రయాణం చేసినా ఈ మైగ్రేన్ వస్తుంది. చాక్‌లెట్స్, ఐస్‌క్రీమ్స్, రెడ్‌వైన్ లాంటివి మైగ్రేన్ తలనొప్పిని అధికం చేస్తాయి. స్త్రీలకు బహిష్టు సమయంలో మైగ్రేన్ తలనొప్పి ఎక్కువ కావచ్చు. కానీ చాలా మందికి స్త్రీలకు గర్భం ధరించినపుడు మైగ్రేన్ తగ్గుతుంది. మెదడుకు సంబంధించిన సమస్యలు మెనింజైటిస్, ఎన్‌కెఫలైటిస్ వంటి వ్యాధులలో కూడా తలనొప్పి ఉంటుంది.

**చికిత్స :** మైగ్రేన్‌కు, ఇతర తలనొప్పులకు హోమియోలో మంచి చికిత్స అందుబాటులో ఉంది. ముందుగా లక్షణాలు పరిశీలించి కారణాలు తెలుసుకోవాలి. ఏ సమయంలో తలనొప్పి ఎక్కువవుతోంది. లక్షణాలు ఎలా ఉంటున్నాయి. వీటితోపాటు మనస్తత్వం, ఒత్తిడి,ఆలోచనా విధానం తెలుసుకుని చికిత్స ఇవ్వడం వల్ల ఫలితం ఉంటుంది.

## కీళ్లనొప్పులకు తత్వచికిత్స

శరీరంలో రెండు లేక అంతకన్నా ఎక్కువ ఎముకలు కలిసే చోటును కీళ్లు అంటారు. కీళ్లకు సంబంధించి తలెత్తే సమస్యను ఆర్థరైటిస్(కీళ్లనొప్పులు)అంటారు. కీళ్లనొప్పుల్లో వందకుపైగా రకాలున్నాయి. ప్రతి కీళ్లనొప్పికి ప్రత్యేకమైన లక్షణాలుంటాయి. కీళ్లనొప్పులు శరీరంలోని చిన్న కీళ్లను, పెద్దకీళ్లను ప్రభావితం చేసి ఇబ్బందికి గురిచేస్తాయి. కీళ్లనొప్పుల్లో ఎముకల్లో గానీ, కీళ్లలో గానీ, కార్టిలేజ్‌లో గానీ, సైనోవియల్ ద్రవంలో గానీ, లిగమెంట్స్‌లోగానీ సమస్యలు ఉత్పన్నమవుతాయి.

**లక్షణాలు ఇలా ఉంటాయి**

చిన్న, పెద్ద కీళ్లలో నొప్పులు, కీళ్లవాపులు రావడం, నడవడానికి ఇబ్బంది పడటం, ఉదయం లేచినపుడు కీళ్లు పట్టేసినట్టుగా ఉండి మామూలు స్థితి రావడానికి కొన్ని నిమిషాల నుంచి గంటల సమయం పట్టడం జరుగుతుంది. త్వరగా అలసిపోవడం, కీళ్లు వంకరపోవడం వంటి లక్షణాలుంటాయి.

**కీళ్లనొప్పుల రకాలు**

**ఆస్టియోఆర్థరైటిస్ :** ఇది కీళ్లనొప్పుల్లో చాలా ఎక్కువగా కనిపించే సమస్య. ఈ సమస్య రావడానికి బరువు పెరగడం, కీళ్లను ఎక్కువగా ఉపయోగించే పనులు చేయడం, 40 ఏళ్లు పైబడటం వంటివి కారణం కావచ్చు. ఈ సమస్య ముఖ్యంగా మోకాళ్లు, తుంటి కీళ్లలో వచ్చి కార్టిలేజ్‌ను దెబ్బతీసి నడవడానికి ఇబ్బంది పడేలా చేస్తుంది. మోకాళ్లు, తుంటిలో నొప్పి రావడం, లేచేటప్పుడు కీళ్లు బిగుసుకుపోయి ఉండటం, నిలబడలేకపోవడం, మెట్లు ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు నొప్పి రావడం, కీళ్లలో శబ్దాలు రావడం జరుగుతుంది.

**రుమటాయిడ్ ఆర్థరైటిస్ :** రోగి శరీరంలోని ఇమ్యూన్ వ్యవస్థ(రక్షణ వ్యవస్థ) పొరబాటుగా శరీరంలోని కీళ్ల మీద దాడిచేసినపుడు ఈ సమస్య వస్తుంది. చేతి, కాలి వేళ్లు, మోచేయి, భుజం, మోకాళ్లు లాంటి కీళ్లలో నొప్పి రావడం, ఉదయంపూట తీవ్రమైన నొప్పితో లేవడానికి చాలా ఇబ్బంది పడటం జరుగుతుంది. ఈ సమస్య వల్ల కళ్లు కూడా దెబ్బతినే అవకాశం ఉంది. దీనితోపాటు జ్వరం, అలసట, బరువు తగ్గడం, ఆకలి లేకపోవడం, నీరసం రావడం జరుగుతుంది.

**గౌట్ :** ఇది యూరికాసిడ్ అనే పదార్థం శరీరంలో ఎక్కువ విడుదల కావడం లేక శరీరం నుంచి బయటకు పోలేకపోవడం వల్ల యూరికాసిడ్ అనే పదార్థం కీళ్లలో చేరి కీళ్లనొప్పులు కలగచేస్తుంది. కీళ్లనొప్పులు ముఖ్యంగా కాలి బొటనవేలు, కాళ్ల వేళ్లలో ఎక్కువగా కనిపిస్తాయి.

**రుమాటిక్ ఆర్థరైటిస్ :** చిన్నప్పుడు గొంతునొప్పి లేక టాన్సిల్స్ వాపు ఉన్నప్పుడు దానికి సరియైన చికిత్స తీసుకోలేకపోతే హీమోలైటిక్ స్ట్రెప్టోకాకై అనే బ్యాక్టీరియా కీళ్లలోకి ప్రవేశించి కీళ్లనొప్పులను కలగజేస్తుంది. దీనిలో ఏఎస్ఓటైటర్ అనేది పాజిటివ్ వస్తుంది.

**వెన్నెముక సమస్యలు :** వెన్నెముక సమస్యలో డిస్క్ అనే రబ్బర్ లాంటి మృదువైన పదార్థం దెబ్బతిని, వెన్నుపూసలు దెబ్బతింటాయి. దీనిని స్పాండిలోసిస్ అంటారు. మెడభాగంలో, నడుము భాగంలో కూడా ఇటువంటి మార్పులు జరిగి మెడనొప్పి, నడుమునొప్పి వచ్చి ఇబ్బంది పడతారు.

**హోమియో చికిత్స :** కీళ్లనొప్పుల చికిత్సలో హోమియో వైద్యానికి విశిష్టస్థానం ఉంది. ముందుగా కీళ్లనొప్పి ఏ రకానికి చెందినదో తెలుసుకోవడం జరుగుతుంది. తరువాత రోగి మానసిక, శారీరక లక్షణాలు, పరిగణలోకి తీసుకుని మందులు ఇవ్వడం జరుగుతుంది. దీనిని తత్వ చికిత్స అంటారు. వ్యాధి మూలాలకు చికిత్స చేయడానికి ఈ చికిత్స చాలా తోడ్పడుతుంది.

**డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు**
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
**డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)**
**మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్**
**హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్**
**ఫోన్స్: 77 3000 3000, 77 3000 4000**






**పర్వతపూజ ముగిసింది. కృష్ణునిసహా అంతా పల్లెబాటపట్టారు. తనమాటే తలపెట్టక గోవర్ధన గిరిని పూజించారని దేవేంద్రునికి కోపంవచ్చింది. భగ్గుమన్నాడతను. ప్రళయకాలమేఘాలను రమ్మని పిలిచాడు. వచ్చాయవి. విన్నారా! భూలోకంలో విడ్డూరం చూశారా? బృందావనంలో నందగోపుడాది గోపాలురందరికీ కొవ్వెక్కింది. నన్ను పూజించడం మానుకున్నారు. ప్రతి యేటా జరిగే తంతును కాలదన్నారు. కృష్ణుని మాటలు విని, పనికిమాలిన చిన్నగుట్టకు పూజచేశారు. అయినా మించిపోయింది లేదు. ఇల్లు అలకగానే పండుగకాదు అన్నాడు దేవేంద్రుడు. నిజమేనన్నట్టుగా చూస్తున్న మేఘాలతో అంతలోనే మళ్ళీ అన్నాడిలా.**

# మహేంద్రుని దురాగ్రహం:గోవర్ధనోద్ధరణ

వెంటనే మీరుపోయి పల్లెనీ, పల్లెలోని పశువులనూ కకావికలం చేసేట్టుగా, వాటికి ప్రాణభీతి కలిగించేట్టుగా వర్షించండి. వారంరోజులపాటు కుండపోతగా కురవండి. ఎక్కడా ఎండ అన్నది కనిపించకూడదు. అంతా చీకటిమయం కావాలి. ఉరుములతో, మెరుపులతో ఒక్క క్షణం కూడా తెరిపి ఈయక, ఊపిరి ఆడనీయక వేధించండి. తోడుగా సుడిగాలిని కూడా తీసుకుని వెళ్ళండి. పొండి అన్నాడు దేవేంద్రుడు. అతని ఆజ్ఞను అనుసరించి కదులుతున్న మేఘాలతో మళ్ళీ అన్నాడిలా. మీరెలా రెచ్చిపోతున్నదీ నేను దగ్గరుండి చూస్తాను. పదండి! మేఘాలు ముందుకు కదిలాయి. ఓ మేఘాన్ని అధిరోహించి దేవేంద్రుడు కూడా బయల్దేరాడు.

కాసేపటికి పల్లెను ఆక్రమించాయి మేఘాలు. భయంకరధ్వనులతో ఒక్కుమ్మడిగా విజృంభించాయి. పల్లె ఈశాన్యదిశలో ఆకస్మాత్తుగా మెరుపులు మెరిశాయి. కత్తి అంచుల్లా తళతళలాడాయి. జంఝూమారుతం చెలరేగింది. మహావేగంతో కిందికి వచ్చింది. నేలమీది చెట్లను కూకటివేళ్ళతో పెళ్ళగించింది. భరించలేని ఎండసహా వేడివేడి ఆవిర్లు నలువైపులా వ్యాపించాయి. ఈగలు ఎక్కువైనాయి. ఆకాశంలో జేగురు రంగు చిక్కబడింది. ఎర్రని, పచ్చని సూర్యకిరణాలు ఇరుసంధ్యల్లో నిలువునా భూమిని తాకాయి.

దొంతులు దొంతులుగా మబ్బులుపోగుపడ్డాయి. పల్లెపెద్దలు అది గమనించారు. అనుకున్నారిలా.

ఉరుములశబ్దం తూర్పున భరించలేనంతగా ఉంది. పర్వతశిఖరాలపై తెల్లనిమబ్బులు దట్టంగా అలుముకుని ఉన్నాయి. వాతావరణాన్ని చూస్తోంటే పెద్దగాలివాన వచ్చేట్టుగా ఉంది. ఈ అకాలవర్షానికి ఏమవుతామో ఏమో! భయంగా ఉంది.

అలా వారు అనుకున్నదే ఆలస్యం, కారుచీకట్లు కమ్ముకున్నాయి. కులపర్వతాలు కూలుతున్నట్టుగా, చతుస్సముద్రాలు పొంగుతున్నట్టుగా పెనుశబ్దంతో కుండపోతగా ఎడతెగనివర్షం ప్రారంభమైంది. చూడలేనంతగా మెరుపులు మెరిశాయి. భయంకరంగా పిడుగులు పడ్డాయి. భూనభోంతరాళం భోరుమంది. పల్లెపెద్దలు అది గమనించి గొల్లుమన్నారు.

ఇది కల్పాంతమా! ఏమిటీ వర్షం? ఈ జడివానకి నేలకనిపించకుండాపోతోంది. మనకేది దిక్కు? ఎటుపోగలం? ప్రాణాలు కాపాడుకోవడం ఎలా?

దేవేంద్రునికి అందాల్సిన పూజలు, తాను అందుకుని నిశ్చలంగా ఉన్న గోవర్ధనగిరిని చూశాయి మేఘాలు. నీపని పడతాం చూడు అన్నట్టుగా దాని శిఖరం మీద విరుచుకుపడ్డాయి. భోరునవర్షించాయి. గాలివాన ఇటు మనుషుల్నేకాదు, అటు పశువుల్నీ, పల్లెలోని సమస్త ప్రకృతినీ అతలాకుతలం చేయసాగింది. పదేపదే పడుతున్న పిడుగులతో పెద్దపెద్ద చెట్లన్నీ నేలకూలిపోసాగాయి. తట్టుకోలేనిగాలికి కూకటివేళ్ళసహా పెల్లగిల్లిన చెట్లుకొన్ని నీళ్లలో కొట్టుకుపోసాగాయి. నీడనిచ్చేచెట్లు లేవు. తడిసిపోతున్నాయి. రెక్కలల్లాడించే అవకాశంలేదు. ఆకలి. దాంతో ఎక్కడి పక్షులక్కడ నేలపై కూలి మరణించసాగాయి. మరణించిన పక్షులు నీటిలో కొట్టుకుపోసాగాయి. కొండ గుహల్లో దాగున్న మృగేంద్రాలే భయంతో వణికి ప్రాణాలు కోల్పోతుంటే, మిగిలిన ప్రాణులగురించి చెప్పడం ఎబ్బెట్టుగా ఉంటుంది.

> **మేఘాలు పల్లెను ఆక్రమించాయి. దాంతో కారుచీకట్లు కమ్ముకున్నాయి. చతుస్సముద్రాలు పొంగుతున్నట్టు పెనుశబ్దంతో కుండపోత వర్షం. చూడలేనంతగా మెరుపులు, భయంకరమైన పిడుగులు. కూకటివేళ్ళతో పెల్లగిల్లిన చెట్లు, కొండ గుహల్లో భయంతో వణికి ప్రాణాలు కోల్పోతున్న మృగేంద్రాలు... ఏమిటీవర్షం? ఇది కల్పాంతమా! పల్లెపెద్దలు గొల్లుమన్నారు. గోపాలకులు కృష్ణుడికి మొరపెట్టుకున్నారు. అప్పుడు కృష్ణుడు ఏం చేశాడు?**

అడవుల్లోని ఆలమందలు దారీతెన్నూ కానరాక నలువైపులా చెదరిపోసాగాయి. వర్షంధాటిని తట్టుకోలేక ఒకదాని మాటున ఒకటి తలలుదాచుకున్నాయి. కొన్ని బురదలో కూరుకుపోయాయి. ముదిమి పశువులు ప్రాణాలు విడచి ఆ చెట్టుచాటున ఈ చెట్టుచాటున పడిపోయాయి. ఆబోతులుసైతం అదే తీరున మరణించసాగాయి. గోపాలకుల పర్ణకుటీరాలు ఎగిరిపోయాయి. బళ్ళు తలకిందులయ్యాయి. వస్తువులు చిందరవందరయ్యాయి. పాడిపంటలు పాడయ్యాయి. గోపాలురుకు దిక్కులేకపోయింది. దిక్కులేనివారికి దేవుడేదిక్కు. ఆ దేవుడు శ్రీకృష్ణుడే! పదండి ఆయనకే అంతా మొరపెట్టుకుందామనుకున్నారు. పడుతూ లేస్తూ సమీపించారతన్ని.

కృష్ణా! కృష్ణా! ఆప్తబంధూ! అనాథరక్షకా! గోవులసహా మమ్మల్నికాపాడు అని ప్రార్థించారు. ఆలమందలు కూడా తమను కాపాడవలసిందిగా మోరలెత్తి, ఎలుగెత్తి ఆక్రోశించాయి.

ఇటు పల్లెజనం, అటు ఆలమందలు ఆక్రోశిస్తోంటే తట్టుకోలేకపోయాడు కృష్ణుడు. ఆలోచనలోపడ్డాడు.

తనకు జరుగుతున్న పూజను అడ్డుకున్న కారణంగానే ఆ దేవేంద్రుడు ఇంతటి ప్రళయానికి ఒడిగట్టాడు. ప్రజలను నానా హింసలూ పెడుతున్నాడు. అసలు సంగతి గ్రహించలేకపోతున్నాడు. నేను ఆ గోవర్ధనగిరిని ఎత్తిపట్టుకుని, ఆ నీడకు గోవులనూ, గోపాలకులనూ తరలించి కాపాడుకుంటే ఏమవుతాడతను? గర్వం అణగి కాళ్ళబేరానికి రాడు?

గోవర్ధనోద్ధరణే తక్షణకర్తవ్యం అనుకున్నాడు కృష్ణుడు. గోవర్ధనోద్ధరణతో మానవలోకానికేగాక దేవేంద్రునికి కూడా తానేమిటో తెలియజెప్పాలని నిశ్చయించుకున్నాడు. కట్టెదురుగా ఉన్న గోవర్ధనగిరిని చూశాడు. చకచకా నడుచుకుని చేరుకున్నాడక్కడికి. ఇంతింత ధారలుగా కురుస్తున్న వర్షాన్ని చూశాడు. చేతులు జోడించి తమని కాపాడమంటూ వేడుకుంటున్న గోవులనూ, పల్లెజనాన్నీ చూశాడు. ఆలస్యం చేయలేదిక. కొలనులోని తామరమొగ్గను తొండంతో ఏనుగు తొలగించినంత సులువుగా గోవర్ధనగిరి అడుగున చేయి ఉంచి, అవలీలగా దాన్ని పైకెత్తాడు కృష్ణుడు. గొడుగులా నిలిపాడు. హఠాత్తుగా పర్వతం పైకి లేవడంతో, అటూ ఇటూ అది ఊగడంలో దాని మీది చెట్లు కొన్ని కూకటివేళ్ళతో పెళ్ళగిలి కిందపడ్డాయి. పరుగుదీస్తున్న లేళ్ళు జారిపడ్డాయి. ఉరుకుతున్న మృగేంద్రాలుసహా కలుగుల్లో దాగున్న సర్పాలు బయటకి వచ్చి ఎటు పడితే అటు పరుగులు దీశాయి. గిరిపై నివసిస్తున్న విద్యాధరులూ, మునీంద్రులూ అయోమయంగా చూసి, ఏమవుతోందో అంతుచిక్కని పరిస్థితుల్లో పరుగులంకించుకున్నారు.

విడివడిన చెరియల పగుళ్ళనుండి రత్నాలు, గైరికాది ధాతువులు కొల్లలుగా జారిపడ్డాయి. చూసి గోపాలురు నిశ్చేష్టులయినారు. అంతలోనే తేరుకుని ఆనందించారు. కృష్ణా! కృష్ణా అంటూ పరుగులుదీసి వచ్చి నిలిచారు. అలా తనచుట్టూ నిలిచిన గోపాలురతో అప్పుడిలా అన్నాడు కృష్ణుడు.

ఈ జడివానకు జడిసిపోతున్న గోవులనూ, మిమ్మల్నీ రక్షించేందుకే నేను ఈ గోవర్ధనపర్వతాన్ని ఎత్తిపట్టుకున్నాను. చూశారుగా! దీనికింద ప్రదేశం చాలా విశాలంగా ఉంది. మీరంతా పశువులుసహా వచ్చి ఈ గిరికింద నివసించండి. ఎవరికి ఎక్కడ నచ్చితే అక్కడ ఉండండి. స్వేచ్ఛగా విహరించండి. వేలకొలది ఆలమందలకి ఇది సరిపోతుందా? అని ఆందోళన చెందకండి. ముల్లోకాలూ వచ్చి నిలిచినా ఈ ప్రదేశంలో ఒకింత ఖాళీస్థలం ఉంటుంది. రండి.

కృష్ణుని ఆహ్వానాన్ని అందుకుని పల్లెప్రజలంతా గోవర్ధనగిరి కిందకి, దాని నీడలోకి ప్రవేశించారు. పశువులను కూడా పదిలంగా చేర్చారు. కావిళ్ళతో, బళ్ళతో కావాల్సిన గృహోపకరణాలుసహా భార్యాబిడ్డల్ని గిరికిందకి తరలించి, ఊపిరి పీల్చుకున్నారు. భయం లేదిక అనుకున్నారు. తమకు అభయం ప్రసాదించిన కృష్ణుణ్ణి వేనోళ్ళ పొగిడి, చేతులు జోడించి నమస్కరించారు. కొందరు అతనికి సాష్టాంగపడి ప్రణామాలు చేశారు.

ఏడురోజులుగా వర్షం కురుస్తూనే ఉంది. ఆ ఏడురోజులూ కృష్ణుడు గోవర్ధనగిరిని ఎత్తిపట్టుకునే ఉన్నాడు. గోపాలురకు ఎలాంటి బాధలూ, భయాలూ లేకుండాపోయాయి. గమనించాడది దేవేంద్రుడు. సిగ్గుపడ్డాడు. చేసేదిలేక ప్రళయకాలమేఘాలన్నిటినీ ఉపసంహరించాడు. స్వర్గలోకం చేరుకున్నాడు.

మేఘాలు తొలగిపోవడంతో ఆకాశం కడిగిన ముత్యంలా కనిపించింది. నిర్మలంగా నిలిచింది. చూసి గోపాలురు ఆనందించారు. గోవర్ధనగిరి కింద నుంచి బయటపడ్డారు. ఆలమందలు అడవులకి చేరి మేత మేయనారంభించాయి. కురిసినవర్షానికి కొనలుదేరి లేతపసిరిపచ్చికలు చూడముచ్చటనిపించాయి. తీగలన్నీ చిగురుటాకులు తొడిగాయి. చెట్లన్నీ సనసన్నని గాలులతో తలలూగాయి. వాననీరు తొలగిపోవడంతో దారులు ఏర్పడినాయి. మృగసంచారానికి వీలుకలిగింది.

కృష్ణా! ఆలమందలూ, ఆప్తులూ బయటకు వెళ్ళిపోయారు. అందరూ సుఖంగా ఉన్నారు. చాలించిక! గోవర్ధనగిరిని యథాస్థానంలో ఉంచి రా! పిలిచింది మిత్రబృందం. వారి పిలుపు అందుకుని, గిరిని యథాస్థానంలో ఉంచి ముందుకు నడిచాడు కృష్ణుడు.

ఎవరు ఎంతటివారో దేవేంద్రునికి బాగా అర్థమైంది. కృష్ణుడు ఎంతటివాడో ఇంకా బాగా అర్థమైంది. తటస్థునిగా కూర్చుంటే...కృష్ణుణ్ణి పట్టించుకోనట్టే అవుతుందని భయం చెందాడు దేవేంద్రుడు. తన శ్రేయోవృద్ధికి ఆటంకం అని తలచాడు. వెంటనే ఐరావతాన్ని అధిరోహించాడు. దేవప్రముఖుల్ని వెంటబెట్టుకున్నాడు. వజ్రాయుధం ఆదిగా దివ్య చిహ్నాలను ధరించి, దివినుంచి భువికి దిగాడు



దేవేంద్రుడు. గోవర్ధనగిరి చరియపై చిద్విలాసంగా కూర్చున్న కృష్ణుణ్ణి చూశాడు. అతని తేజస్సు ముందు తనెంత? తన తేజస్సెంత? పట్టి చూస్తే దేవతలందరికీ పూజనీయుడైన శ్రీమన్నారాయణునిలా ఉన్నాడు కృష్ణుడు. తెలియక తాను అపచారానికి పాల్పడ్డాడు. తప్పు చేశాననుకున్నాడు దేవేంద్రుడు. ఐరావతం నుండి కిందికి దిగాడు. కృష్ణుణ్ణి సమీపించాడు. సాష్టాంగనమస్కారం చేశాడతనికి.

కృష్ణుడు పట్టించుకోలేదది. దేవేంద్రుణ్ణి పూచిక పుల్లలా తీసిపారేశాడు. ముఖాన్ని అటు తిప్పుకున్నాడు. గ్రహించాడది దేవేంద్రుడు. చేతులు జోడించి నమస్కరిస్తూ ప్రస్తుతించాడిలా.

పరమేశ్వరా! వివిధ దివ్యావతారాలతో లోకాలన్నిటినీ కాపాడుతున్న కరుణామూర్తివి నీవు. సకల వేదాలూ, సమస్త యజ్ఞాలూ నువ్వే! నీకన్నా వేరొకటి ఈలోకంలో లేదు. లోకాల సృష్టి స్థితి లయాలకు ఏకైకకారకుడివి. నిర్గుణస్వరూపుడివి. పరమపూజ్యుడవు. కృష్ణా! గోపాలకుడివై ఉన్న నీ అసలు స్వరూపం తెలుసుకోలేక నీపట్ల ఆపచారం చేశాను. నన్ను మన్నించు. అఖిల భువననియంతవు. నిన్ను శాసించగలవారెవ్వరు? నాకింతటి వైభవాన్ని ప్రసాదించింది నువ్వే కదా!

నేను ఆజ్ఞాపిస్తోంటే...వేనకువేలు మేఘాలు ఒక్కుమ్మడిగా వర్షిస్తోంటే...నువ్వు ఒక్కడివే ధైర్యంగా నిలిచావు. ఆలమందల, గోపాలకుల ఆపద్భీతి తొలగించావు. చూసి ఎంతగానో ఆనందించాను. ఆట బంతిని పైకెత్తి పట్టుకున్నట్టుగా నువ్వు గోవర్ధనగిరిని పైకెత్తి ఎప్పుడైతే పట్టుకున్నావో అప్పుడే నువ్వేమిటో, నీ మహిమేమిటో లోకవిదితం అయింది. నీ అవతారప్రయోజనం కూడా స్పష్టమైంది.

బ్రహ్మాదులు నీకు సాటిరారు. నువ్వు సముద్రుడవు. హిమవంతుడవు. దేవాధిదేవుడవు. నన్ను స్వర్గాధిపతిని చేసిన కరుణామూర్తివి. స్వర్గలోకంపై పరమేష్ఠి లోకం, దానిపై గోలోకం ఉన్నవి. ఆ భువనం పాలిస్తున్న గోవుల్ని నువ్వు గోవర్ధనగిరినెత్తి, ఆనందింపజేశావు. తమ సంతతివారిని కాపాడి సంతోషపెట్టావు. అదితికీ, కశ్యపునికీ ముందుగా నేను పుట్టిన కారణంగా నేను నీకు అగ్రజుడను. నువ్వు నాకు సహోదరుడవు. ఈ కారణంగా నువ్వు నన్ను ఆదరించాలి. అనుగ్రహించాలి.

కృష్ణా! గోలోకంలోని గోవులన్నీ నిన్ను వేడుకున్నాయిలా. గోవర్ధనగిరిని ఎత్తి మా గోజాతిని సంరక్షించావు. మాకు గౌరవనీయుడవయినావు. నిన్ను మా కులస్వామిగా అభిషేకించదలచాం. కాదనక మా తరఫున దేవేంద్రుడు ఆచరించే అభిషేకోత్సవాన్ని అంగీకరించు.

చేతులు జోడించి నమస్కరిస్తూ, కృష్ణుని సమాధానం కోసం ఎదురుచూస్తూ నిలుచున్నాడు దేవేంద్రుడు.

**–అరణి**

# ఓ వారాలబ్బాయి జయభేరి

2

(మురళీమోహన్ జీవితాలాపన)

(గతవారం తరువాయి)

**చిన్నపిల్లల్ని ఎవరిని చూసినా నాకు వెంటనే మా చాటపర్రు గుర్తుకొచ్చేస్తుంది. ఎవరికైనా బాల్యం ఒక తీపిగుర్తు. నాకైతే మరీను. ఆటలకు ఎప్పుడూ ముందుండే వాడిని. మా ఇంటిముందు చాలా పెద్ద ఖాళీస్థలం ఉండేది. అందరం కలిసి అక్కడే ఆడుకునేవాళ్ళం. బ్యాడ్మింటన్ ఆడేవాళ్ళం. అప్పట్లోనే పల్లెటూళ్ళల్లో బ్యాడ్మింటన్ ఆడేవారా? అని చాలామంది ఆశ్చర్యపోతారు. మా ఊళ్లో మేం ఆడేవాళ్ళం. వూల్ బాల్‌తో ఆడేవాళ్ళం. షటిల్ కాక్స్ మాకెప్పుడూ అందుబాటులో లేవు. బాగా చిన్న తనంలో ఉబ్బిద్ది అని ఒక ఆట ఉండేది. అది చాలా ఫేమస్ ఆటన్నమాట. ఈ ఆటకు రెండు టీమ్‌లు ఉండాలి. ఒక టీమ్‌లో వ్యక్తి ఇంకో టీమ్ ఉన్న బాక్స్‌లోకి వెళ్ళాలి. కానీ వెళ్ళనీయకుండా అవతలివారు ఎక్కడికక్కడే అడ్డుకుంటూ ఉండేవారు. వాళ్ళని దాటుకుంటూ వెళ్ళడమనేది చాలా ప్రయాసలకోర్చి చేయాల్సి వచ్చేది. వెళ్ళిన వ్యక్తిని పట్టుకునే క్రమంలో అవతలివారు బాక్స్ నుంచి బయటకు వెళ్తే ఔట్ అన్నమాట.**

ఉబ్బిద్ది ఆడే ఓపిక లేకపోతే బచ్చాలాటలు ఆడే వాళ్ళం. నాపరాయి ముక్కలు ఏరుకుని తెచ్చుకునే వాళ్ళం. వాటిని మంచి షేప్‌కు తీసుకురావాలని

## పరువు పోకూడదని ఇచ్చేసేవారు..!

వాటి అంచుల్ని నేలకేసి రుద్దేవాళ్ళం. బాగా నున్నగా ఓ మోస్తరు బచ్చాలు చేసుకునేవాళ్ళం. వాటన్నిటినీ రింగులోపెట్టి, దూరంగా నిలుచుని ఓ పెద్ద బచ్చాతో వాటిని కొట్టేవాళ్ళం. మేం విసిరిన రాయి తగిలి బయటికి ఎన్ని వస్తే అన్ని మనం గెలుచు కున్నట్టు. తగలకుండా రింగులో ఆగిపోతే అది మైనస్. కొన్నిసార్లు మామిడిటెంకలు పోగేసుకుని కూడా ఆడేవాళ్ళం. వీటిలో బెట్టింగులు కాసుకునే వాళ్ళమన్నమాట. అంటే డబ్బులు పెట్టుకునే బెట్టిం గులు కాదు. ఓడిపోయిన టీమ్ ఓవైపు కూర్చుం టారు. గెలిచిన టీమ్ వెళ్ళి వాళ్ళ చెవి పట్టుకుని కస కసా తిప్పడమన్నమాట. కొన్నిసార్లు అవతలి వారిని ఎక్కువ ఏడిపించడానికి చెవులు నలపడం, గిల్లడం వంటివన్నీ చేసేవారు. అయినా అవతలి వారు కుయ్యికయ్యిమనకుండా కూర్చునేవారు. ఎందుకంటే ఓడిపోయారు కాబట్టి గెలిచినవారు ఏం చేసినా వారు భరించాలి. కొన్నిసార్లు ఆ నొప్పి భరించలేక కళ్ళ నీళ్ళు కూడా పెట్టుకునేవారు. కొంతమంది పిల్ల లకైతే చెవులు బాగా కందిపోయేవి. ఇంట్లో చూసి 'ఏంట్రా ఇది.. ఏమి ఆటలివి, దరిద్రపు ఆటలు' అని తిట్టేవారు. ఇక పెద్దవాళ్ళు తిట్టేసరికి కొన్నాళ్ళు ఆ ఆట జోలికి వెళ్ళేవాళ్ళం కాదు. ఆ టైమ్‌లో ఖాళీ సిగ రెట్ పెట్టెలు పోగేసేవాళ్ళం. ఎక్కడ ఖాళీ సిగరెట్ పెట్టె ఉన్నా మా జేబుల్లోకి చేరాల్సిందే. ఒక్కోదానికి ఒక్కో వేల్యూ ఉండేది. చార్మినార్‌వంటి వాటికేమో వేల్యూ తక్కువగా ఉండేది. ప్లేయర్స్, సిజర్స్, గోల్డ్ ఫ్లాక్ వంటివాటికి వేల్యూ ఎక్కువగా ఉండేది. వాటిని పోగేయడం కోసం ఏలూరు కూడా వెళ్ళేవాళ్ళం. ఏలూరులో ఓ క్లబ్ ఉండేది. దాన్ని టౌన్ హాల్ అని పిలిచేవారు. రిచ్ పీపుల్ అంతా అక్కడ కూర్చుని సిగరెట్లు తాగుతూ మాట్లాడుకునేవారు. మా ఊరు ఏలూరుకు మరీ పక్కనే ఉండటంతో ఊరి జనాభా చాలావరకు సాయంత్రానికి అక్కడికి చేరుకునే వారు. టీ తాగడానికి కూడా ఏలూరు వెళ్ళొచ్చే వారంటే ఎంత ర్యాపో ఉండేదో అర్థం చేసుకోండి. సాయంత్రంపూట టిఫిన్లు చేసే ఆచారం అప్పట్లోనే మా దగ్గర ఉండేది. టిఫిన్ల కోసం ఏలూరు వెళ్ళేవారు కొందరైతే, సరుకులు, కూరగాయలు కొనుక్కోవ డానికి మరికొంతమంది వెళ్ళేవారు. పేకాట ఆడేవాళ్ళు ఇంకొంతమంది ఉండేవారు. అక్కడికి వెళ్తే మాకు బోలెడన్ని సిగరెట్ పెట్టెలు దొరికేవి. ఎవరికి ఎన్ని దొరికితే అంతగొప్ప.





మురళీమోహన్ తల్లి వసుమతీదేవి

### అమ్మమాటే వేదం

చాలా మంది చెడుగుడు ఆడేవారు. నేను కాస్త వీక్ కావడంవల్ల చెడుగుడు ఆటకి దూరంగా ఉండే వాడిని. 'చెడుగుడు జోలికి వెళ్ళొద్దు నాన్నా' అని అప్పుడెప్పుడో మా అమ్మ చెప్పినట్టు గుర్తు. అమ్మ చెప్పిన మాట అక్షరాలా వినేవాడిని. అందుకే మా ఇంట్లో నన్నెప్పుడూ కోప్పడేవారు కాదు. మొదటి నుంచి కూడా నేను 'రాముడు మంచి బాలుడు' అనే టైప్ అన్నమాట.

మా ఇంట్లో మగపిల్లలం ఇద్దరం. తమ్ముడు మాత్రం చెరువుల్లో బాగా ఈతలు కొడుతూ ఉండే వాడు. నాతో పోలిస్తే తను కాస్త ఫాస్ట్‌గా ఉండేవాడు. నేను చాలా స్లోగా ఉండేవాడిని. అస్సలు ఈతల జోలికి వెళ్ళేవాణ్ణి కాదు. నీళ్ళల్లో దూకాలంటే నాకు కొంత భయం ఉండేది. ఆ భయంవల్ల అసలు ఈత అలవాటు కాలేదు. పైగా ఈతకు పిల్లలు వెళ్తే

పెద్దలు కాస్త గాబరా పడేవారు. నేను ఎప్పుడూ అలా వెళ్ళేవాడిని కాదు కాబట్టి ఎప్పుడూ కూడా ఎవరి చేతా తిట్టించుకునే పరిస్థితి రాలేదు.

### పండుగలు.. పబ్బాలు!

ఇవాళ్టికి కూడా పండుగల అందం పల్లె టూళ్ళల్లో చూడాల్సిందేగానీ, సిటీల్లో చూడలేం. అసలు సిటీల్లో పండుగలు పేలవంగా ఉంటున్నాయి. ఎప్పుడొస్తున్నాయో.. ఎప్పుడు పోతున్నాయో కూడా సరిగా అర్థం కావడం లేదు. అదే పల్లెటూళ్ళల్లో అయితే పండుగ వస్తోందంటే సందడి మామూలుగా ఉండేది కాదు. నెలరోజుల ముందునుంచే పిల్లా పీచూ అందరి హడావిడీ మొదలయ్యేది. ఇప్పట్లాగా రెడీమేడ్ బట్టలు ఉండేవి కాదు. తానులో చించి కుట్టించేవారు. వాటిని కుట్టడానికి ఊళ్ళల్లో ఒక్కడే టైలర్ ఉండేవాడు. అందరూ ఒకేసారి బట్టలు తెచ్చిచ్చేవారు. అన్ని బట్టలతో టైలర్ ఉక్కిరిబిక్కిరయ్యేవాడు. సమయానికి ఇచ్చేవాడు కాదు. ఇక చూస్కోండి మా పరిస్థితి. పండుగకు చాలాముందే బట్టలు కొనివ్వమని గోల చేయడం, వాటిని అందరికన్నా ముందే టైలర్‌కి ఇవ్వడం.. ఇచ్చింది మొదలుకొని రోజూ సాయంత్రంపూట వాడి దగ్గరకెళ్ళి కూర్చుని 'మా అమ్మగారు పంపించారండీ.. మా బట్టలు తొందరగా ఇమ్మంటున్నారండీ' అనడం. మా తొందర తట్టుకోలేక 'రేపు కుడతానులేరా.. రేపు రా పో..' అనేవాడు టైలర్. సరేనని నిరాశగా వెళ్ళడం మరలా మరుసటిరోజు అదే టైమ్‌కి అతని ముందు వాలిపోవడం.. ఇదన్నమాట పరిస్థితి. కొన్ని సంద ర్భాల్లో ఎంతకీ ఇవ్వకపోతే ఏకంగా రాత్రుళ్ళు వాళ్ళ ఇంటిముందు కూర్చుని కుట్టించుకుని మరీ తెచ్చుకునే వాళ్ళం. ఏ పండుగకైనా ఈ ప్రహసనం ఇలాగే జరిగేది.

సంక్రాంతి పండుగంటే నాకు చాలా ఇష్టం. మా చిన్నతనంలో సంక్రాంతి పండుగ వచ్చిందంటే మా కోలాహలం చాలా ఎక్కువగా ఉండేది. సంక్రాంతికి ముందుగానే అంటే డిసెంబర్‌లోనే పంట ఇంటికి వచ్చేది. గడ్డివాముల నుంచి గొడ్ల కోసం గడ్డిని బండ్లల్లో ఇంటికి తోలేవారు. సరిగ్గా అదే సమయానికి సంక్రాంతికి సెలవులు ఇచ్చేవారు. ఆ సెలవుల్లో ఊరి బయటకువెళ్ళి ఎండుపుల్లలు ఏరేవాళ్ళం. ఇంటి ముందు నుంచి గడ్డిబండ్లను తోలుకెళుతూ ఉంటే, వాటి వెనుక పరుగులు తీస్తూ వెనకవైపు నుంచి గడ్డి లాక్కునేవాళ్ళం. ఈ లోపు 'ఎవడ్రావాడు..' అని కర్ర పుచ్చుకుని బండి మీద నుంచి ఎవరో ఒకరు కిందకుదూకి వచ్చేసేవారు. వాళ్ళకేదో చెప్పుకునేవాళ్ళం. కొన్నిసార్లు వాళ్లు కూడా ఏదో ఒకటి బెదిరించాలి కాబట్టి బెదిరించినట్టు చేసేవారు. మొత్తానికి అలా సేకరించిన గడ్డి అంతా జాగ్రత్తగా ఎండబెట్టి దాచడం పెద్ద ప్రక్రియ. భోగి పండుగరోజు తెల్లారుజామునే మంచులో నిద్రలేచి ఆ గడ్డితో భోగిమంటలు వేసేవాళ్ళం. ఎవరి భోగి మంట ఎంత పెద్దదో కొలతలు వేసుకుంటే ఆ ఆనందాన్ని మాటల్లో వర్ణించలేం. ఆ సందడిని చెబుతోంటే నా కళ్ళముందు నా బాల్యం తచ్చాడు తున్నట్టుంది. భోగి మరుసటి రోజు సంక్రాంతి. ఇంట్లో పొంగళ్లు పొంగించేవారు. ఇక కనుమ, ముక్కనుమ పండుగల గురించి చెప్పనవసరం లేదు. ఆ మూడు, నాలుగు రోజులూ ఎంజాయ్‌మెంట్ అంతా ఇంతా అని ఉండేది కాదు.




**బాల్యాన్ని ఎంతోబాగా ఎంజాయ్ చేశారు మురళీమోహన్. ఉబ్బిద్ది, బచ్చాలాట, చెడుగుడు...లాంటి ఎన్నో ఆటలాడుకునేవారు. పల్లెటూళ్ళలో దశాబ్దాలక్రితమే బ్యాడ్మింటన్ ఆడేవారంటే నమ్ముతారా? పండగలంటే నెలరోజులుముందే సందడి మొదలయ్యేది. ఊరందరికీ ఒక టైలరే. ఎంతరాత్రైనా అక్కడే కూర్చుని బట్టలు కుట్టించుకునేవారు. సంక్రాంతంటే మురళీ మోహన్‌కి ఎంతో ఇష్టం. ఇక వినాయకచవితి చందా ఇవ్వనివాళ్ళను బాగా ఆటపట్టించేవారు.**

### తద్ది.. ఆడపిల్లలు!

ఉండ్రాళ్ళ తద్ది, అట్లతద్ది అని తద్దిలు వచ్చేవి. ఆడపిల్లలందరూ తెల్లవారుజామునే లేచి స్నానాలు చేసి, చక్కగా జడలు వేసుకుని, తలనిండా పువ్వులు పెట్టుకుని ఒకచోట చేరేవారు. అక్కడ అందరూ కలిసి తొక్కుడుబిళ్ల ఆడేవారు. అదెలాగంటే, ఎనిమిది గళ్లున్న ఒక పెద్ద బాక్సును సుద్దముక్కతోనో, ముగ్గుతోనో గీసుకుని ఓ బిళ్లను ఒంటికాలితో తోసుకుంటూ తీసుకెళ్ళాలన్నమాట. ఆ బిళ్ళ గీత మీద ఆగిపోకుండా ప్రతి బాక్సు మధ్యలోకి ఒంటి కాలితో గెంటుతూ బాక్స్ చివరివరకు తీసుకెళ్ళాలన్న మాట. ఆ తర్వాత ఉయ్యాలాట. ఉయ్యాలలూగే వారు. కబడ్డీలాగానే ఆడవాళ్ళు అటో జట్టు, ఇటో జట్టు కట్టి గూట్లో రూపాయి.. నీ మొగుడు సిపాయి.. అని పాడుకుంటూ పాట ఆపకుండా ఒక ఆట ఆడేవారు. అది కూడా గమ్మత్తుగా ఉండేది. అప్పుడు మా పని ఏంటో తెలుసా? మగపిల్లలందరం కలిసి తెల్లారుజామున వెళ్ళి ఆడపిల్లల్ని ఏడిపించాలి. పల్లెటూళ్ళల్లో ఊరి బయటకు వెళ్తే పల్లేరు కాయలు దొరికేవి. వాటిని జాగ్రత్తగా ఏరుకుని తెచ్చి ఆడపిల్లలు ఆటలాడేచోట విసిరేవాళ్ళం. వాళ్ళు చూసుకోకుండా వాటిమీద కాళ్లు వేసి తొక్కేసేవారు. పాపం ఆ బాధను భరించలేక పల్లేరుకాయలు విసిరిన వారిని బాగా తిట్లు తిట్టేవారు. అప్పుడు మేమంతా చంకలు కొట్టుకుని 'భలే ఏడిపించాం.. భలే ఏడిపించాం..' అనుకునేవాళ్ళం.

### ఓ బొజ్జ గణపయ్య...!

వినాయకచవితి పండుగ చాలా బాగా చేసేవాళ్ళం. చవితి వస్తోందనగానే ముందు పిల్లలందరం ఒకచోట కలుసుకునేవాళ్ళం. ఎవరెవరిని చందా అడగాలో ముందుగానే ఒకమాట అనుకునేవాళ్ళం. ఆ ప్రకారం మా ఊళ్లో షాపుల దగ్గరకి, ప్రొఫెషనల్స్ దగ్గరికీ అంటే లాయర్లు, డాక్టర్ల దగ్గరికి వెళ్ళేవాళ్ళం. వాళ్ళిచ్చిన చందా డబ్బులు తీసుకెళ్ళి మర్నాడు ఏవో పప్పుబెల్లం వంటివి కొనుక్కుని చిన్నపాటి పార్టీలు చేసుకునేవాళ్ళం. ఎవరైనా ఇవ్వకపోయారనుకోండి.. వారి గతి అధోగతే. ఒకవేళ డాక్టర్‌గారు ఇవ్వకపోతే, ఆయన బోర్డు తీసుకెళ్ళి లాయర్‌గారి ఇంటికి తగిలించేవాళ్ళం. ఆయనపేరు సత్యానందరావు అని ఉంటే ముందు 'అ' అని రాసి అసత్యానందరావు అని మార్చేసేవాళ్ళం. ఇలాంటివి చెప్పుకుంటూ పోతే చాలానే ఉన్నాయి. మేం పేర్లు మార్చిన మర్నాడు మమ్మల్ని తిట్టుకుని అవన్నీ సరిదిద్దుకునేవారు. ఆ తిప్పలుచూసి చుట్టుపక్కలవాళ్ళు ఫక్కున నవ్వుకునేవారు. మరికొందరైతే ఇంకో అడుగు ముందుకేసి, 'పసిపిల్లలతో ఎందుకు, పదో పరకో ఇస్తే అల్లరి చేయరు కదా.. మహా అయితే ఓ రూపాయి ఇచ్చేద్దురూ..' అని ఉచిత సలహాలు చెప్పేవారు.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# ప్రయాణంలో పదనిసలు

-ఆనందరావ్ పట్నాయక్

**ఎక్స్‌ప్రెస్ రైలు వేగంగా ముందుకు దూసుకుపోతోంది. మూర్తి, రావు ఇద్దరూ రాబోయే స్టేషన్ కోసం ఎదురుచూస్తున్నారు. ఆకలి దంచేస్తోంది. రైలు ఆగింది. రావు లేచి ఎవరితోనో మాట్లాడాడు. బూమ రాంగ్‌లా వెనక్కువచ్చి తన సూట్‌కేసు పట్టుకుని, మూర్తీ దిగుదిగు, ఇదే మనం దిగాల్సిన స్టేషనట. రావు మాటల్లో తొందరచూసి మూర్తి చిద్విలాసంగా చిరునవ్వు చిందించి, ఎంతమాత్రం కాదు అన్నాడు. రావు ఆశ్చర్యంగా చూశాడు. అవును. ఇది టౌనుస్టేషన్. తర్వాత జంక్షన్ స్టేషన్ వస్తుంది, మనం అక్కడే దిగాలి అన్నాడు తాపీగా.**

ఆర్యూ ష్యూర్...

హండ్రెండ్ పర్సెంట్. నాకు బాగా తెలుసు అన్నాడు మూర్తి సర్వాంతర్యామిలా.

సరే నేను గేటు దగ్గర నిలుచుంటాను. నీవు కూడా రెడీగా ఉండు అని కదిలి ముందుకెళ్ళాడామిత్రుడు.

అంతలో సెల్‌ఫోన్ మోగింది. చాలాసేపు అలాగే రింగైంది. ఫోను రింగవుతుంటే ఎత్తరేం? అసహనంగా అరిచాడు మూర్తి ఎదురుగా ఉన్న వ్యక్తిని ఉద్దేశించి.

అది నాదికాదు నీదే, తాపీగా చెప్పాడతను.

అవును కదూ, ఇది నా బుజ్జిముండ పలక రింపే కదూ అని, సెల్లు తీసి మాట్లాడాడు. అటు నుండి జాన్ విష్ చేశాడు.

ఎక్కడ ఉన్నారు సార్ మీరిద్దరూ.

ఓహో జాన్ భయ్యా, మేం టౌనుస్టేషన్ దాటాం, జంక్షన్ స్టేషన్‌కి చేరుకుంటున్నాం చెప్పాడు మూర్తి.

సరే అంతా సక్రమంగా సాగుతోంది కదా. ఉయ్ విల్ మీట్ సూన్. హడావిడిగా కాల్ కట్ చేశాడు జాన్.

ఇక్కడే దిగాల్సింది మీరిద్దరూ... ఈ రైలు జంక్షన్ స్టేషనుకు వెళ్ళదు, కాట్లకుక్క కరిచినట్లు ఉరిమాడు ఎదురుగా ఉన్న భైరవ్‌నాథ్.

వచ్చేదే జంక్షన్ స్టేషను కదూ, నత్తినత్తిగా అడి గాడు మూర్తి. ప్యాంటు కిందికి లాక్కుంటూ, ఎందుకైనా మంచిది. పళ్ల దిగితే పదనాలుగు ఇంజక్షన్లు చేసుకోవాల్సి ఉంటుందేమో అనుకున్నాడు అతగాడిలోని భైరవుడిని తలుచుకుంటూ.

నో...నో... వచ్చేది ఫలానాస్టేషను, అక్కడ దిగి మళ్లా లోకల్ ట్రైన్‌లో వెనక్కు రావల్సి ఉంటుంది ఈసారి సున్నితంగా చెప్పాడు భై.నా.

అది సరే, ఫలానా స్టేషన్ నుండి ఈ చోటుకి వెళ్ళొచ్చా అని హోటలు అడ్రస్ రాసి ఉన్న కాగితం చూపించాడు మూర్తి. భై.నా అది చూసి ఈ స్టేషన్‌కి, ఆ స్టేషనుకి మధ్యలో ఉంది మీ హోటలు. టాక్సీలు, ఆటోలు దొరుకుతాయి అన్నాడు.

హమ్మయ్యా బ్రతికించావురా మగడా అన్నాడు మూర్తి సంబరంగా.

వాట్... వాట్యూర్ టెల్లింగ్.

భై.నా. పళ్లు తళుక్కుమన్నాయి. అదేమీ విన నట్లు తన సూట్‌కేసు పట్టుకొని డోరు దగ్గరకు వచ్చేశాడు. బండి ఆగడమే తరువాయి మిత్రులిద్దరూ దిగిపోయారు. అది మూడో ప్లాట్‌ఫాం. ఆకలిరాముడు అదేపనిగా అరుస్తున్నాడు. లగేజీతో ఫుటోవర్ బ్రిడ్జ్ ఎక్కాలంటే మాటలా! ట్రాక్స్ రెండూ ఖాళీగానే ఉన్నాయి. ఒకరూ, అరా ప్యాసింజర్లు పట్టాలుదాటి వెళుతున్నారు. మనమూ పట్టాలు దాటి ఫస్టు ప్లాట్‌ఫాంకి వెళదాం, రా గురూ అన్నాడు మూర్తి.

ఇద్దరూ దిగి పట్టాలు దాటుకుంటూ వెళ్ళారు. మూర్తి చెంగున ఎగిరి చెయ్యి అందించాడు కానీ రావుది భారీ విగ్రహం. ప్లాట్‌ఫాం ఎక్కలేక మూర్తి చేతిని గట్టిగా లాగేశాడు. మిత్రులిద్దరూ ట్రాక్‌మీద పడిపోవడం, జనం గొల్లున నవ్వడం జరిగింది. ఏదో రైలు వేగంగా వస్తోంది. తమ ఆయుష్షు ఆ నాటికి అయిపోయిందనుకున్నాడు. వచ్చిన బండి మూడో ప్లాట్‌ఫాంమీద ఆగింది. కంపార్టుమెంట్ గుండా మిత్రులిద్దరూ ఎక్కి బ్రిడ్జి మెట్లెక్కి ఫస్టు ప్లాట్‌ఫాం చేరుకునేసరికి సొలొచ్చింది.

స్టేషనుకి ఎదురుగా ఉన్న హోటల్లో భోంచేశారు. పప్పు, పెరుగులు లేవు. కావలిస్తే వెండి, బంగారాలు దొరుకుతాయిగానీ, అన్నట్లుంది వాడి వాలకం. ఆటోవాళ్ళని తప్పించుకుని సర్కారువారు ఏర్పాటు చేసిన ట్రాఫిక్ బూత్‌కి వెళ్ళారు. తమ గమ్యానికి మూడువందలు అవుతుందని చీటి ఇచ్చాడు కాని



స్టేబులు. గతుక్కుమంది మిత్రద్వయం. బస్సులుం టాయని విని కాళ్లీడ్చుకుంటూ మండుటెండలో బస్టాండుకి వెళ్లారు. ఎంక్వైరీలో మనిషి ధుమధుమలాడు తున్నాడు. మరోగంటవరకు బస్సులేవీ లేవట. ఈ తతంగమంతా చూస్తున్న ఒక పెద్దమనిషి ప్రైవేటు బస్టాండుకి వెళ్ళమని వాళ్ళకి సలహా చెప్పాడు. సూట్‌కేసులు మోసుకుంటూ దారంతా అడుగుతూ వెళ్ళారు. బస్సులేవీ ఆగకుండా యమర్జెంటుగా వెళ్ళి పోతున్నాయి. ఆగిన బస్సు గమ్యానికి వెళ్ళదట. సహనం చచ్చిపోయింది వాళ్ళిద్దరికీ. మొత్తంమీద బస్సొచ్చింది. గబగబా ఎక్కేసి సూట్‌కేసులు ఉంచారో లేదో బస్సు విమానమై పోయింది. సూట్‌కేసులు స్థానచలనం చెందడంతో జర్రున జారి పోతున్నాయి. వాటి క్రింది చక్రాలు బాగా పని చేస్తున్నట్లుంది. నిద్రపోతున్న ఒక ప్యాసింజరును గుద్ది ఆగిపోయాయి. నిద్ర పాడైపోయిందని కోపం, ముడుకు ముక్కలయిపోయిందని, రౌద్రం... మొత్తం మీద నవరసాల్లోని రెండురసాలు, సమ్మిళతమై పాసింజరు నోటి నుండి బూతుపురాణం వస్తోంది.

టికెట్‌కి యాభై రూపాయలైంది. రెండువందల యాభై రూపాయలు ఆదా అయిందని ఆనందం కలిగింది. బస్సు జెట్‌వేగంతో పోతోంది. ఇరుపక్కల ఇళ్లు, షాపులు, ఆఫీసులున్నాయి. కండక్టరు చిల్లర ఎంత మిగిలిందో లెక్కచూసుకుంటున్నాడు. హఠాత్తుగా మూర్తి లేచి ఆపాలి, ఆపాలి... స్టాప్...స్టాప్ అని పొలికేకలు పెట్టాడు. బస్సాగలేదు. బస్టాపులోనే ఆగింది.

దిగు, దిగు, ఇదే అపోలో హాస్పిటలు. దీని దగ్గరే మన హోటలు అని గాభరా పెట్టేశాడు మూర్తి. వాళ్ళిద్దరూ దిగాక బస్సు వెళ్ళిపోయింది. తీరా చూస్తే అది అపోలో టైర్ల ఫ్యాక్టరీ. మూర్తివైపు కోపంగా చూశాడు రావు. తనను కాదన్నట్లు అక్కడున్న మరో వ్యక్తికి అడ్రసు కాగితం చూపించాడు మూర్తి.



అరే ఇక్కడేమిటి దిగారు, ఇంకా చాలా దూరం పోవాలి అన్నాడాయన ఇంగ్లీషులో.

నేనూ అటే వెళుతున్నాను. ఆటోలో పోదాం అన్నాడాయన. మిత్రులిద్దరూ సరేనన్నారు. మీటరు వేసి ఆటో డ్రైవర్ యమస్పీడులో పోనిచ్చాడు. ఆ పెద్దమనిషి దారిలో దిగిపోయి డబ్బివ్వబోయాడు. రావు, మూర్తి వద్దని, అతగాడేమో ఇస్తాననీ... కోర్టులో వకీల్లా బిగుసుకొంటున్నారు. ఆటోవాడు మేధావివర్గానికి చెందినవాడిలా ఉన్నాడు. సహనం లేకపోయింది. ఆటో లాగించేసి హోటలు ముందు ఆపాడు. మిత్రద్వయం దిగారు. ఠాప్‌మని చప్పుడు వినగానే జడుసుకున్నారు ఆ ఇద్దరూ. ఆరు అడుగుల ఎత్తున్న దర్వాను సెల్యూట్ కొట్టాడు. అతగాడి బూటు చేసిన చప్పుడది. రెండున్నర అయిందన్నాడు ఆటోవాలా. సరదాపడి చిల్లర తడమబోయాడు రావు. మూర్తి మీటరుచూసి రెండువందల యాభై ఇచ్చేశాడు. అప్పటికే జనం వింతగా చూసి నవ్వుకుంటున్నారు. ఆ హోటలుకి ఆటోలు అసలు రావు.

హోటలు బోయ్ వచ్చి లగేజీ లోనికి తీసుకెళ్ళాడు. లోపల చల్లగా, హాయిగా ఉంది. సోఫాల్లో కూచోగానే పాతాళంలోకి పోతున్న అనుభూతి కలిగింది. అంత మెత్తగా ఉన్నాయి. గోళాల్లోని పచ్చటి మొక్కలు ఫక్కుమని నవ్వాయి. అవమానం అవ్వడమెందుకని రిసెప్షనిస్టును కలిశారు. తెల్లగా ఉన్న ఆమె పళ్లు ఇంకా తెల్లగా మెరిశాయి. ఉడుకుబోత్తనం వచ్చింది మిత్రులకు.

వాట్ కెన్ ఐ డూ ఫర్యూ, అందా కోమలి కోకిల స్వరంతో. తేరుకుని, తమకోసం రూం బుక్కయిందన్నారు. ఆమె రిజిస్టర్ తిరగేసి మరగేసి లేదని చెప్పింది. ముందు రూంలోకి దూరి జలకాలాడి పట్టుపాన్పు ఎక్కి పవళించాలని ఉంది వాళ్ళిద్దరికీ. మధ్యలో అవాంతరం. మూర్తికి లైటు వెలిగి జాన్‌తో మాట్లాడాడు. అతగాడు చెప్పడమే తడవు ఆమె బోయ్‌ని పిలిచి, రూం నంబరు చెప్పి కార్డొకటి ఇచ్చింది. బోయ్ సూట్‌కేసులు పట్టుకుని నడిచాడు.

రూం కీస్ కహాహై అన్నాడు రావు వచ్చీ రాని హిందీలో. వాడు వింతగా చూశాడు.

ఆయియే మేరే సాథ్ అని ముందుకు దారి తీశాడు. రూం ముందు ఆగి కార్డుని స్లాటులో పెట్టి డోరు తెరచాడు. ఈ ఆధునిక యుగంలో కీస్‌కి తావులేదని మాగ్నటిక్ కార్డుతో పని జరుగుతుందని మిత్రులిద్దరికీ అర్థమైంది. బోయ్ లైట్లువేసి సూట్‌కేసులు ఉంచేసి చేతులు నలుపు కుంటున్నాడు. నూర్రూపాయల నోటిచ్చి ఆ నలుపుడు వదిలించాడు రావు. మిలిటరీ సెల్యూట్‌చేసి వెళ్ళిపోయాడువాడు. ఈసారి జడుసుకోలేదు మిత్రద్వయం.

ఉక్కపోతగా ఉంది. ఏ.సి. ఆన్ అవలేదంటావా? సందేహంగా అడిగాడు రావు.

బోయ్ దొరగారు వచ్చినప్పుడు లైట్లతోపాటు ఏ.సి. కూడా ఆన్‌చేసి ఉండాలి మరి.

మూర్తి లేచి నలువైపులా చూశాడు. ఎక్కడా పవర్ ప్లగ్ కనిపించలేదు. కాని ఏ.సి. రన్ అవుతున్న సన్నని శబ్దం వస్తోంది. ఫరవాలేదు. ఇద్దరు

మిత్రులు సేదదీరారు. ఫ్యాన్ ఫుల్ స్పీడ్‌లో పెట్టినా చెమట్లు వస్తున్నాయి. టీ టైం అది. టేబుల్ మీద టీ, కాఫీ, పాలగుండ ప్యాకెట్సున్నాయి. రావు ఒక కప్పులో నీళ్ళుపోసి పాలగుండ కలిపాడు. దానిని పెర్కోలేటరులో పెట్టి మరగించేసరికి బుసబుస లాడుతూ పాలు పైకి తన్నాయి. ఈసారి నీళ్ళు మాత్రమే మరగించి అప్పుడు పాలపొడి వేసి టీ తయారుచేశాడు. తేనీరు తాగడంతో కళ్ళు మూతలు పడ్డాయి. లేచేసరికి రాత్రి ఎనిమిదైంది. మిత్రులిద్దరూ హోటల్ బయటికి వచ్చి దాబాలో రొట్టెలు తిని వచ్చారు. అదే ఆ స్టార్ హోటల్‌లో తింటే అక్కడే సర్వరుగా ఉండిపోవాలి. రాత్రి పదింటికి కాలింగుబెల్లు మోగితే డోరు ఓపెన్‌చేశాడు మూర్తి. జాన్ రూంలోకి రాగానే ఏమిటి సార్లూ, ఏ.సి. ఆన్ చెయ్యలేదేమిటి? అని ఎంట్రెన్స్ దగ్గర నలుచదరంగా ఉన్న సెన్సర్ నొక్కాడు.

చల్లటిగాలి ఉవ్వెత్తున వచ్చింది. దానితోపాటు ఆల్కహాలు వాసన. ఏ.సి. కారులో కూచున్నప్పుడు పెర్ఫ్యూమ్ వాసన రావడం తెలుసు కాని ఇక్కడ ఈ స్టేటు ఎంత అడ్వాన్సు అయిపోయిందో! అనుకున్నాడు మూర్తి. హోటల్‌వాళ్ళని అభినందించాలనుకున్నాడు. ఉరుకులు, పరుగులతో వచ్చేశాడు సుప్పనాతి సూరీడు. మూర్తి, రావులు టీ చేసుకుని తాగారు. జాన్ లేటుగా లేచి గుడ్మార్నింగ్ చెప్పాడు. తల పగిలిపోతోంది, టీ కావాలన్నాడు. పాలపొడి లేదు. ఫోన్ చేయడంతో ఎక్కువ మొత్తంలో ప్యాకెట్సు వచ్చాయి. టీ తాగి బాత్రూంకి వెళ్ళాడు జాన్. రావూ, ఏసి రూంలో సెంటువాసనకి బదులు ఆల్కహాలు వాసన రావడం తమాషాగా లేదూ.. అన్నాడు మూర్తి.

నా బొంద జాన్ తాగిన విస్కీ కంపు అది. హేంగోవరులో ఉన్నాడు. తెలియట్లా.. కసిరాడు రావు పాతికేళ్ళ నుండి ఫ్రెండ్స్ సర్కిల్లో పానకాలస్వామిగా పేరొందిన మూర్తి సిగ్గుపడ్డాడు. జాన్ తాగుతాడనే ఊహే రాలేదతనికి. ముగ్గురూ తయారై డైనింగ్ హాలుకి వెళ్ళారు. కాంప్లిమెంటరీ ఫుడ్. స్టేజికి నలువైపులా రకరకాల బ్రేక్‌ఫాస్టు ముచ్చటగా సర్ది ఉంది. రావు స్వీటు ప్రియుడు. కేక్సు, పేస్ట్రీలున్నాయి. ఒక గ్లాసు జారులో తెల్లని రసగుల్లాలు పానకంలో తేలుతూ నోరూరించాయి. ఒక పట్టు పట్టాలనుకున్నాడతను. వడ, మసాలా, ఇడ్లీ, టమోటాబాత్ గట్రా తినేసి చివర్లో రసగుల్లా వడ్డించుకొని వచ్చాడు రావు. గుడ్‌ఛాయిస్ అన్నాడు జాన్. ఛాతీ విరుచుకున్నాడతను. ఫోర్కుతో నొక్కి తిందామంటే గట్టిగా ఉందది. పెద్దసైజు ఉసిరికాయది. ఉప్పునీళ్లల్లో నానబెట్టడంతో ఉబ్బి రసగుల్లాలా కన్పించింది రావుకి.

**ఆ మిత్రద్వయం పరాయి రాష్ట్రానికి విహారయాత్రకెళ్ళింది. ఇక రైలెక్కిన దగ్గరనుంచీ మొదలయ్యాయి వాళ్ళకి అడుగడుగునా తిప్పలు! దిగాల్సిన చోట రైలు దిగలేకపోయారు. డబ్బు ఆదా చేయాలని బస్సెక్కి రాంగ్ అడ్రస్‌లో దిగారు. తిరిగి ఆటోఎక్కి భారీగా సమర్పించుకున్నారు. స్టార్ హోటల్ రూములో ఎ.సి ఆన్ చేసుకోవడం కూడా చేతకాలేదు వాళ్ళకి. రైల్లో కూల్‌డ్రింక్ తాగితే చుట్టూ ఉన్నవాళ్ళు ఆ మిత్ర ద్వయాన్ని 'స్పిరిట్'ట్యువల్ సొసైటీ బ్యాచ్‌కింద లెక్కేశారు!**

ఇప్పుడు వాటరు తాగండి, నోరంతా తియ్యబడుతుంది అన్నాడు జాన్. భంగపాటు బయటకు కన్పడనీయకుండా చిన్నగా మందహాసం చేశాడు రావు. ఊతప్పం చాలాబాగుంది. తిన్నావా... అడిగాడు మూర్తి. అలాంటివి ఏమీ లేవిక్కడ. ఆశ్చర్యం ప్రకటించాడు జాన్. మరి అటువైపు ఆ క్లోజెట్‌లో ఉన్నవి ఏవిటి? చూపెట్టాడు మూర్తి.

అవన్నీ నాన్‌వెజ్ ఐటమ్సు సామీ.. కామ్‌గా అన్నాడు జాన్. ప్లేకార్డులో ఐటమ్సు పేర్లు రాసి ఉన్నా చదవనందుకు తనలో తనే తిట్టుకున్నాడు మూర్తి. ఫక్తు శాకాహారి అతను. తను ఫూల్ కానందుకు బోల్డంత ఆనందపడ్డాడు రావు. సర్వర్‌ని పిలిచి ఫ్రూట్ జ్యూసు తెమ్మని చెప్పారు మిత్రులిద్దరూ. ఏ జ్యూస్ కావాలనడిగాడు వాడు. జాన్ దూరంగావెళ్ళి సెల్లులో మాట్లాడుతున్నాడు. అప్పుడే ఆరడుగుల అరబ్బు షేక్ ఒకడు డైనింగ్ హాలులోకి అడుగుపెట్టాడు.

షేక్.. అరబ్బు షేక్.. అన్నాడు రావు అబ్బురంగా. సర్వర్ తెచ్చిన డ్రింకు తాగేశారు వాళ్లిద్దరూ. ఆ సంతోషంలో వందరూపాయలు టిప్ ఇచ్చాడు మూర్తి. జాన్ వచ్చి అక్కడ బిల్లు పేమెంటు, టిప్పులు గట్రా ఉండవని మందలించాడు. పదండి వెళదాం అని బయల్దేరదీశాడతను. కాని వెంటనే బయల్దేరలేకపోయారు మిత్రులిద్దరూ. సంగతేమిటనడిగాడు జాన్. రెండువేళ్లు చూపించారు వాళ్ళు. అప్పుడు పడింది జాన్ దృష్టి గ్లాసులమీద. ఇడ్లీ, సాంబారు తిన్న పొట్టకి చాక్లెట్ షేక్ మంచిదికాదని క్లాసు పీకాడు జాన్. అవేవీ వినే పరిస్థితుల్లో లేరువాళ్ళు. మరు నిమిషంలో రూంలో ప్రత్యక్షమయ్యారు. బట్టలు ఊడదీసుకుని బాత్రూంలోకి దూరాడు రావు. కెవ్వుమన్న కేక వినబడ్డం, ఎంత వేగంగా దూరాడో రావు అంతవేగంగా తిరిగి వచ్చాడు. దెయ్యం, ఆడ దెయ్యం అని గొణుక్కుంటూ బెడ్ మీద వాలిపోయాడు. జాన్ బాత్రూంలోకెళ్ళి చూస్తే లేడీ స్వీపర్ మూర్ఛపోయి ఉంది.

మర్నాడు సైట్ సీయింగ్‌కి వెళ్ళారు మిత్రులిద్దరూ. మోటారులాంచిలో ఐలాండుకి వెళ్ళారు. అక్కడ మెరైన్ డ్రైవ్‌లో నడుచుకుంటూ వెళ్తున్నారు. ఒకవైపు బ్యాకువాటర్సు, మరోవైపు హోటల్సు, షాపులు, ఇళ్లు ఉన్నాయి. చెట్ల నీడన చల్లగా ఉంది. పిల్లతెమ్మెర్లు వీస్తుంటే వేసిన జీడి పలుకులు ఆరాఆరా తింటూ నడుస్తుంటే తమ యాత్ర సాఫల్యం అయిందని సరదా పడ్డారు. తిరిగి వచ్చేందుకు లాంచి ఎక్కారు. మోటారు చప్పుడు చేస్తూ లాంచి కదిలింది. చిన్న, చిన్న పచ్చిక నెమళ్ళు వాలుతుంటే తెల్లని కొంగలు మునిపుంగవుల్లా కూచున్నాయి.

ఫొటో తియ్ గురువా.. అన్నాడు రావు. సమాధానం లేదు. చూసేసరికి మూర్తి ఇంకా ఒడ్డున నిలబడి చేతులూపుతున్నాడు. లాంచి డ్రైవర్‌ని బ్రతిమాలి మిత్రుడిని ఎక్కించుకున్నాడు. రావుకి విపరీతమైన కోపం వచ్చింది. ఎవరో నానీ, నానీ అని పిలుస్తుంటే తననే అనుకుని వెళ్ళాడట. తీరావెళ్ళి వాకబు చేస్తే నిన్నుకాదు. మహాప్రభో నా కొడుకు మణి తప్పిపోతే పిలిచానన్నాడట. బిక్కపోయి చెప్పుకొచ్చాడు మూర్తి ఉరఫ్ నానీ.

విహారయాత్ర పర్వం ముగిసింది. హోటలు చెకవుట్ చెయ్యాలి. జాన్ బిల్లు పేమెంటుచేసి వెళ్ళిపోయాడు. మూర్తి, రావులు పనిచేసే ఆఫీసుకి జాన్ కంపెనీ మెటీరియల్స్ సప్లయి చేస్తుంటుంది. పర్యటనకి తమరాష్ట్రం బాగుంటుంది రమ్మనమని ఆహ్వానించడంతో మిత్రులిద్దరూ రావడం జరిగింది. సూట్‌కేసులు పట్టుకుని కిందికి దిగారు వాళ్ళిద్దరూ. వందరూపాయల టిప్ కొట్టేసిన బోయ్ ఎదురై టాక్సీ పిలవాలా అని అడిగాడు. వద్దని చెప్పి అక్కడున్న సోఫాల్లో కూచున్నారు. బయట దర్వాను, లోన బోయ్ గో.కి.న (గోతి కింద నక్క)లాగ కన్పడుతున్నారు వాళ్ళకి.

అరగంట.. గంట గడిచింది. గో.కి.న.లు లేరు. బహుశా డ్యూటీ దిగి పోయుంటారు. మిత్రద్వయం లేచివెళ్ళబోతున్నారు. అందులో హోటలు సెక్యూరిటీ వచ్చి లగేజీ చెక్ చెయ్యాలని చెప్పారు. మూర్తి సూట్‌కేసు ఓపెన్‌చేసి చూపించాడు. అందులో అతగాడి బట్టలుతప్ప, మరేమీ లేవు. రావు సూట్‌కేసు ఓపెన్‌చేస్తే అందులో టీ, కాఫీ, పాలపొడి పొట్లాలు దండిగా ఉన్నాయి. వాటితోపాటు బాత్రూంలోని



సబ్బులు, షేవింగ్ సెట్, షాంపూ, మాయిశ్చరైజరు, టూత్‌బ్రష్‌లున్నాయి. అవన్నీ కాంప్లిమెంటరీ ఐటమ్స్. కానీ అందరి దృష్టిని ఆకర్షించిన వస్తువు తెల్లటి టర్కీ టవలు. అది హోటలుది. రావు కూడా ఆశ్చర్య పోయాడు. హోటల్ రూంలో ముగ్గురు ఉండడం వలన తన టవలు తీసి వాడాల్సి వచ్చింది. చెకవుట్ చేసినప్పుడు తొందరలో తన టవలు బదులు పొరబాటున హోటలు టవలు వచ్చేసింది. అప్పటికీ అనుకున్నాడట గోధుమరంగులో ఉండాల్సిన తన టవలు అంత తెల్లగా ఎలా మారిపోయిందని. అంతకు ముందురోజు బాత్రూంలో స్పృహ తప్పిపడిపోయిన లేడీస్వీపరుకి ముఖంచాటు చేసుకొనేందుకు రావు టవలు పనికొచ్చింది. అసలు విషయం బయటపడడంతో అందరూ ఊపిరి పీల్చుకున్నారు. అయినా అవమానం జరగనే జరిగింది. మిత్రులిద్దరూ చెంపలు వాయించుకుని ఆ రాష్ట్రానికి టూరిస్టుగా రాకూడదని, ఒకవేళ వస్తే స్టారు హోటల్లో దిగకూడదని ఒట్టు పెట్టుకున్నారు.

తిరుగు ప్రయాణంలో రావు, మూర్తి ఇద్దరూ తమసీట్ల కింద సూట్‌కేసులు చైనుతో లాక్ చేసుకుని సెటిలయ్యారు. రైలు కదిలింది. ఒక అమ్మాయి పాట అందుకుంది. భక్తిగీతాలు బహురమ్యంగా పాడుతోంది. అది విశేషం కాదు. చరణంలోని చివరి పంక్తి "పద్మావతిని నేనయ్యా. ఉద్విగ్నాన ఉన్నాను. సంకటమోచనసాయీ... బిరాన రావోయీ" శ్రోతలను ఆకట్టుకుంది. ఆమె పుట్టు గుడ్డిది.

రైలు ఒకచోట ఆగింది. మూర్తి ప్లాట్‌ఫాం మీదికి దిగి సిగరెట్టు ముట్టించాడు. ఇంజను కూత పెట్టడంతో బోగీలోనికి ఎక్కి నిలబడ్డాడు. బండి వేగం పుంజుకుంది. "ఫస్టు కిస్ ఆఫ్ వైఫ్, లాస్టు పఫే ఆఫ్ స్మోక్" గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు. రైలును అందుకోవాలని ఒకతను పరుగెడుతున్నాడు. మూర్తి చెయ్యి అందించి లోనికి లాగాడు. తొందరలో ఒక చెప్పు జారిపోయింది. రొప్పుతున్న అతగాడిని తమ సీటు దగ్గరికి తీసుకుపోయి మంచినీళ్ళు అందించాడు. టికెట్ కలెక్టరు వచ్చాడు. అందరి టికెట్సు చెక్ చేశాకా... టికెట్ ప్లీజ్.. అన్నాడు ఆ ఆసామిని. అతను జేబులు తడుముకున్నాడు. టికెట్ లేదు. సరికదా డబ్బు కూడా ఏమీ లేదు. అతనికి ఏడుపు రావడమే తరువాయి. ఇదంతా నాటకం. పెనాల్టీతో కట్టు. లేకపోతే వచ్చే స్టేషన్‌లో పోలీసులకు అప్పగించాల్సి ఉంటుంది. టి.సి. కంఠంలో జాలి, కరుణ కలికానికి కూడా కానరావడంలేదు. మిత్రులిద్దరికీ జాలి వేసింది. జేబులు వెతికినప్పుడు తన విజిటింగుకార్డు చూడడం జరిగింది. దయాకర్ అని ఉంది. మంచి పొజిషనులో ఉన్న వ్యక్తే. టి.సిని బతిమిలాడి నల్లకోటులో పంచరంగుల నోటు నొక్కడంతో గండం గడిచింది.

ఎవరో తరుముతున్నట్టు రైలు బండి పరుగెడుతోంది. కూల్‌డ్రింక్సు అమ్మకానికి వచ్చాయి. రావు ఆర్డరిచ్చాడు. ఆర్డినరీనా... స్పెషలా అడిగాడు వాడు. అందులో రెండు రకాలు ఉంటాయా అని అడగబోయి స్పెషల్ అన్నాడు బడాయిగా రావు. 'నిజాం... నిజాం' అని పిలవడంతో ఆతూ... ఆతూ... అని నిష్క్రమించాడు వాడు. దాహంగా ఉండడంతో మిత్రులిద్దరూ గటగటా తాగేశారు. ఇదేమిటి? రుచి, రంగు, వాసన తేడాగా ఉందన్నారు. అందులో స్పిరిట్ పంచ్ చేసి ఉంది అన్నాడు దయాకర్. ఆశ్చర్యంగా చూశారు మిత్రులు. అవును. మనం ఇప్పుడు దాటి పోయిన స్టేట్‌లో ప్రొహిబిషను ఉంది. బోర్డరు దాటగానే పానప్రియులు ఈ స్పెషల్ డ్రింకు కోసం ఆత్రుతగా ఎదురుచూస్తుంటారు. బహుశా మీరు కూడా స్పిరిట్యువల్ సొసైటీకి చెందిన భక్తులై ఉంటారనుకున్నాను. ఎద్దేవాగా అన్నాడు దయాకర్. ఆ ఇద్దరిలో నిషా నిమిషాల్లో పాకిపోయింది. మళ్ళీ తెలివి వచ్చేసరికి ఎదురు సీటులో ఏంజెల్ ఒకామె కూచుంది. తెల్లని బట్టల్లో మరింత తెలుపురంగులో దివి నుండి భువికి ఏతెంచిన దేవకన్యలా ఉంది. దయాకర్ లేడు. రావు చెప్పులు కూడా లేవు. అంకుల్ లైట్ ఆఫ్ చేసేదా అడిగింది ఏంజెల్. సంస్కారం ఉట్టిపడుతోంది ఆమె మాటల్లో. మూర్తి మారు మాట్లాడకుండా లైట్ ఆఫ్ చేశాడు. మాటల్లో ఆమె మతబోధకురాలని తెలిసింది. వాళ్ళిద్దరూ తమ చేదు అనుభవాలు ఎంతో పంచుకున్నారు. జీవితాన్ని సరళంగా తీసుకోండి. చేదు రుచి చూడని వాళ్ళకి తియ్యదనం మాధుర్యం అర్థం కాదు. మనసుని మీ ఆధీనంలోకి తీసుకుంటే మేరు పర్వతాన్ని ఎత్తగల సమర్థులవుతారని హితబోధ చేసింది. ఆమె బ్యాగ్‌మీద సరళ అని రాసుంది.

రైలు గమ్యస్థానం చేరుకుంది. రావు మాత్రం ఇంకా ముభావంగా ఉన్నాడు.

"కమాన్ రావ్.. టేకిట్ ఈజీ. మన యాత్రలో నాలుగు పాత్రలు ఎదురయ్యాయి. వాళ్ళపేర్లలోని ముందు అక్షరాలు వరుసగా కూడుకో. అదే ప్రయాణంలో పదనిసలు.. అదే జీవితం" అతని మాటల్లో వైరాగ్యం కనబడింది రావుకి.

అంతలో "డ్రింక్సు... కూల్ డ్రింక్సు" అరుచుకుంటూ రావడంతో మిత్రులిద్దరూ పక్కుమన్నారు.

సెల్: 094377 47960




అమ్మ పురిటినొప్పులు పడుతూ
బాధతో అరుస్తూ ఉంటే
టెన్షన్‌తో వరండాలో తిరుగుతూ
పాపం నాన్న!

## పాపం నాన్న!

నవమాసాలూ మోసి
తన ప్రాణాన్ని పణంపెట్టి
బిడ్డకు జన్మనిచ్చే ఆడదాని కష్టం
ఈ మగవెధవలకేం తెలుసు?
అని అత్తగారు సణుగుతూ ఉంటే
గిల్టీగిల్టీగా ఫీలవుతున్న
పాపం నాన్న!
పాప పెరిగి పెద్దదయ్యే కొద్దీ
అరచేతుల్లో, పొట్టమీద, వీపుమీద
భుజాల మీద పెట్టుకుని
అపురూపంగా చూచుకునే
పాపం నాన్న!

రోజూ స్కూలు బస్‌వరకూ
బండిలో తీసుకెళ్ళి
బస్ వెళ్ళేంతవరకూ,
ఓపికగా, దిగులుగా, వేచి ఉండే
పాపం నాన్న!

వయసు వచ్చింతర్వాత
ఎటువంటి వ్యామోహాలకూ
లోను కాకుండా
వేయి కళ్ళతో కాచుకుంటూ
తపన పడే
పాపం నాన్న!
ఇంటర్‌నెట్‌లో సంబంధాలు వెతికి
తన బుజ్జి తల్లికి సరైన మగడొస్తాడో లేదోనని
ఆందోళన పడుతూ,
పెళ్ళయి అత్తవారింటికి పంపేటప్పుడు
తట్టుకోలేక



మగగాంభీర్యాన్ని వదిలేసి
భోరుమనే,
పాపం నాన్న!

ఎక్కడో ఒకటీ అరా తప్ప
అన్ని కథలూ, అన్ని పాటలూ
అన్ని సినిమాలూ, అమ్మ మీదేనా?
"కుమాతానభవతి" అన్న
ఆదిశంకరుడు కూడా
ఆడాళ్ళ పక్షమే!
"కుపితానభవతి" అని
ఏ మహానుభావుడూ అనలేదే!

కడుపులో మోయడం
కనడం తప్ప
అన్ని విషయాల్లో
ఏం తక్కువనీ
పిచ్చినాన్నకు!

**—పాణ్యం దత్తశర్మ, సెల్: 95502 14912**



# నీటి అలలపై తేలుతూ...

**రామాయణంలో రాముడు లంకకు వారధి నిర్మించేటప్పుడు రాళ్లను సముద్రంలో వేస్తే అవి తేలాయి అని చెప్పుకుంటారు. అప్పటి సంగతేమోగానీ ఇప్పుడు మాత్రం నీటిపైనే తేలివుండే రకరకాల నిర్మాణాలు చేస్తున్నారు. వాటి గురించి తెలుసుకుంటే ఆశ్చర్యపోవడం మీవంతవుతుంది. మరి అలా నీటి అలలపై తేలియాడే అద్భుతమైన నిర్మాణాల గురించి మీరూ తెలుసుకోండి!**

## ఫ్లోటింగ్ ఫుట్‌బాల్ పిచ్

'ఫుట్‌బాల్ ఎక్కడ ఆడుకుంటాం?' అదేం ప్రశ్న, ఎక్కడ ఆడడం ఏమిటి? గ్రౌండ్‌లో అడుకుంటాం అని చెప్పాలనుకుంటున్నారా! అయితే ఆ మాటను ముందే వెనక్కి తీసుకోండి. ఫుట్‌బాల్ అనేది భూమిపైనే కాదు నీటిపైన కూడా ఆడుకోవచ్చు మరి. నీటిపైన తేలుతూ ఎలా ఆడుకుంటాం? అని ఆశ్చర్యపోతున్నారా. కానీ ఇది నిజం. థాయిలాండ్‌లోని పాన్యీ ఐలాండ్‌లో నీటిపై తేలియాడే ఫుట్‌బాల్ పిచ్ ఉంది. పాన్యీ ఐలాండ్‌లో స్థానిక నివాసితులు ఈ ఫుట్‌బాల్ పిచ్‌ని కర్రలతో నిర్మించారు. ఇది నిర్మించి ఇప్పటికి ముప్పై సంవత్సరాలైంది. అలల తాకిడి ఉంటుంది కాబట్టి ఈ పిచ్‌పై ఫుట్‌బాల్ ఆడడం కొన్నిసార్లు ప్రమాదకరం. అయినా సరే స్థానికులు ఈ ఫుట్‌బాల్ పిచ్‌పైనే ఆడేందుకు ఎక్కువ ఇంట్రెస్ట్ చూపిస్తారు. ప్రస్తుతం ఈ పిచ్‌కి ఆదరణ పెరిగింది. 2011 నుంచి ప్రతి సంవత్సరం జనవరి–అక్టోబర్ మధ్యలో ఎక్కువ మంది పర్యాటకులు ఈ ఫుట్‌బాల్ పిచ్ చూడడానికి వస్తున్నారట.

## ఫ్లోటింగ్ ఫారెస్ట్

పర్యావరణాన్ని సంరక్షించుకోవాలనే కోరిక బలంగా ఉండాలే కానీ దాన్ని కాపాడే చెట్లను నేల మీదే నాటి పెంచక్కర్లేదని నిరూపిస్తోంది ఈ ఫ్లోటింగ్ ఫారెస్ట్. హాలెండ్ సమీపంలోని రోటర్‌డ్యామ్ నగర ఆధునీకరణ పనుల్లో భాగంగా ఎన్నోసార్లు చెట్లు తీసివేయాల్సి వస్తుండేది. ఫలితంగా గ్లోబల్ వార్మింగ్ అధికమవడంవల్ల అక్కడి సముద్రజలాల మట్టం పెరుగుతూ దగ్గర్లో ఉన్న ఊళ్లను ముంచెత్తుతున్నాయి. అందుకే, తొలగించిన ఆ చెట్లను ఓడరేవులోని సాగరజలాల్లో తిరిగి పెంచితే ఎలా ఉంటుంది? అన్న వినూత్న ఆలోచన చేశారు అక్కడి అధికారులు. దాని ఫలితంగానే ఈ ఫ్లోటింగ్ ఫారెస్ట్ ఏర్పాటు చేశారు. ఉప్పు నీళ్ళు ఉంటే మొక్కలు పెరగవు కనుక దాదాపు 500 లీటర్ల సామర్థ్యం కలిగిన నీటి కుండీలను వీటికోసం తయారు చేసి, అవి నీటిలో మునిగిపోకుండా ఉండేందుకు కుండీల్లో మట్టితో పాటూ తేలికగా ఉండే లావా శిలలనూ ఉపయోగించారు. క్రేన్‌ల ద్వారా సముద్రం మీదకు చేర్చిన ఈ నీటి కుండీల్లో ఏడాదిలో నాలుగుసార్లు నీరు నింపితే చాలు. ఎండిపోయిన చెట్లను తిరిగి పెంచడంతో పాటూ ఇలాంటి ఏర్పాటు ద్వారా పర్యావరణ సమతుల్యతకు చెట్ల ఆవశ్యకతనూ తెలియజేయడమే ఈ ఫ్లోటింగ్ ఫారెస్ట్ ఉద్దేశం. అలాంటిదే ఇంకో ఫారెస్ట్ సిడ్నీలోని పారమట్టా రివర్‌లో ఉంది. సిడ్నీలో ఇరవయ్యో శతాబ్దంనాటికి అనేక షిప్‌లు నిరుపయోగమై వృథాగా పడి వున్నాయి. అలాంటి వాటిల్లో 1140 టన్నులు బరువున్న 102 సంవత్సరాల నాటి ఒక ఓడలో దట్టంగా చెట్లు పెరిగాయి. అది ఇప్పుడు ఒక పెద్ద అడవిలా తయారైంది. దాన్ని అక్కడివారందరూ ఫ్లోటింగ్ ఫారెస్ట్‌గా పిలుచుకుంటున్నారు. దాన్ని చూడడానికి చాలామంది పర్యాటకులు వస్తున్నారు.

## అతిపెద్ద ఫ్లోటింగ్ మార్కెట్

మామూలుగా భూమిపైన ఉండే మార్కెట్ గురించి మనకు తెలుసు. అదే నీటిపైన మార్కెట్ ఉంటే! నీటిపైన మార్కెట్టా! అమ్మకాలు, కొనుగోళ్ళు ఎలా చేస్తారు? అనుకుంటున్నారా. థాయిలాండ్, ఇండోనేసియా, వియత్నాంలలో ఈ ఫ్లోటింగ్ మార్కెట్లు ఉన్నాయి. అక్కడికి వెళ్లిన వారందరూ ఫ్లోటింగ్ మార్కెట్ చూడకుండా తమ పర్యటన పూర్తిచెయ్యరు.

ఈ ఫ్లోటింగ్ మార్కెట్లలో అత్యంత పేరెన్నికగన్నది థాయిలాండ్ ఫ్లోటింగ్ మార్కెట్. ఇది చాలా పురాతనమైనది. ప్రపంచంలోనే అత్యంత పేరెన్నికగన్నది ఈ థాయిలాండ్ ఫ్లోటింగ్ మార్కెట్. ఈ ఫ్లోటింగ్ మార్కెట్‌లో అమ్మకాలు, కొనుగోళ్ళన్నీ పడవలపైనే జరుగుతాయి. పడవల్లో సామాన్లు పెట్టుకుని ఉంటారు అమ్మకందారులు. కొనుక్కోవాలని అనుకునేవారు పడవల్లో వెళ్ళి కొనేసుకోవడమే! దొరకని వస్తువంటూ ఉండదు. కేవలం విదేశాలలోనే కాదు మనదేశంలో కూడా ఓ ఫ్లోటింగ్ మార్కెట్ ఉంది.

ఇక మనదేశంలో ఉన్న ఏకైక ఫ్లోటింగ్ మార్కెట్ కాశ్మీరు లోయలోని శ్రీనగర్‌లో ఉంది. ప్రతిరోజు ఉదయం నాలుగుగంటల నుంచి రెండుగంటల పాటు రైతులు దాల్‌లేక్ సరస్సు తీరంలో పడవల మీద కూరగాయలు, పండ్లు, పువ్వులు అమ్ముతారు. పడవలపై సాగే ఈ ఫ్లోటింగ్ మార్కెట్‌ను కనులారా వీక్షించాల్సిందే.

## ఫ్లోటింగ్ స్విమ్మింగ్‌పూల్

స్విమ్మింగ్ చేయడం వ్యాయామమే కదా. చాలా మంది వేసవిలోనే ఈత కొడతారు. కానీ స్విమ్మింగ్ ఏ కాలంలోనైనా చేయవచ్చు. స్విమ్మింగ్ చేయాలంటే పల్లెటూర్లలో అయితే చెరువులు, బావులు ఉంటాయి. అదే సిటీలో అయితే ప్రత్యేకమైన వ్యవస్థ ఏర్పాటు చేసి స్విమ్మింగ్‌పూల్ నిర్మిస్తారు. ఆ స్విమ్మింగ్‌పూల్ భూమిపైనే ఉంటుంది. అలాకాకుండా సముద్రంపైనో లేదా నదిపైనో స్విమ్మింగ్ పూల్ నిర్మిస్తే ఎలా ఉంటుంది. అలలపై తేలియాడుతూ మరో అలలపైన స్విమ్మింగ్ చేయడం ఈ ఫ్లోటింగ్ స్విమ్మింగ్‌పూల్ ప్రత్యేకత. ప్రపంచంలో ఇలాంటి ఫ్లోటింగ్ స్విమ్మింగ్‌పూల్స్ కొన్ని ఉన్నాయి. ఒకటి ఇటలీలో ఉండగా, మరొకటి చిలీలో, ఇంకొకటి పారిస్‌లో, ఇంకా బెర్లిన్‌లో ఉన్నాయి.

## ఫ్లోటింగ్ రాంప్

స్కేటింగ్ చాలామందికి తెలిసిన ఆట. శరీరాన్ని బ్యాలెన్స్ చేసుకుంటూ చక్రాలపై శరవేగంగా

పరుగులు తీసే ఈ ఆటను రకరకాల ప్రదేశాల్లో ఆడుతూ ఉంటారు. అయితే చుట్టూ నీరు, మధ్యలో స్కేటింగ్ రాంప్ ఉంటే? ఆ రాంప్‌పైన స్కేటింగ్ చేస్తూ ఉంటే ఎలా ఉంటుంది? ఆశ్చర్యంతో పాటు ఆనందంకూడా మన సొంతం అవుతుంది. ఇలాంటి ఆనందం మీకు సొంతమవ్వాలంటే కాలిఫోర్నియా వెళ్ళాల్సిందే. అక్కడ ఉండే తహోయి అనే లేక్ నడి మధ్య ఈ స్కేటింగ్ రాంప్ ఉంది. 2013 సంవత్స రంలో దీన్ని నిర్మించారు. పూర్తిగా కర్రతో ఏకబిగిన 300 గంటల్లో పూర్తిచేశారు. ఈ నిర్మాణానికి 125 స్క్రూలు ఉపయోగించారు. ఇది 'పౌండ్' ఆకారాన్ని పోలి ఉంటుంది. ఈ రాంప్ పైన స్కేటింగ్ చేయడం కాస్త కష్టతరం కూడా. ఎందుకంటే ఏమాత్రం స్లిప్ అయినా లేక్‌లో పడిపోవాల్సిందే మరి.

## ఫ్లోటింగ్ గోల్ఫ్ కోర్స్

గోల్ఫ్ ఆట అందరికీ తెలుసుగా... భూమిమీద ఆడే ఈ ఆటని ఇప్పుడు అలలపై కూడా ఆడేలా ఏర్పాటు చేస్తున్నారు. నీటి అలలపై 'ఈ ఫ్లోటింగ్ గోల్ఫ్‌కోర్స్'ను మాల్దీవుల్లో ఏర్పాటు చేయనున్నారు. ఇప్పటికే తొంభైశాతం గోల్ఫ్ కోర్స్ నిర్మాణం పూర్తయింది. ఇంకా తుదిమెరుగులు దిద్దాల్సి ఉంది. మాల్దీవుల్లో ఉన్న హిందూమహాసము ద్రంపైన ఈ ఫ్లోటింగ్ గోల్ఫ్ కోర్స్ నిర్మిస్తు న్నారు. ఇప్పటికే పర్యాటకరంగంలో మాల్దీ వులు ప్రపంచవ్యాప్తంగా ఉన్న ప్రముఖ ప్రదేశాల్లో ఒకటిగా నిలిచింది. మరింత మంది పర్యాటకులను ఆకట్టుకునే దిశగా కేవలం గోల్ఫ్ కోర్స్ మాత్రమే కాకుండా ఇంకా తేలియాడే వివిధ రకాలైన నిర్మాణా లను కూడా సముద్రంపై చేపట్టేందుకు అక్కడి ప్రభుత్వం చర్యలు తీసుకుంటోంది. ఈ ఫ్లోటింగ్ గోల్ఫ్ కోర్స్‌కి మొత్తం 18 రంధ్రాలు ఉంటాయి. సముద్రగర్భంలో ఉండే వాటర్ టన్నెల్స్, ఈ గోల్ఫ్ కోర్స్ రంధ్రాలకి లింక్ చేసి ఉంటాయి. అంతేకాకుండా గోల్ఫ్ కోర్స్ కింద రెండు పెద్ద హోటల్స్ నిర్మిస్తున్నారు.

## ఫ్లోటింగ్ థియేటర్

థియేటర్లు ఎక్కువగా పెద్ద హాళ్లలోనే నాలుగు గోడల మధ్య ఏర్పాటు చేస్తారు. కొన్ని ఓపెన్ ఎయిర్ థియేటర్లు కూడా ఉంటాయి. అయితే అవన్నీ నగరాలు, పట్టణాలు వంటి జనావాసాల మధ్యే ఉంటాయి. కానీ మలేసియాలో మాత్రం ఓ థియే టర్ నదిలోని నీళ్లు, పర్వతాల మధ్య ఉంది. ఆ థియేటర్ పేరు ఆర్కిపెలాగో సినిమా. ఇది కూడా ఓపెన్ ఎయిర్ థియేటర్‌లాంటిదే. కాకపోతే నేలపై కాకుండా నీళ్ళపై ఉండడం విశేషం. మలేసియాలోని మలక్కా ప్రాంతంలో ట్రాంక్విల్ అనే ఒక చిన్న నది మధ్యలో ఈ థియేటర్ ఏర్పాటైంది. నీళ్ళ మధ్యలో, రెండు పర్వతాలకు దగ్గరగా పెద్దతెర ఉంటుంది. దానికి కొద్ది దూరంలో సీటింగ్, ఆ వెనకే ప్రొజెక్టర్ ఉంటుంది. కలపతో తీర్చిదిద్దిన తెప్పలపై, చుట్టూ వలలు ఏర్పాటు చేసి ఈ థియేటర్‌ను నిర్వహిస్తు న్నారు. 2012లో ప్రారంభమైన ఈ థియేటర్‌లో సినిమా చూడడం ప్రేక్షకులకు వినూత్న అను భూతిని అందిస్తుంది. జర్మన్‌కు చెందిన ఓలె షీరెన్ అనే ఆర్కిటెక్ట్ దీన్ని తీర్చిదిద్దాడు. ఇలా నీటిపై తేలి యాడే థియేటర్ ప్రపంచంలో ఇదొక్కటే.

## ఫ్లోటింగ్ విల్లా

దుబాయ్‌లో ఎత్తయిన భవంతి బుర్జ్ ఖలీఫా. ఇది ఇప్పటికే ప్రపంచ పర్యాటకులను విపరీతంగా ఆకర్షిస్తోంది. మరింతగా పర్యాటకులను ఆకర్షించ డానికి దుబాయ్ తన పర్యాటక రంగాన్ని అభివృద్ధి పరుస్తోంది. అందుకోసం దుబాయ్ తీర ప్రాంతంలో మానవ నిర్మిత దీవుల్లో తేలియాడే సీ హార్స్ విల్లా లను సిద్ధం చేస్తోంది. ఈ విల్లా ప్రత్యేకత ఏమిటి? అనుకుంటున్నారా? సాధారణ విల్లాల సంగతి అయితే మనకు తెలిసిందే. కానీ ఈ సీ హార్స్ విల్లాలు ఎలా ఉంటాయంటే ఎత్తైన భవంతిలోంచి బయటకు కని పించే సుందరమైన దృశ్యాలతో పాటు, గదిలోంచే సముద్ర అడుగు భాగంలోని అద్భుతమైన దృశ్యా లను వీక్షించవచ్చు. అంటే సముద్ర ఉపరితలంతో పాటు అంతర్భాగంలో కూడా గదులు ఉండటం 'ఫ్లోటింగ్ సీ హార్స్' విల్లాల ప్రత్యేకత. సముద్రం లోపల అనగానే, 'అమ్మో సముద్రం లోపలా? అంటే ఏదైనా ప్రమాదం ఉంటుందేమో?' అని భయపడుతున్నారా? అలాంటి భయాలేమీ ఉండవు. దృఢమైన అద్దాల సంరక్షణలో ఎలాంటి ప్రమాదం లేకుండా ఇంట్లోనే ఉన్న అనుభూతి కలుగుతుంది. లేటెస్ట్ టెక్నాలజీ పరికరాలు ఆ విల్లాలో ఉండ టంతో ఒక దీవిలో ఉన్నామనే ఆలో చనే దరికి రాదు. ఒక్కో విల్లా 4000 చదరపు అడుగుల వైశాల్యంలో నిర్మిస్తు న్నారు. హై స్పీడ్ ఇంటర్నెట్, శాటిలైట్ టీవీ, ఏసీ, స్విమ్మింగ్‌పూల్స్‌తో పాటు మరెన్నో సౌకర్యాలు ఫ్లోటింగ్ సీ హార్స్ ప్రత్యేకతలు. రిక్వెస్ట్ మీద పర్సనల్ చెఫ్‌ను కూడా పెట్టుకునే అవకాశం ఉంది. యూరోపియన్ ఆర్కిటెక్ట్‌లు వీటికి రూపకల్పన చేశారు. ఇప్పటికే నిర్మాణం దాదాపు పూర్తయింది. 2018 సంవత్సరాని కల్లా మొత్తం 125 'ఫ్లోటింగ్ సీ హార్స్' విల్లాలను దుబాయ్ తీర ప్రాంతాల్లో నిర్మించడానికి ప్రణా ళిక సిద్ధమైంది.

– విజేత














**'ఒక్కముక్క కూడా అర్థం కాలేదు మిచిషీకి, ఫ్యుజీశాన్ పేరుతప్ప. 'మీరు ఆ కుంగ్‌ఫూ వస్తాదును గురించి కలవరపడుతున్నట్టున్నారు. ఈ చుట్టుపట్ల ఎక్కడా లేడు. బురద నేలకు ఆవలిపక్కన ఉన్న సెటిల్మెంటు దగ్గరికి బయలుదేరాడు. నేను దిగబడిపోయినట్టు బురదలో దిగబడి గిలగిలా కొట్టుకుంటూ ఉండి ఉండవచ్చు' అన్నది.**

తల అడ్డం తిప్పాడు పొట్టిమనిషి జతగాడు. 'బురద నేలనే కాదు. సెగలుపొగలు వెలువరించే అగ్నిపర్వత ప్రాంతాలు కూడా అతన్ని ఏమీ చేయ లేవు. మహాశక్తిమంతుడు' అన్నాడు.

'మాటల్ని కట్టిపెట్టి అందరూ తిండి తినటానికి రండి. సమయం గడిచిపోతోంది' అంటూ మిచిషీ తల్లి చిన్నగా హెచ్చరించడంతో, అవతలి గదివైపు కదిలారు అందరూ.

'ఏం చేస్తూ ఉండి ఉంటాడు?' తనకంటే ముందుగా అక్కడికిపోయిన పోలీసుల మీద అరిచి కేకలు పెడుతూ ఉండి ఉంటాడంటావా?' తన స్నేహితుడి చెవి దగ్గర చిన్నగా గొణిగాడు పొట్టిమనిషి.

మెత్తటి కార్పెట్ మీద మూరెడెత్తు ఉండే చెక్క బల్లలను పెట్టి, అందమైన పింగాణీ పళ్ళేలలో వేడి వేడి ఆహార పదార్థాలను వడ్డించింది మిచిషీ తల్లి. 'వేగం గంగూ... గలగలా ప్రవహించే నీటిమీద గంతులు వేస్తూ వెళ్ళిపోయే చిల్లపెంకుల మాదిరి మహావేగంతో కదిలే మనిషిని బురద నేలలు అడ్డు కోలేవు. సెటిల్మెంటును చేరుకునే ఉంటాడు' తియ్యటి వాసనలు వెదజల్లుతున్న మొక్కజొన్న సూప్‌ని రుచి చూస్తూ పొట్టిమనిషికి చెప్పాడు అతని జతగాడు.

***

పళ్ళు పటపటమని కొరుకుతూ, తన పిడికిలిని విసిరాడు ఫ్యుజీశాన్. ఎదురుగా ఉన్న పోలీస్ అధికారి చెంపకు వెంట్రుక వాసి దూరంలోకి పోయి చటుక్కున ఆగిపోయిందా పిడికిలి.

తగిలి ఉంటే, బలమైన ఇనుప సమ్మెటతో బాదినట్టు ముక్కలు ముక్కలైపోయి ఉండేది దవడ ఎముక.

'సరైన కారణం లేకుండా సామాన్యుల మీద చెయ్యి చేసుకోకూడదన్న మా విద్యాపీఠపు నియమాలు ఈ రోజు మీకు ప్రాణదానం చేస్తున్నాయి. మర్యాదగా చెప్పండి ఇక్కడ జరిగింది ఏమిటో' గాలిలో ఆగిపోయిన తన పిడికిలిని కిందికి దించుతూ అన్నాడు.

'చెప్పటానికి ఇక్కడ జరిగింది ఏమీలేదు సారూ. కాళ్ళు కొట్టుకుంటూ రావటం ఒక్కటే జరిగింది. ఆ దుర్మార్గులు ఇటుగా వచ్చిన జాడలు కనిపించలేదు. విపరీతమైన ఆశ్చర్యంతో బొమ్మలా బిగుసుకుపోయిన తమ అధికారిని గబగబా వెనక్కి లాగుతూ వినయాతి వినయంగా చెప్పాడు రిటైర్మెంటుకు చాలా దగ్గరగా ఉన్న పోలీస్ కానిస్టేబుల్ ఒకతను.

'ఆ నీచులు ఇటుగా రాలేదని తెలిసిన తర్వాత వచ్చినదారినే వెనక్కిపోకుండా ఇక్కడే ఎందుకు ఉన్నారు?' బురద నీటిలో వేలాడటం వల్ల మలిన పడి, దుర్వాసన వెదజల్లుతున్న తన ఉత్తరీయాన్ని భుజం మీద సర్దుకుంటూ విసురుగా అడిగాడు ఫ్యుజీశాన్.

'వెయిట్ చేస్తున్నాము సారూ. వాళ్ళు రెండో కంటివాడికి తెలియకుండా పిల్లుల మాదిరి వచ్చి కూర్చుంటారేమోనని మాటు వేయటానికి నిశ్చయించుకున్నాము' మరోసారి చెప్పాడు ఆ కానిస్టేబుల్.

'మనం పాతికమందిమి ఉన్నాము. తను ఒక్కడే ఒక్కడు. ఎంతటి వస్తాదు అయినా మన దెబ్బకు తల్లక్రిందులు అయిపోవాల్సిందే. తనకి మర్యాద ఇచ్చి మాట్లాడవలసిన అవసరం మనకి లేదు' కచ్చగా అన్నాడు ఫ్యుజీశాన్ ఆగ్రహానికి గురైన అధికారి.

అతన్ని మాట్లాడవద్దని కనులతో సైగ చేస్తూనే ఉన్నాడు కానిస్టేబుల్. కాని ప్రయోజనం లేకపోయింది. ఫ్యుజీశాన్ చెవులకి చేరనే చేరాయి ఆ మాటలు.

'తల్లక్రిందులు చేయగలరా? కుంగ్‌ఫూ విద్యాపీఠానికి కాబోయే అధిపతి ఒంటిమీద మీరు చేతులు వేయగలమని అనుకుంటున్నారా? అయితే వేసి చూడండి' అంటూ బొంగరం మాదిరి గిర్రున తిరిగాడు మూడే మూడు రౌండ్లు.

బలమైన ఈదురుగాలి వీచినట్లు అయింది. కాళ్ళు నిలదొక్కుకోవడం చేతకాక ఎండుటాకుల మాదిరి ఎగిరి అవతలపడ్డారు పదిమంది పోలీసులు. వారి అధికారి, ఎవరో తనని పట్టుకుని పైకి తీసినట్లు గాలిలోకి లేచి ఆరు అడుగుల దూరంలో బుదుక్కున చతికిల పడ్డాడు.

అటువంటి పరిస్థితి ఎదురవుతుందని ముందుగానే అర్థం చేసుకున్నాడు కాబోలు, దగ్గర్లో ఉన్న ఒక బుటుకూ చెట్టు మొదల్ని గట్టిగా పట్టుకుని తల్లక్రిందులు అయిపోకుండా తట్టుకున్నాడు రిటైర్మెంటుకు దగ్గరగా ఉన్న కానిస్టేబుల్. తను ఒక్కడే కాదు తనతో పాటు మరో నలుగురు పోలీసుల్ని కూడా కాపాడాడు.

'ఇక్కడ ఉన్న వారందరిలోకీ నువ్వు ఒక్కడివే మా శక్తి ఎటువంటిదో బాగా తెలిసి ఉన్న మనిషి మాదిరిగా కనిపిస్తున్నావు. నువ్వు అయినా చెప్పు మాకు అవసరమైన విషయాన్ని' నడుము మీద చేతులు వేసుకుంటూ అతన్ని అడిగాడు ఫ్యుజీశాన్.

'బురదనేలలో అడుగుపెట్టనే పెట్టకూడదు. పెట్టినతర్వాత ఎవరైనా ప్రాణాలతో ఇవతలికి రావాలంటే ఈ సెటిల్మెంటుకి వచ్చి తీరవల

**జరిగిన కథ**

జపాన్‌లో, కుంగ్‌ఫూ విద్యాపీఠంలో చేరిన షాడో, ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు. అక్కడి నుంచి తన స్నేహితుడు గంగారాంతో కలిసి కాంటన్ సిటీ చేరుకుంటాడు. షాన్‌సూ భార్యను రక్షిస్తాడు. ఆ క్రమంలో హుహుశాన్ మనుషులతో గొడవపడతాడు. షాడోని వెతుకుతూ బయలుదేరిన మిచిషీ కారు ఊబిలో దిగబడుతుంది. తనను రక్షించిన షాడోని తన ఇంటికి తీసుకువెళుతుంది ఆమె. పోలీస్ లాకప్‌లో ఉన్న షాన్‌సూ ద్వారా కునీ ద్వీపం గురించి తెలుస్తుంది షాడోకి. ఆ తర్వాత...



సిందే. ఇటుగా కాకుండా వేరే దిశకు పోతే మాత్రం ప్రాణాలు పోగొట్టుకోవటం తప్పనిసరి' ఆ ఏరియా గురించి తనకు తెలిసిన విషయాన్ని దాపరికం లేకుండా చెప్పాడు అతను.

'అది నీ వంటి సామాన్యులకు పట్టే గతి. కుంగ్‌ఫూ విద్య గురించి తెలిసినవారికి, ఆ విద్యలో ఎంతోకొంత ప్రవేశం ఉన్నవారికి అసాధ్యం కాదు. నాకు కావాల్సిన దుర్మార్గులకి కూడా తెలుసును ఆ సంగతి' అంటున్న ఫ్యుజీశాన్‌కి వెంటనే వచ్చింది అనుమానం.

'మీరు... మీరందరూ ఎలా రాగలిగారు ఇక్కడికి? మీరెవరూ బురదలో చిక్కుపడి ప్రాణాలు పోగొట్టుకోలేదు..' అని అడిగాడు.

తన పాదాలకున్న పోలీస్‌బూట్లను వెంటనే వదిలి, రెండు చేతుల్ని కలిపి మరింత వినయంగా వందనం చేశాడు ఆ కానిస్టేబుల్.

'ఆర్యులు నా బుద్ధిహీనతను మన్నిస్తారనే ఆశిస్తున్నాను. పోలీసు ఉద్యోగంలో చేరక ముందు కొంతకాలం నేను ఆ పవిత్రమైన విద్యను అభ్యసించాను' అన్నాడు.

తను వచ్చిన పని పూర్తికాలేదన్న కచ్చతో రగులుకుపోతున్న ఫ్యుజీశాన్ పెదవులమీద ప్రత్యక్షమైంది చిన్న మందహాసం.

'అందరూ అనాగరికులే ఉంటారని అనుకుంటున్న ప్రదేశంలో ఎంతో కొంత ఇంగితజ్ఞానం ఉన్న మనిషి కనిపించటం నాకు సంతోషాన్ని కలిగిస్తోంది. ప్రాణాంతకమైన ఈ బురదనేల మధ్యలో ఎందుకు నివసిస్తున్నారు ఈ బుద్ధిహీనులు?' గుడిసెల వంటి చిన్నచిన్న కట్టడాల చాటున నిలబడి తన వంకా, పోలీసుల వంకా భయం భయంగా చూస్తున్న ఆ సెటిల్మెంట్ పౌరుల్ని గమనించుకుంటూ అడిగాడు.

'మింగ్ చక్రవర్తుల కాలంలో మహామహా యుద్ధాలు జరిగిన చోటు ఇది. సైన్యాలకు సైన్యాలు సర్వనాశనం అయిన మహాశ్మశానం. ఆ రోజుల నాటి సంపద ఏదైనా లభిస్తుందేమోనన్న ఆశతో నగరాన్ని వదలి వచ్చిన వాళ్ళు వీళ్ళు. బురదలో చేతులుపెట్టి వెతుకులాడటమే వారి వృత్తి' చెప్పాడు కానిస్టేబుల్.

'శహభాష్... శహభాష్... సరయిన మాటని నువ్వు సరైన సమయంలో చెప్పావు. మా విద్యాపీఠానికి ద్రోహం చేసి పారిపోయి వచ్చిన నీచుడు కేవలం సంపదకోసమే దొంగతనాలు చేస్తూ పొట్టపోసుకుంటూ ఉంటాడు. ఇక్కడ బురదను కెలికితే సంపద లభిస్తుందని తెలిసే ఉంటుంది. అందుకే ఇటుగా బయలుదేరి ఉంటాడు' అంటూ క్రిందికి జారిపోతున్న ఉత్తరీయాన్ని సరిచేసుకుంటూ ముందుకు అడుగు వేశాడు.

'సారు మమ్మల్ని మా డ్యూటీలు చేసుకోమని సెలవా?' అడిగాడు ఆ కానిస్టేబుల్.

వెక్కిరింపుగా నవ్వాడు ఫ్యుజీశాన్. 'రాతినేల మీద అడుగుజాడల్ని కనిపెట్టగల మాకే పసికట్టడం అసాధ్యం అవుతున్న పనిని, అధికారమదంతో అవాకులు చెవాకులు పేలే మీకు సుసాధ్యం అవుతుందన్న నమ్మకం నాకు లేదు. అయినా వినయంగా అర్థించావు కాబట్టి అంగీకరిస్తున్నాను. మీ కర్తవ్యాన్ని మీరు నిర్వహించుకోవచ్చు' అంటూ వంద అడుగుల దూరంలో, పాతిక అడుగుల ఎత్తుకు ఎదిగి ఉన్న ఒక అబుటో వృక్షం క్రిందికి పోయి, అక్కడ ఉన్న ఒక బండరాయి మీద పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు.

'ఒక్క బుల్లెట్... ఒకే ఒక్క బుల్లెట్ చాలు వీడి పొగరు అణగిపోవటానికి' పళ్ళు బిగించుతూ కామెంట్ చేశాడు ఫ్యుజీశాన్ ఆగ్రహానికి గురైన అధికారి.

'అనవసరమైన మాట సార్ అది. వచ్చిన పనిని చూసుకోవడం మీకు, నాకు, మనందరికీ చాలా మంచిది' ముక్తసరిగా చెప్పాడు కానిస్టేబుల్.



బయటికి కనిపించకుండా గుడిసెల చాటున మాటువేయండి. కంటపడిన మరుక్షణం మీద పడి కాళ్ళు చేతులు కట్టివేయండి' ఆజ్ఞ ఇచ్చాడు ఆ అధికారి.

అబుటో వృక్షం క్రింద కూర్చుని ఉన్న పర్సనాలిటీ వైపు ఓరచూపులు చూస్తూ తలా ఒక పక్కకు వెళ్ళిపోయారు కానిస్టేబుల్స్ అందరూ.

తన అధికారిని, పొడిపొడిగా ఉన్న ఒక ప్రదేశంలో నిలబెట్టి, తను ఇంకో పక్కకు బయలుదేరబోతున్న కానిస్టేబుల్‌కి చిన్నగా వినిపించింది భయంకరమైన బాధను అనుభవిస్తున్నట్టు ఒక మూలుగు.

ముందుకుపోయే ఆలోచనను వెంటనే విరమించుకుని, ఆ శబ్దం వినవస్తున్న గుడిసెలోకి తొంగి చూడబోయాడు అతను.

వెంటనే అతని పక్కన ప్రత్యక్షమయ్యాడు ఆ సెటిల్మెంట్ అంతటికీ నాయకుడి మాదిరి వ్యవహరించే పౌరుడు ఒకతను.

'వద్దు సార్.. చూడవద్దు... తట్టుకోలేరు' అంటూ వారించబోయాడు.

వినిపించుకోలేదు కానిస్టేబుల్. అతన్ని అవతలికి నెట్టి తొంగి చూశాడు. చూసిన మరుక్షణం చెమటలు ప్రత్యక్షం అయ్యాయి అతని ముఖం మీద. ఒంటికి సరిపడని పదార్థం ఏదో నోటిలో పెట్టుకున్నట్టు, చేదుగా తయారయింది నోరు.

చినుగులు పడిన ఒక చాపమీద అడ్డదిడ్డంగా పడుకుని ఉన్నాడు ఒక వృద్ధుడు. భగభగ మండుతున్న నిప్పులగుండంలో పడినట్లు తల దగ్గర్నించి పాదాల వరకు మాడిపోయి ఉంది అతని శరీరం.

'నెలరోజుల క్రితం ఉన్నట్టుండి ప్రత్యక్షమయ్యాడు. బురదలో నడుస్తున్నప్పుడు ఏదో విషపు పురుగు ముట్టుకున్నట్టుంది. మేము చూస్తుండగానే ఇలా తయారైపోయాడు' వెనుక నుంచి కానిస్టేబుల్ భుజాలమీద నుంచి తనుకూడా లోపలికి చూస్తూ చెప్పాడు ఆ సెటిల్మెంట్ నాయకుడు.

'పేరేమిటి? ఎక్కడినుంచి వచ్చాడు?' పొడిగా తయారైన పెదవుల్ని నాలుకతో తడి చేసుకుంటూ అడిగాడు కానిస్టేబుల్.

'ఏదో మాట్లాడాడు. మాకు ఎవరికీ అర్థం కాలేదు' అంటూ ఆ మనిషి తల దగ్గర ఉన్న ఒక చిన్న మూటను చూపించాడు నాయకుడు.

గుడిసెలోకి పోయాడు కానిస్టేబుల్. వణుకుతున్న చేతుల్ని జాచి ఆ మూటను అందుకున్నాడు.

తన గోలలో తనున్నాడు ఆ మనిషి. అభ్యంతరం చెప్పలేదు సరికదా, అతనివైపు చూస్తూ, గద్గదస్వరంతో ఏదో చెప్పాడు.

తమ దేశంలో ఉన్న నాలుగైదు రకాల భాషల్ని అర్థం చేసుకోగల శక్తి ఉంది కానిస్టేబుల్‌కి. అయినా

**చాప మీద అడ్డదిడ్డంగా పడివున్నాడా వృద్ధుడు. బాధతో గగ్గోలు పెడుతున్నాడు. అతని శరీరం తల దగ్గర్నించీ పాదాల వరకూ నల్లగా మాడిపోయి ఉంది. ఏదో మాట్లాడుతున్నాడు. కానీ ఆ భాషేమిటో ఎవరికీ అర్థం కావటం లేదు. ఎవరికోసమో అతని కళ్ళు ఆత్రంగా ఎదురు చూస్తున్నాయి. ఇంతకీ అతనెవరు? ఎక్కడివాడు?**

సరే అతను మాట్లాడింది ఏమిటో తెలుసుకోవటం అసాధ్యం అయింది.

కంపిస్తున్న చేతులతోనే మూటను విప్పి అందులో ఏముందో చూసిన అతనికి వెంటనే తగిలింది మరో షాకు.

నాణేలు ఉన్నాయి మూటలో. వెండి, బంగారంతో చేయబడినవి మాత్రం కాదు. అడవి జంతువుల్ని వధించి, వాటి ఎముకల్ని నున్నగా బండలమీద రుద్ది తయారు చేయబడినట్టు మిలమిల మెరిసిపోతున్నాయి.

'అర్థం అయిందా? అవి ఏమిటో తెలిసిందా? అతను ఎవరో ఎక్కడినుంచి వచ్చాడో చెప్పగలరా?' ఆత్రుతగా అడిగాడు సెటిల్మెంట్ నాయకుడు.

తల అడ్డం తిప్పాడు కానిస్టేబుల్. అయితే అక్కడితో ఆగలేదు. ఆ మూటను అలాగే ముడిచి పట్టుకుని, సెటిల్మెంట్ మధ్యభాగంలో ఉన్న అబుటో వృక్షం దగ్గరికి పరుగు తీశాడు.

నిమీలిత నేత్రాలతో జేగురురాతిలో మలిచిన మహాశిల్పం మాదిరి కూర్చుని ఉన్నాడు ఫ్యుజీశాన్. చటుక్కున కనులు తెరిచి చూశాడు.

తలవంచి అభివాదం చేస్తూ, తాను తీసుకువచ్చిన మూటను అతని ముందు పెట్టాడు కానిస్టేబుల్. అందులోని ఎముకల నాణేల్ని చూపించాడు. విపరీతమైన ఆశ్చర్యంతో వెడల్పు అయ్యాయి ఫ్యుజీశాన్ నయనాలు.

ఏడు, ఎనిమిది వందల సంవత్సరాల క్రితం మహాసముద్రం మధ్యభాగంలో ఒక వెలుగు వెలిగిన డూడూ సామ్రాజ్యపు నాణేలు ఇవి. ఎక్కడో ఉండవలసినవి ఈ భూభాగం మీదికి ఎలావచ్చాయి. ఎప్పుడో సముద్రంలోని అల్లకల్లోలాలకి గురై నాశనం అయిపోయిన ఆ సామ్రాజ్యపు అవశేషాలు తిరిగి ఇప్పుడు బయల్పడడం ఎందుకు జరిగింది?' అంటూ చటుక్కున లేచి నిలుచున్నాడు.

'చూపించు... ఈ నాణేల్ని తీసుకువచ్చిన వ్యక్తిని నాకు చూపించు' అని ఆదేశించాడు.

పరాయి మనిషి వచ్చి తన దగ్గర ఉన్న మూటని అవతలికి తీసుకుపోయినా, పిసరంత కూడా చలించని గుడిసెలోని అభాగ్యుడు, ఒక్కసారిగా తన దగ్గరికి వచ్చిన పర్సనాలిటీని చూసి గొల్లుమన్నాడు. ఓపిక లేకపోయినా, చాపమీది నుంచి లేచి ఫ్యుజీశాన్ ముందు మోకరిల్లాడు.

'నా ఊహ నిజమే అయింది. ఇతను డూడూ సామ్రాజ్యపు మనిషి. సందేహం లేదు' అంటూ అతన్ని పైకి లేవమన్నట్టు చేయి ఊపాడు ఫ్యుజీశాన్.

మోకాళ్ళమీద కూర్చున్నాడు ఆ మనిషి. కానిస్టేబుల్‌కి అర్థంకాని భాషలో పదేపదే చెప్పటం మొదలు పెట్టాడు.

'తరతరాల క్రితం డూడూ సామ్రాజ్యానికి మా విద్యాపీఠానికి ఒక ఒప్పందం ఉండేదని మా గురువులు చెపుతూ ఉండేవారు. ఆ సామ్రాజ్యంలోని ప్రజలకు ఎప్పుడు ఎటువంటి కష్టం వచ్చినా వెంటనే వెళ్ళి ఆదుకోవటం ఆ ఒప్పందం సారాంశం..' తన వెనుక నిలబడిన కానిస్టేబుల్‌కి చెప్పాడు ఫ్యుజీశాన్.

తమకు ఇష్టం లేకపోయినా, తమ మధ్యకు వచ్చి, తన అహంకారపూరిత ప్రవర్తనతో అందరినీ అవమానిస్తున్న ఆ పెద్దమనిషి, తమను వదిలిపెట్టి అవతలికి వెళ్ళిపోయే అవకాశం ఉన్నట్టు అనిపించి, ఎంతగానో సంతోషించాడు కానిస్టేబుల్ మనసులోనే.

కుంగ్‌ఫూ విద్యాపీఠం ఆరంభం అయిన నాటి నుంచీ ఎంతోమంది ఎన్నెన్నో ఒప్పందాలు చేసుకున్నారు ఆ వస్తాదులతో. తమను ఆదుకున్నందుకు కృతజ్ఞతాసూచకంగా అంతులేని సంపదల్ని కానుకలుగా ఇచ్చారు.

అదే క్రమంలో వచ్చినట్లున్నాడు ఈ అభాగ్యుడు, తాము ఉపయోగించే విచిత్రమైన ఎముకల నాణేల్ని వెంటబెట్టుకుని.

మోకాళ్ళ మీద కూర్చుని ఊపిరి కూడా తీసుకోకుండా అదేపనిగా మాట్లాడుతున్న ఆ మనిషి, ఉన్నట్లుండి మాటల్ని ఆపేశాడు. చేతులు రెండింటినీ నుదుటికి ఆనించుకుని నమస్కారం చేస్తూ ముందుకు పడిపోయాడు.

నల్లగా మాడిపోయి ఉన్న అతని శరీరాన్ని ముట్టుకోవడం తనకు ఇష్టం లేదన్నట్టు, వెంటనే వెనక్కి జరిగి నిలబడ్డాడు ఫ్యుజీశాన్.

'మూర్ఖుడు. ఏమైపోయిందో తెలియని సామ్రాజ్యం. ఏనాడో వెనుకాముందూ చూసుకోకుండా చేసుకున్న



ఒప్పందం. ఎందుకూ పనికిరాని ఈ ఎముకల గుట్టని తెచ్చి ముఖం మీద కొడితే, పెంపుడు జంతువుల మాదిరి తోకలు ఊపుకుంటూ బయలుదేరతామని అనుకుంటున్నాడు' విపరీతమైన అసహ్యంతో పెదవులు విరుస్తూ చెప్పాడు కానిస్టేబుల్‌తో.

'అయ్యా... పెద్దలు... సర్వజ్ఞులు... ఒప్పందం అన్న తర్వాత ఎముకలు ఇచ్చినా, నెత్తిమీది వెంట్రుకల్ని చూపించినా మనం ఒప్పుకు తీరాలి కదా' వద్దు వద్దని అనుకుంటూనే సన్నగా తన అభిప్రాయాన్ని వెల్లడించకుండా ఉండలేకపోయాడు కానిస్టేబుల్.

'వాడికంటే వెయ్యి రెట్లు మూర్ఖుడివి నువ్వు. మమ్మల్ని అవమానించటం ద్వారా మా విద్యా పీఠాన్ని కూడా వెక్కిరించిన దుర్మార్గుల్ని పట్టుకుని బుద్ధిచెప్పటం కంటే గొప్పది కాదు ఈ ఒప్పందం' అంటూ గుడిసెలో నుంచి బయటికి వెళ్ళిపోయాడు ఫ్యుజీశాన్. తను తీసుకువచ్చిన నాణేల మూటను క్రిందికి వదిలి మరీ పోయాడు.

'మాసం రోజుల నుంచీ నరకయాతన అనుభవిస్తున్న ఈ మానవుడు ప్రాణాలు వదిలేశాడు. బాధ అంటే ఎలా ఉంటుందో తెలియని లోకంలోకి వెళ్ళిపోయాడు' ఫ్యుజీశాన్ దూరంగా వెళ్ళిపోయాడని నిశ్చయం అయిన తర్వాత గుడిసెలోకి వస్తూ కానిస్టేబుల్‌కి చెప్పాడు సెటిల్మెంటు నాయకుడు.

తన యూనిఫామ్ జేబులోనుంచి మూడు కరెన్సీ నోట్లను తీసి అతనికి అందించాడు కానిస్టేబుల్. 'అయినవాళ్ళు దగ్గరుండి కర్మకాండలు జరిపించడం సాంప్రదాయం. ముక్కు మొకం తెలియని ఈ అభాగ్యుడికి ఆ అదృష్టం లేదు. ఇన్నిరోజులు ఇతన్ని కనిపెట్టుకు ఉండిన మీరే ఇతనికి ఆత్మబంధువులు. మీ చేతుల మీదుగానే మట్టి చేయండి. పుణ్యం వస్తుంది' అంటూ ఫ్యుజీశాన్ క్రిందికి వదిలిన మూటను చేతుల్లోకి తీసుకున్నాడు.

'దాన్ని మీరు తీసుకుపోండి సారూ... మాకు ఏ విధంగాను ఉపయోగపడకపోగా, ముట్టుకోకూడని ఎముకల్ని దగ్గర పెట్టుకోవడం శుభసూచకం కాదని మా వాళ్ళు గొడవ చేస్తారు' అన్నాడు సెటిల్మెంట్ నాయకుడు.

మూటను గట్టిగా ముడివేసి తను తీసుకున్నాడు కానిస్టేబుల్. బోర్లాపడిపోయి ఉన్న అపరిచిత వ్యక్తి వైపు సానుభూతిగా చూస్తూ గుడిసెలో నుంచి బయటికి వచ్చేశాడు.

***

'నాకు తెలుసు. ఇది కూడా హుహుశాన్‌కి సంబంధించిన వ్యాపారమే అయి ఉంటుంది. మనం నోరు విప్పిన మరుక్షణం రట్టు అయిపోతుంది మన గుట్టు.' కాంటన్ సెంట్రల్ పార్క్‌కి దక్షిణంగా ఉన్న ఒక పెద్ద నగల దుకాణం దగ్గర నిలబడి చిన్న కంఠంతో షాడోకి చెప్పాడు గంగారాం.

'ఎగస్త్రాలు చేయకుండా వచ్చినపని మీద దృష్టి పెడితే చిటికెలో అయిపోతుంది పని. ఎవరికీ అనుమానం రాదు' తను కూడా చిన్నకంఠంతోనే చెప్పింది మిచిషీ.

ఆమెను ఇంటి దగ్గరే వదిలి, తాము మాత్రమే బయలుదేరటానికి ప్రయత్నించారు వారిద్దరు. ససేమిరా ఒప్పుకోలేదు ఆమె.

'మీ గురించి మా డిపార్ట్‌మెంట్ చాలా సీరియస్‌గా ఆలోచిస్తోంది' అంటూ తన వెహికల్‌లోనే వారిని అక్కడికి తీసుకువచ్చింది.

'మీ డిపార్ట్‌మెంట్ అని చెప్పబోకు తల్లీ. మీ హుహుశాన్ సారు ఆలోచిస్తున్నాడని చెప్పు... ఆయనగారికి కడుపులో నొప్పివస్తే, ఏడ్చి రాగాలు తీసేది ఆయన కాదు, మీరు' వెక్కిరిస్తూ ముందుకు కదిలాడు గంగారాం.

ఎటువంటి మాటకైనా చిటుకుచిటుకు ఎదురు సమాధానం చెప్పే అతని అలవాటును గురించి ఆలోచిస్తూ అతన్ని అనుసరించింది మిచిషీ.

రాజభవనం మాదిరిగానే ఉన్నది ఆ నగల దుకాణపు లోపలి భాగం. తన యూనిఫామ్‌ని వదిలేసి, అందమైన సిల్కు వస్త్రాల్ని ధరించినా కూడా మిచిషీని గుర్తు పట్టేశారు దుకాణంలో ఉన్న వారందరూ.

'మీరు రావడం దేనికి మేడమ్... కబురుపెడితే, మీకు కావాల్సిన నగలతో మేమే మీ దగ్గరికి వచ్చి ఉండేవాళ్ళం' సాదరంగా ఆహ్వానం పలుకుతూ, వినయాతి వినయంగా మాట్లాడటం మొదలుపెట్టారు.

'నా గొప్పతనం కాదు ఇది. నన్ను హుహుశాన్ పిలిపించి మర్యాదగా మాట్లాడి పంపించడం వల్ల, నేను ఆయనకి బాగా కావాల్సిన మనిషినని అనుకుంటున్నారు' గంగారాం చెవిలో గుసగుసలాడింది ఆమె.

'అప్పచెప్పిన పనిని ఆయనకి వ్యతిరేకంగా చేస్తున్నావని తెలిస్తే మటుమాయం అయిపోతుంది ఈ గౌరవం' అంటూ తను తీసుకువచ్చిన మూటను ఒక కౌంటర్ మీద పడవేశాడు గంగారాం.

అందులోని సంపదను చూసేసరికి చెమటలు పట్టేశాయి కాబోలు, ఆ దుకాణం యజమానిని వెంటనే పిలిపించాడు అక్కడ ఉన్న సేల్స్‌పర్సన్.

'హుహుశాన్ సారు అప్పచెప్పిన పనిని పూర్తి చేయటానికి మేడమ్ బురద నేలలోకి పోయి మెడలోతు ఊబిలో దిగబడిపోయారు. ఆ సమయంలో ఆమె పాదాలకు తగిలిన వస్తువులు ఇవి..' అంటూ ఆ వస్తువుల గురించి చెప్పాడు గంగారాం.

మిచిషీ అధికారం కంటే హుహుశాన్ పేరు లక్ష రెట్లు బలమైనదని వెంటనే తేలిపోయింది మరోసారి.

'మేడమ్... పన్నెండు లక్షలు... వాటి విలువ నికరంగా పన్నెండు లక్షలు ఉంటుంది. పురాతనమైనటువంటివి కాబట్టి నాలుగు తగ్గించి ఎనిమిది ఇవ్వటం జరుగుతుంది' అరగంట పాటు తర్జనభర్జనలు పడి ఆఖరికి చెప్పాడు దుకాణం యజమాని.

వెంటనే అంగీకరిస్తే బాగుండదని చెప్పి, రెండు నిమిషాలు ఆలోచించినట్లు తల ఊపి, ఒప్పుకున్నాడు గంగారాం. షాపు యజమాని అందించిన కరెన్సీ నోట్లకట్టల్ని, తాను తీసుకువచ్చిన వస్త్రంలోనే మూట కట్టి, మరొక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా బయటికి దారి తీశాడు.

'వచ్చిన పని దిగ్విజయంగా నెరవేరింది. షాన్‌సూ భార్య, ఆమె బిడ్డ హాయిగా ఆనందంగా జీవితం

## కోటి కాదనుకుంది

తాము చేయదలుచుకున్న పాత్రల గురించి, సినిమాల ఎంపికలో తాము పాటించే విలువల గురించి చాలామంది హీరోయిన్లు బోలెడన్ని కబుర్లు చెబుతుంటారు. కానీ ఆచరణలో వచ్చేసరికి అవేవీ వారికి గుర్తుండవు. కానీ సాయిపల్లవి అలా కాదు. ఆ విషయాన్ని మాటల ద్వారా కాకుండా తన చేతల ద్వారా చేసి చూపుతోంది. 'ఫిదా' తరువాత ఆమెకు వచ్చిన క్రేజ్‌ని క్యాష్ చేసుకోవడానికి చాలా మంది దర్శక నిర్మాతలు ఆమె ఇంటి ముందు క్యూ కట్టారట! తమ సినిమాలో నటిస్తే అడ్వాన్స్‌గా కోటిరూపాయలు ఇవ్వడానికి కూడా వెనుకాడ లేదట! అంత మొత్తం ఆశ చూపినా సాయిపల్లవి మాత్రం 'నో' చెప్పిందట! క్యాష్ కన్నా క్యారెక్టర్లే తనకు ముఖ్యమని చెప్పడమే కాకుండా చేతల్లో చేసి చూపించిందని సినీ జనాలు అంటున్నారు. సాయిపల్లవి నటనకి ప్రేక్షకులే కాదు స్టార్ హీరోయిన్లు కూడా ఫిదా అయిపోతున్నారట! సాయిపల్లవి ఉంటే సినిమా నిరభ్యంతరంగా చూడొచ్చంటూ సమంత చేసిన ట్వీట్ ఇప్పుడు సంచలనాన్ని కలిగిస్తోంది.

గడపవచ్చు' సంతోషంగా చెప్పింది మిచిషీ.

వాళ్ళు సంతోషపడే మాటని గురించి తర్వాత మాట్లాడుకుందాము. ముందు నువ్వు సంతోషంగా ఇంటికి తిరిగి వెళ్ళగలవేమో చూసుకో' అప్పటివరకూ మౌనంగా ఉన్న షాడో వెంటనే అన్నాడు.

బర్రుబర్రుమని మోతలు చేస్తూ మూడు మోటార్ వెహికల్స్ అటుకేసి దూసుకు వస్తూ ఉండటమే అందుకు కారణం.

'వెళ్ళిపోండి... మీరిద్దరూ ముందు అర్జంటుగా అవతలికి పారిపోండి' అంటూ వారికి దూరంగా జరిగింది మిచిషీ. క్షణం కూడా ఆలస్యం చేయలేదు గంగారాం. డబ్బుల మూటను గట్టిగా పట్టుకుని, దగ్గర్లో కనిపించిన ఒక సందులోకి పరిగెత్తాడు. వందగజాల దూరం వెళ్ళిన తర్వాతగాని, అతనికి తెలిసిరాలేదు. తన వెనకే వస్తూ ఉండవలసిన తన గురువుగారు ఆ పని చేయటం లేదని.

'నాకు చెప్పకుండా నువ్వు కొత్తకొత్త ఆలోచనలు చేయటం బాగా ప్రాక్టీస్ చేస్తున్నావు. ఇప్పుడు ఏదైనా జరిగి నీకేమైనా అయితే నా పని రామగోవిందం




కొట్టేస్తుంది' తనలో తను అనుకుంటూ వెనక్కి పరుగెత్తుకు వచ్చాడు.

నగల దుకాణం దగ్గర కనిపించిన దృశ్యాన్ని చూసేసరికి మతిపోయినంత పని కాలేదు గానీ, అమితమైన కోపం ముంచుకు వచ్చేసింది.

'చెప్పేవాళ్ళు లేకపోవటం వల్ల కాబోలు నీకు ఈ మధ్య పిడికిళ్ళు మహా దురద పెట్టేస్తున్నాయి. ఎవరిమీదకైనా చిటికెలో పోయి కలబడటం బాగా ప్రాక్టీస్ చేస్తున్నట్లున్నావు' అంటూ తాను కూడా ఇంకా ఇంకా ముందుకు పరిగెత్తాడు.

బర్రుబర్రుమంటూ వచ్చి ఆగిన వెహికల్స్‌లో నుంచి దిగి మిచిషీ దగ్గరికి రాబోయిన హుహుశాన్ జనం మీద వీరభద్రుడి మాదిరి చెలరేగిపోతున్నాడు షాడో.

'చంపేస్తాను. నరికేస్తాను. పొడిచేస్తాను' అని కేకలు కూడా పెడుతున్నాడు.

ఎప్పుడు చూసినా తన పిడికిళ్ళకు పని కల్పించే టప్పుడు నిశ్శబ్దంగా ఆ పని ముగించే తన గురువు గారు ఇప్పుడు పిచ్చిపట్టినవాడి మాదిరి గొంతు చించుకోవటం దేనికో వెంటనే తెలిసిపోయింది గంగారాంకి.

తెలిసిపోయిన తర్వాత ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయలేదు అతను. బాణం మాదిరి ఫుట్‌పాత్ మీద నిలబడి ఉన్న మిచిషీ దగ్గరికి పోయాడు.

డబ్బుల మూటను అతి జాగ్రత్తగా క్రింద పెట్టాడు.

'పారిపొమ్మని చెపితే పిచ్చా మీకు? ఎందుకు వాళ్ళతో తలపడటం?' తను చెప్పినట్టు జరగటం లేదన్న కచ్చతో కోపంగా అన్నది ఆమె.

'నువ్వు ఒక పిచ్చిదానివి... నీకు పోలీస్ ఉద్యోగం ఎవరిచ్చారో నాకైతే అర్థం కావటం లేదు' అన్నాడు గంగారాం.

అధికం అయిపోయింది మిచిషీ ఆగ్రహం. పళ్ళు బిగించి అతని చెంపమీద బలంగా ఒక దెబ్బ వేసింది. వేశానని అనుకున్నది ఆమె. కాని చేయి అతని చెంపను తాకకముందే మహావేగంగా కదిలింది అతని ఎడమచేయి.

పొట్టిగా, లావుగా, పిచ్చివాడి మాదిరి కనిపించే అతని కదలికలు చాలా నెమ్మదిగా ఉంటాయని, తనను అడ్డుకోవటం అతనికి అసాధ్యమని అనుకుంటున్న ఆమె అంచనాలు తారుమారైపోయాయి.

అతని చెంపను తాకవలసిన చెయ్యి మధ్యలోనే ఆగిపోయింది. అందమైన ఆమె మెడ చుట్టూ బిగుసుకున్నది అతని కుడిచెయ్యి.

'ఆగిపోండి... అవతలికి వెళ్ళిపోండి. కాదు కూడదని గలాటాని కంటిన్యూ చేస్తే ఈమె ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి. గొంతుపిసికి చంపిపారేస్తా' గంగాళం లాంటి నోటిని తెరిచి అరిచాడు.

అదిరిపడి చూశారు షాడోని కమ్ముకుంటున్న హీరోలు అందరూ. తమకు తెలియకుండానే వెనక్కి జరిగి నిలుచున్నారు.

'పడేయండి. మీ ఆయుధాలన్నిటినీ కింద పడేయండి' మరో అరుపు అరిచాడు గంగారాం.

ఖంగుఖంగుమని శబ్దం చేశాయి క్రిందికి వదలబడిన ఐరన్‌రాడ్లు. వాటి మీద పడ్డాయి పట్టెడు లావున్న వెదురుకర్రలు... ఆ తర్వాత నేలను తాకాయి పదునైన చురకత్తులు.

'వచ్చేయ్ గురూ... వెనక్కివచ్చేయ్' పిడికిళ్ళను తన ప్యాంటుకేసి రుద్దుకుంటున్న షాడోని హెచ్చరించాడు గంగారాం.

'ఈ అమ్మడితో మనకు అవసరం తీరిపోయింది. మన దారిన మనం వెళ్ళిపోవచ్చు' అని కూడా అన్నాడు.

మూడు అంగల్లో అతని దగ్గరికి వచ్చాడు షాడో.

'నిన్ను మేము అతి బలవంతంగా పట్టుకుని ఇక్కడికి తీసుకువచ్చామని చెప్పుకో' మిచిషీకి మాత్రమే వినబడేటట్టు చెప్పి క్రింద పెట్టిన మూటను తీసుకోమని షాడోకి సైగ చేశాడు గంగారాం.

నిస్సహాయంగా నిలబడిపోయినట్లు ముఖం పెట్టిన మిచిషీని ముందుకునెట్టి పరుగు మొదలుపెట్టాడు.

క్రిందికి వదిలిన తమ ఆయుధాల్ని తిరిగి చేతుల్లోకి తీసుకుని హుహుశాన్ అనుచరులు తమను వెంటాడటం మొదలుపెట్టే సమయానికి, చాలా దూరం వెళ్ళి, హడావుడిగా తిరుగుతున్న జనంలో కలిసిపోయారు వారిద్దరూ.

***

'అనుభవం కలిగిన పోలీస్ ఆఫీసర్‌వి అనుకున్నాను. కేవలం ఎందుకూ పనికిరాని ఒక ఆడదాని మాదిరిగా ప్రవర్తిస్తావని అనుకోలేదు' గుర్రుగా చూస్తూ మిచిషీతో అన్నాడు హుహుశాన్, సరిగ్గా ఒక గంట తరువాత.

నగల దుకాణం దగ్గర ఉండగానే తన ప్రధాన అనుచరుడిని పంపి ఆమెను తన దగ్గరికి పిలిపించాడు అతను.

బురద నేలలో తనకు జరిగిన ప్రమాదాన్ని గురించి వివరంగా చెప్పింది మిచిషీ. ఆ సమయంలో తనను రక్షించినట్లే నటించి, ఆ ఆగంతకులు తనను ఎలా ఉపయోగించుకున్నారో వివరించింది.

'నన్నే కాదు. నా తల్లిని కూడా చంపిపారేస్తామని బెదిరించారు. ఆ సంగతి మీకు తెలియటం కోసమే వారికి సహాయం చేస్తున్నట్టు నటించి మీ దుకాణం దగ్గరికి తీసుకు వచ్చాను' అని కూడా చెప్పింది.

తనకు కావాల్సిన ఆ ఆగంతకులకు, ఆమె సహాయం చేస్తున్నదని అనుకుంటున్నందుకు కొంచెం కూడా చింతించలేదు హుహుశాన్.

'జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు వాళ్ళు ఎటువైపు పోయి ఉంటారని నీ ఉద్దేశం?' అడిగాడు.

ఇరుకుసందులోకి పారిపోయి, ఆ తర్వాత మెయిన్‌రోడ్డు మీద హడావుడిగా తిరుగుతూ ఉండే జనంతో కలిసిపోయిన ఆగంతకులు, అటుతిరిగి, ఇటుతిరిగి తన ఇంటికే చేరుకుంటారని బయటపెట్టలేదు మిచిషీ. 'బురద నేలలో దొరికిన సంపదకు చాలా డబ్బు వచ్చింది. నాకు చెందవలసిన ఆ మొత్తం వాళ్ళ దగ్గరే ఉండిపోయింది. ఖర్చులకు ఎటువంటి ఇబ్బందీ పడవలసిన అవసరం లేదు' అన్నది.

కాంటన్ నగరాన్ని వదిలి వాళ్ళు ఇంకో సిటీ వైపు వెళ్ళిపోయి ఉంటారన్న అనుమానాన్ని అతనికి కల్పించటం ఆమె ధ్యేయం.

**(ఇంకావుంది)**

# సురభి

## ఫీల్డ్ ఆఫ్ కార్న్

మొక్కజొన్నకంకులు... అక్కడ ఎటుచూసినా అవే దర్శనమిస్తాయి. మనిషి మహాఅయితే ఆరు అడుగులు ఉంటాడు. కానీ అవి మాత్రం ఎనిమిదడుగులు ఎత్తులో ఉంటాయి. వాటిని చూడాలంటే తలెత్తాల్సిందే! అసలు అక్కడ మొక్కజొన్న మొక్కలు లేకుండానే కంకులు కనిపిస్తాయంటే నమ్మండి. అదెలా సాధ్యం అనే సందేహం వస్తోంది కదూ! అయితే అమెరికా వెళ్ళాల్సిందే...వాటిని చూడాల్సిందే!

అమెరికా దేశంలోని డబ్లిన్ నగరంలో ఫీల్డ్ ఆఫ్ కార్న్ అనే మొక్కజొన్న తోట ఒకటి ఉంది. దీన్ని 1994లో ఏర్పాటుచేశారు. మాల్కం కొచ్రన్ అనే పెద్దాయనకి వచ్చిన ఆలోచన ఫలితమే ఈ తోట. అయితే అక్కడ కేవలం కంకులు మాత్రమే కనిపిస్తాయి. మొక్కలు కనిపించవు. ఎందుకలా అంటే ఆ కంకులన్నీ నిలువెత్తు శిల్పాలు మరి. మొత్తం 109 కంకులు 13 వరుసల్లో దర్శనమిస్తాయి. ఒక్కోటి 8 అడుగుల ఎత్తు, 680 కిలోల బరువు ఉంటాయి. సిమెంట్ పోత పోసి నిర్మించిన ఈ ఆకృతులన్నీ తెల్లని రంగులో మెరిసిపోతూ కనువిందు చేస్తాయి. శామ్ ఫ్రాంట్జ్ అనే ఆయన అనేక హైబ్రిడ్ మొక్కజొన్న రకాలను కనుగొనడంతో, ఆయన పేరుమీద ఈ తోటను ఫ్రాంట్జ్ పార్క్ అని కూడా పిలుస్తారు. ఈ తోటలో విహరించడానికి, సెల్ఫీలు తీసుకోవడానికి పర్యాటకులు కూడా వస్తుంటారు.

## ఎయిర్‌పోర్ట్ థీమ్

కార్పొరేట్ కార్యాలయాలు, కార్పొరేట్ ఆస్పత్రులు, కార్పొరేట్ సంస్కృతి... ఇప్పుడు కార్పొరేట్ శ్మశానాలు కూడా వస్తున్నాయి. అలాంటి కార్పొరేట్ శ్మశానవాటికే ఒకటి గుజరాత్‌లో ఉంది.

గుజరాత్‌లోని బర్దోలీలో మిందోల నదివద్ద కాస్తంత వెరైటీ థీమ్‌తో శ్మశానవాటికను నిర్మించారు. అది అచ్చంగా విమానాశ్రయాన్ని పోలి ఉంటుంది. ఇక లోపలి విషయానికొస్తే, ముందుగా రెండు విమానాలు దర్శనమిస్తాయి. ఒకటి మోక్ష ఎయిర్‌లైన్స్, ఇంకొకటి స్వర్గ ఎయిర్‌లైన్స్. శవాలను లోపలకు ఎలా తీసుకువెళ్ళాలో, ఏంచేయాలో అనౌన్సుమెంట్లు కూడా ఇస్తుంటారు. అక్కడి వాతావరణం కూడా అచ్చంగా ఎయిర్‌పోర్టులో ఉన్నట్టుగానే ఉంటుంది. మృతుల కుటుంబాలను ఓదార్చడం, వారికి ఉపశమనం కల్గించేందుకు అన్ని ఏర్పాట్లు చేశారు. అంతేకాదు శవాన్ని లోపల పెట్టగానే విమానాల్లో వచ్చే శబ్దం వస్తుందట. ఈ శ్మశానవాటిక అధ్యక్షుడు సోమభాయి పటేల్. 'ఎయిర్‌పోర్టును పోలివుండే శ్మశానవాటికను నిర్మించాలనేది అతనికి చిన్నప్పట్నుంచీ ఉన్న కలట. అందుకే విమానాశ్రయం ఆకృతిలో ఉన్న శ్మశానవాటికను నిర్మించానని చెబుతున్నాడు.



## అక్కడ అన్నీ అవే!

అనగనగా ఓ మ్యూజియం. కాకపోతే అక్కడేమీ పురాతన వస్తువులు, చరిత్రలు ఉండవు. ఎటుచూసినా పెన్సిల్ షార్పెనర్లే కనబడతాయి. రకరకాల ఆకృతుల్లో చూడముచ్చటగా, పొందిగ్గా పేర్చి ఉంటాయి. అమెరికాలోని ఒహియోలో ఉందీ మ్యూజియం. వీటిని సేకరించి, ఓ చిన్న ఇంట్లో మ్యూజియంగా మలచింది మాత్రం పాల్ జాన్సన్. 1988లో జాన్సన్ షార్పెనర్లు సేకరించడం మొదలుపెట్టాడు. ఈ హాబీ ఎలా వచ్చింది అంటే... అప్పట్లో అతని భార్య అతడికి రెండు షార్పెనర్లను బహుమతిగా ఇచ్చిందట. ఇక అప్పటినుంచి షార్పెనర్లను సేకరించడమే పనిగా పెట్టుకున్నాడు. దాదాపు 3,000 షార్పెనర్లను సేకరించాడు. ఒకదానితో ఒకటి అస్సలు సరిపోలవు. ఏ ఒక్కదాన్నీ కూడా ఉపయోగించలేదు. ఈ మ్యూజియంలో క్రీడలకు సంబంధించిన షార్పెనర్లన్నీ ఒకచోట, ఆహారానికి సంబంధించినవి ఒకచోట, చరిత్రకు చెందినవి ఒకచోట...ఇలా కేటగిరీల వారీగా అమర్చబడి ఉంటాయి.

## ఎమోజీల సందడి



నవ్వు, కోపం, వెటకారం, ఆందోళన... ఏ భావమైనా సరే స్మార్ట్ ఫోనుల్లో ఎమోజీలుగా ప్రత్యక్షమవ్వాల్సిందే! అయితే ఫోనుల్లోనే కాదు మేము రోడ్డు మీద కూడా సందడి చేస్తాం అంటూ పరుగులు పెట్టేస్తున్నాయి ఎమోజీలు! ఎలా అంటారా? చక్కగా మనుషులే ఎమోజీల ముసుగులేసుకుని వీధీ వాడా సందడి చేసేశారు. ఐదు దేశాల్లో దాదాపు 531 మంది ఎమోజీల ప్రపంచ దినోత్సవాన్ని ఈవిధంగా సెలబ్రేట్ చేసుకున్నారు. అదొక్కటే కాదు... 'ద ఎమోజీ' త్రీడీ సినిమా ప్రచారంలో భాగమే ఈ ఎమోజీల ప్రదర్శన జరిగింది. ఇన్ని ఎమోజీలు ఒకే సమయంలో, ఒకే రోజున సందడి చేసేసరికి గిన్నిస్‌బుక్‌లో స్థానం కూడా లభించింది. ఈ హడావుడంతా దుబాయ్ సిటీ, మాస్కో, లండన్, డబ్లిన్, సాపాలోల్లో జరిగింది.

## రోజూ అదే ఆహారం

ఆకలేస్తే ఎవరైనా ఏంచేస్తారు? అన్నం తింటారు... లేదంటే ఏ పండో, బిస్కెట్టో తింటారు. కానీ ఓ పెద్దాయన మాత్రం 25 ఏళ్ళుగా ఆకులు తిని బతికేస్తున్నాడు.



పాకిస్థాన్, పంజాబ్ ప్రావిన్సులోని గుజ్రన్‌వాలా జిల్లానివాసి మొహమూద్. తినడానికి డబ్బుల్లేవు. అడుక్కోవడం ఇష్టం లేదు. దాంతో కటిక పేదరికం అనుభవిస్తూ, చెట్ల బెరడు, ఆకులనే ఆహారంగా మార్చుకున్నాడు. ఇప్పుడు తన తిండికి ఏ లోటూ లేదని అంటున్నాడు. ఇక్కడ విచిత్రమేమంటే ఇప్పుడు అతనికి పని దొరికి కాస్తో కూస్తో సంపాదిస్తున్నా కూడా ఆకులను వదిలిపెట్టడం లేదట. రోజూ ఆకులనే ఆహారంగా తీసుకుంటున్నా, ఇప్పటివరకు అతనికి ఎటువంటి అనారోగ్య సమస్యలూ రాలేదు. అన్ని సంవత్సరాలుగా అదే ఆహారం తీసుకుంటున్నాడంటే కాస్తంత వింతగానే ఉంది కదూ!

—నర్మద వాసిరెడ్డి



కాలానికి అంతా సద్దుమణిగాక మళ్లీ అధికారంలోకి రావచ్చని సైన్యం తనకు చెప్పకనే చెబుతున్నట్టు కూడా ఆయన అర్థం చేసుకున్నారు. ఆయన ప్రధాని పద విలో లేకపోయినా పరోక్షంగా అధికారం కొనసాగించే టట్టు కూడా సైన్యం షరీఫ్‌కు అవకాశం కల్పించింది. షరీఫ్ కూడా సైన్యం మాట జవదాటని వ్యక్తే.

**కుటుంబ పాలనకు పెద్ద పీట**

షాబాజ్ నేషనల్ అసెంబ్లీకి ఎన్నికై ప్రధానమం త్రిగా ప్రమాణ స్వీకారం చేసేవరకూ షాహిద్ ఖాగన్ అబ్బాసీ తాత్కాలిక ప్రధానమంత్రిగా అధి కారం చేపడతారు. ఆయన నవాజ్ షరీఫ్‌కు బాగా సన్నిహితుడు. పదవిలో ఉండగా ఆయన నవాజ్ షరీఫ్ గీసిన గీతను దాటే అవకాశం లేదు. షరీఫ్ ప్రత్యక్షంగా అధికారంలో లేకపోయినా పాలన మీద ఆయన ప్రభావమేమీ తగ్గిపోదని చెప్పడానికి అబ్బాసీ నియామకమే నిదర్శనం. పన్నీర్ సెల్వంకు

# నవాజ్‌కు రాజకీయ గ్రహణం

**కుటుంబ పాలనకు తెరతీసిన నవాజ్ షరీఫ్ ఇకనైనా అవినీతి ఆరోపణల నుంచి బయట పడి దేశ సమస్యల మీద దృష్టి పెట్టడం రాజకీయంగా శ్రేయస్కరం.**

పనామా పేపర్ల కారణంగా పాకిస్థాన్ ప్రధాన మంత్రి పదవి నుంచి నవాజ్ షరీఫ్ దిగిపోతే దిగి పోయి ఉండొచ్చు. కానీ, ఆయన నిష్క్రమణతో పాకిస్థాన్‌లో మాత్రం రాజకీయంగాగానీ, పాలనా పరంగాగానీ, సైనికపరంగాగానీ ఎటువంటి మార్పూ చోటు చేసుకోలేదు. నిజానికి ఆ దేశానికి సంబంధించినంత వరకూ అటువంటి మార్పును సమీప భవిష్యత్తులో ఊహించలేం కూడా. నవాజ్ షరీఫ్ ప్రధానిగా ఉన్నప్పుడు పాకిస్థాన్ ఎలా ఉందో, ఆ తరువాత కూడా అలానే ఉంది. ప్రపం చమంతా మారుతున్నా ఏవిధంగానూ మారని దేశం పాకిస్థాన్. ఆ దేశంలో ఏదో పెద్ద మార్పు చోటు చేసుకుంటుందని ఆశించడం కూడా పొర పాటే. నవాజ్ షరీఫ్ వారసుడిగా ఆయన తమ్ముడు షాబాజ్ గద్దెనెక్కబోతున్నాడని తేలిపోయింది. ఆయన నేషనల్ అసెంబ్లీకి ఎన్నిక కాగానే ప్రధాని పదవిని చేపట్టడం ఖాయం. అంటే, పాకిస్థాన్ రాజ కీయం ఇప్పుడు కుటుంబవ్యవహారంగా కూడా మారిపోయిందన్న మాట.

ప్రధాని పదవి నుంచి నవాజ్ షరీఫ్ వైదొలగిన మరుక్షణం పాక్ సైన్యం అధికారంలోకి వచ్చేస్తుం దని అంతా ఊహించారు. అయితే, అలా జరిగేం దుకు ఆస్కారం లేదు. పాకిస్థాన్ సైన్యం అధికారంలోకి రావడం, రాకపోవడమనేది ఏమీ ఉండదు. ఎవరు అధికారంలోకి రావాలి, ఎవరు ఎలా బాధ్యతలు నిర్వర్తించాలి, ఎక్కడ కూర్చోవాలి, ఎక్కడ నిలబ డాలి అనేవన్నీ సైన్యమే నిర్ణయిస్తున్నప్పుడు ఇక అది అధికారంలోకి రావాల్సిన అవసరం ఏముంది? షరీఫ్ తర్వాత అధికారంలోకి ఎవరు రావాలి, ఎటు వంటి విధాన నిర్ణయాలు తీసుకోవాలి అనేది కూడా అదే నిర్ణయించింది. అది నవాజ్ షరీఫ్‌కు శత్రువైనా, ప్రతికూలంగా వ్యవహరించాలని భావిం చినా ఆయన తమ్ముడికి అధికారం అప్పగించేం దుకు సిద్ధపడదు. పాక్‌కు సంబంధించినంత వరకూ సైన్యం ఏ పని చేసినా, ఏ నిర్ణయం తీసుకున్నా ప్రశ్నించేందుకు అక్కడ ఎవరికీ అధికారం లేదు. న్యాయబద్ధంగా షరీఫ్‌ను పదవి నుంచి తొలగిం చిన సైన్యం ఆయనను కొద్ది కాలం ఇంట్లోనే ఉండ మని నర్మగర్భంగా సూచించింది.

తనపైన అవినీతి ఆరోపణలు అంతగా ప్రచారం కాకపోవడం ఆయనకు కాస్తంత ఊరట కలిగించే విషయమే. పనామా పేపర్స్ అంటే ఏమిటో పాకిస్థాన్‌లో సగానికి సగం మంది ప్రజ లకు అర్థం కాలేదు. ఈ విషయంలో వాళ్లు పెద్దగా ఆసక్తి కూడా చూపించడం లేదు. పైగా పాకిస్థాన్ పాలకుల్లో అవినీతి, రాజకీయ కుట్రలు, కుతం త్రాలు సహజమేనని వాళ్ల అభిప్రాయం. దేశంలో నీతి నిజాయతీలు కలిగిన రాజకీయ నాయకులను వారు సమీప భవిష్యత్తులో ఊహించలేకపోతు న్నారు. ఇదే భారతదేశంలో అయితే, ఇందుకు భిన్నంగా ఉండేదేమో! షరీఫ్‌కు తన ప్రజల మన స్తత్వం గురించి క్షుణ్ణంగా తెలుసు. అయితే, తనను మరీ అవమానకరంగా తొలగించడం మాత్రం ఆయనను దిగ్భ్రాంతికి గురిచేసింది. అయితే, ఇది ప్రజల కోసమేతప్ప తనకోసం కాదని, ప్రజల దృష్టిలో 'పెద్దమనిషి'గా పేరు తెచ్చుకుని, కొంత

జయలలిత, రబ్రీదేవికి లాలూ ప్రసాద్ అధికారం అప్పగించినట్టు అబ్బాసీకి నవాజ్ అధికారం అప్ప గించారన్న మాట. ఇంట్లోనే కావాల్సినంత విశ్రాంతి తీసుకుంటూ, ఎటువంటి బాధ్యతలూ లేకుండా అధి కారం చలాయించడానికి నవాజ్ షరీఫ్‌కు అరుదైన అవ కాశం దక్కింది. ఇటువంటి అధికారాన్ని అబ్బాసీ ఎంత కాలం చలాయించగలరన్నది మాత్రం వేచి చూడాల్సిందే.

సుమారు ఆరువందల ఉగ్రవాద శిబిరాలను పెంచి పోషించి, ప్రోత్సహిస్తున్న పాకిస్థాన్‌తో భారత సంబంధాలు మెరుగుపడే అవకాశాలు ఎండమావుల్లో నీరు వెతకడం లాంటిదే. పదవి నుంచి నవాజ్ షరీఫ్ తప్పుకోవడంతో తమ మధ్య సంబం ధాలు మెరుగుపడతాయని భారత్‌లో కూడా ఎవరూ ఆశించడం లేదు. నిజానికి పాకిస్థాన్ కూడా చాలా కాలంగా భారత్ పరిస్థితి చూసి లోలోపల ఎంతో సంతోషిస్తోంది. చైనాతో భారత్‌కు విబేధాలు ఆకా శాన్నంటడం, ఈ రెండు దేశాల మధ్యా పచ్చగడ్డి వేసినా భగ్గుమనే పరిస్థితి ఎదురవడం పాకిస్థాన్‌కు ఎంతో ఆనందం కలిగిస్తోంది. తాను చేయలేక పోతున్నది చైనా చేస్తున్న సమయంలో పాకిస్థాన్ సైన్యం భారత్‌తో సంబంధాల మెరుగుదలకు ప్రయత్నిస్తుందని ఎవరూ ఆశించరు.

పైగా భారత్ కాస్తంత జాగ్రత్తగా కూడా ఉండాల్సిన పరిస్థితి ఇది. స్వదేశంలో సంక్షోభాలు గానీ, సమస్యలు గానీ తలెత్తినప్పుడు ప్రభుత్వాలు ప్రజల దృష్టిని మళ్లించేందుకు సరిహద్దుల్లో సమ స్యలు సృష్టించడం సహజం! మారిన పరిస్థితుల్లో పాకిస్థాన్ మళ్లీ కులభూషణ్ యాదవ్ కేసును బయటికి తీసుకురావచ్చు. వాస్తవాధీన రేఖ దగ్గర భారీగా కాల్పులకు పాల్పడవచ్చు. పాకిస్థాన్‌లో ఏ ప్రధాని అయినా తన అధికారాన్ని స్థిరపరచుకోవ

# రివ్యూ

- రాజశుక




ప్రధాని అయినా తన అధికారాన్ని స్థిరపరచుకోవడానికి, సైన్యం మెప్పు పొందడానికి భారత్ మీద సైనికపరంగా ఒత్తిడి తెస్తుంటారు. అటువంటిదే ఇప్పుడు కూడా జరగవచ్చు. అందువల్ల రానున్న రోజుల్లో సరిహద్దులో దుస్సాహసాలను మనం చూడవచ్చు. పాకిస్థాన్‌లో ప్రధానమంత్రి ఎవరైనప్పటికీ, సైన్యం ఆదేశాలను కూడా శిరసావహించాల్సిందే కదా!

నవాజ్ షరీఫ్ తన అధికారాన్ని తన కనిష్ఠ సోదరుడు షాబాజ్‌కు అప్పగించారంటే దాని అర్థం ఆ దేశంలో వంశపారంపర్య రాజకీయవ్యవస్థకు కూడా బీజం పడినట్టే. మామూలుగానే పాకిస్థాన్‌లో ఎవరు అధికారానికి వచ్చినా పరోక్షంగా ఆయన బంధువులంతా అధికారం చలాయిస్తుంటారు. ప్రభుత్వమనేది ఓ కుటుంబ వ్యవహారంగా, కుటుంబ సంస్థగా మారిపోతుంటుంది. ఆ దేశంలో నేషనల్ అసెంబ్లీలో గానీ, రాష్ట్ర స్థాయి చట్టసభల్లో గానీ సగానికి సగం సీట్లు తండ్రి నుంచి కొడుక్కి, అన్న నుంచి తమ్ముడికి వారసత్వంగా వెళ్లిపోతుంటాయి. అక్కడ రాజకీయాలు కుటుంబ వ్యాపారాలు. షరీఫ్ కూడా అదే కోవకు చెందిన రాజకీయ నాయకుడు. అవినీతి ఆరోపణల మీద సుప్రీం కోర్టు తనను అనర్హుడిగా ప్రకటించగానే షరీఫ్ తన తమ్ముడిని తన వారసుడిగా ప్రకటించేశారు.

## సడలుతున్న రాజకీయ పట్టు

ప్రస్తుతం దేశ రాజకీయాలమీద పాకిస్థాన్ ముస్లిం లీగ్ (నవాజ్ షరీఫ్)కు ఉన్నంత పట్టు మరో రాజకీయ పార్టీకి లేదు. పార్టీ అధినాయకుడిగా ఆయనకు ప్రధాని పదవిలో తాను ఆడమంటే ఆడే పాడమంటే పాడే వ్యక్తి కావాలి. షాబాజ్ ఆ పాత్రను పోషిస్తారనే ఆయన భావిస్తున్నారు. షాబాజ్‌ను పదవిలో కూర్చోబెట్టి షరీఫ్ వచ్చే ఎన్నికల వరకూ దేశ ప్రధానిగా పరోక్షంగా అధికారం చలాయిస్తారనుకోవాలి. పార్టీ అంటే షరీఫ్, షరీఫ్ అంటే పార్టీ అని ఆయన నిరూపించాలనుకున్నారని అక్కడి మీడియా కూడా వ్యాఖ్యానించింది. ప్రస్తుతం పంజాబ్‌రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్న షాబాజ్ తన అన్న రాజీనామా చేసిన నేషనల్ అసెంబ్లీ సీటునుంచి పోటీ చేస్తారు. ఇప్పుడు అబ్బాసీ లాగా ఆ తరువాత ఆయన తన అన్న తరపున డమ్మీ ప్రధానిగా కొనసాగుతారు.

ఇది ఇలా ఉండగా, పంజాబ్ ముఖ్యమంత్రిగా తన కుమారుడికే పట్టాభిషేకం చేయాలని షాబాజ్ ఆరాటపడుతున్నారు. తన రాజీనామా తర్వాత పంజాబ్ అసెంబ్లీ సీటుకు జరిగే ఉప ఎన్నికలో తన కుమారుడు హంజాను నిలబెట్టి, గెలిపించి, ముఖ్యమంత్రిని చేయాలని ఆయన ఉద్దేశం. పాకిస్థాన్‌లో అత్యంత కీలకమైన రాష్ట్రంగా పేరున్న పంజాబ్‌లో నవాజ్ షరీఫ్ పార్టీకే కాస్తంత బలముంది. ఆ ధైర్యంతోనే షరీఫ్ కుటుంబం ఇటువంటి వారసత్వ చర్యలన్నీ తీసుకుంటోంది. ఇక్కడైతే తమను సవాలు చేసే పార్టీయేలేదని ఆ కుటుంబానికి తెలుసు. దేశంలోని ప్రముఖ మీడియా సంపాదకులు, రాజకీయ విశ్లేషకులు మాత్రం షాబాజ్ విషయంలో కొన్ని సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. ప్రజల్లో, పార్టీ శ్రేణుల్లో నవాజ్ షరీఫ్‌కు ఉన్నంత పట్టు, పలుకుబడి షాబాజ్‌కు ఉన్నాయా అనేది వారి ప్రధాన సందేహం. షాబాజ్ గనుక ప్రధాని అయితే, ఆయనకు పార్టీ అండగా ఉండే అవకాశాలు తక్కువని వారు అభిప్రాయపడుతున్నారు. షాబాజ్‌ను ప్రధానిగా ఎన్నుకోవడంవల్ల పార్టీ బీటలు వారే ప్రమాద ముందని కూడా వారు హెచ్చరిస్తున్నారు.

దేశంలో రాజకీయంగా నవాజ్ షరీఫ్‌కు ఉన్నంత ఆకర్షణ షాబాజ్‌కు లేదనీ, షాబాజ్ అధికారానికి వస్తే అసలు ఆ కుటుంబం మీదే పార్టీ శ్రేణులకు విరక్తి కలిగే అవకాశం ఉందనీ రాజకీయ వ్యాఖ్యాతలు సోషల్ మీడియాలో అభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నారు. 2007లో బేనజీర్ భుట్టో హత్య తరువాత ఆమె కుటుంబం, ఆమె పాకిస్థాన్ పీపుల్స్ పార్టీ దేశ రాజకీయాలమీద చాలావరకు పట్టు కోల్పోయాయి. బేనజీర్ భుట్టో తండ్రి జుల్ఫీకర్ అలీ భుట్టో స్థాపించిన ఈ పార్టీ నాలుగు దశాబ్దాల పాటు దేశ రాజకీయాలను ప్రభావితం చేసింది. బేనజీర్ హత్య తర్వాత ఆమె కుమారుడు బిలావల్‌కు పార్టీ మీద పట్టు పోయింది. 2013లో జరిగిన ఎన్నికల్లో ఆయన పార్టీ 76 స్థానాలు కోల్పోయింది. పార్టీలకంటే అక్కడ నాయకులకే ప్రాధాన్యం ఎక్కువ. పాకిస్థాన్ పీపుల్స్‌పార్టీ కంటే బేనజీర్‌కే ఆకర్షణ ఎక్కువగా ఉండేది. అదే విధంగా, పాకిస్థాన్ ముస్లిం లీగ్ (నవాజ్) కంటే నవాజ్ షరీఫ్‌కే ఆకర్షణ ఎక్కువ.

## ప్రత్యర్థులకిది సమయం

విచిత్రమేమిటంటే, ఈ వంశపారంపర్య రాజకీయాల నుంచి దేశాన్ని బయటపడేస్తాననే నినాదంతో పాకిస్థాన్ తెహ్రీక్ ఎ ఇన్సాఫ్ పార్టీని ప్రారంభించిన మాజీ క్రికెటర్ ఇమ్రాన్‌ఖాన్ కూడా ఇప్పుడు ఇదే కోవలో చేరిపోయారు. ప్రస్తుతం ఆయన పార్టీ ఆయన్నే కేంద్రంగా చేసుకుంది. ఆయన జనాకర్షణమీదే ప్రజల్లోకి వెళ్లగలుగుతోంది. వంశపారంపర్య రాజకీయాలతో పాటు, అవినీతిని నిర్మూలిస్తానని, నిరుద్యోగం, ధరల పెరుగుదల వంటి సమస్యల పరిష్కారానికి గట్టి కృషి చేస్తానని చెప్పి ఇమ్రాన్‌ఖాన్ ఈ పార్టీని స్థాపించారు. అయితే, ఈ పార్టీ ఇంతవరకూ జాతీయ పార్టీగా ఎదగలేదు. కుటుంబ పాలనకు కేంద్రంగా ఉన్న నవాజ్ పార్టీ ఆధిపత్యాన్ని తగ్గించడంలో ఈ పార్టీ ఘోరంగా విఫలమైంది.

అబ్బాసీని, ఆ తర్వాత షాబాజ్‌ను ప్రధాని పదవిలో కూర్చోబెట్టిన తర్వాత నవాజ్ షరీఫ్ ఇక తన మీద వచ్చిన అవినీతి ఆరోపణలను తొలగించుకోవడానికి కృషి చేయాల్సి ఉంటుంది. తన మీదే కాదు, తన కుమార్తె మర్యం నవాజ్‌తో సహా తన ముగ్గురు సంతానంపై కూడా అవినీతి ఆరోపణలు వెల్లువెత్తినందువల్ల, ఆయన ఈ 'అపఖ్యాతి' నుంచి బయటపడడానికి బాగా శ్రమ పడాల్సి ఉంటుంది. దేశ రాజకీయాలపై తన పట్టు కొనసాగాలన్న పక్షంలో ఆయన ఈ అవినీతి ఆరోపణల నుంచి బయటపడి, ఇప్పటికైనా దేశ సమస్యలపై దృష్టి పెట్టక తప్పదు. ఎన్నికల లోగా అది జరగని పక్షంలో బిలావల్, ఇమ్రాన్‌ఖాన్‌లలో ఎవరో ఒకరు నవాజ్ షరీఫ్‌కు పగ్గాలు వేసే ప్రమాదం ఉంది.



# CRIME రూమ్ నెంబర్ 69

**సాయంత్రం ఆరుగంటల సమయం.**

**వీధి దీపాలు వెలిగి రోడ్లన్నీ కాంతిమంతమవుతున్నాయి. కార్లు, స్కూటర్లు, వాహనాలు రయ్ రయ్న పోతున్నాయి.**

**బస్టాపుల్లో కిక్కిరిసిన జనం. విజయ్ బస్సుకోసం చూస్తున్నాడు.**

**అదే సమయంలో ఓ ఆటో విజయ్ ముందు వచ్చి ఆగింది.**

**అందులోంచి దిగిన వ్యక్తిని చూసి విజయ్ గుండె గొంతుకలోకొచ్చింది.**

తను చూస్తున్నది నిజమా? కలా? అని ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు.

అసలే అందగత్తె. ఆ రోజు పనిగట్టుకునిమరీ అలంకరించుకున్నట్టుంది.

రెప్పమూయకుండా చూస్తూ ఉండిపోయాడు.

ముసిముసి నవ్వులు నవ్వుతూ "ఊరికే చూడ్డమేనా? కాఫీకేమైనా తీసుకెళ్ళేదుందా?" అడిగింది. ఆమె అందాన్ని కళ్ళతోనే తాగేస్తూ "ఒట్టి కాఫీయేనా?" అన్నాడు విజయ్.

"నాకైతే కాఫీ చాలుబాబు. నీ విషయం నాకు తెలియదు"

"నిన్న రాత్రంతా నాకు నిద్రపట్టలేదు తెలుసా"

"ఎందుకో?" పెదవులు కొరికిందామె.

"చెబుతాను పద" అన్నాడు విజయ్. దోవలో టాక్సీని పిలిచాడు. ఆమెను ఏ వన్ గెస్ట్హౌస్కు తీసుకెళ్ళాడు. టాక్సీ గెస్ట్హౌస్ముందు ఆగగానే ఆమె కలవరపడ్డట్టు కనిపించింది. డబ్బులిచ్చి టాక్సీని పంపేశాడతను. రూం తీసుకుని ఆమెను గదిలోకి తీసుకొచ్చాడు. సంకోచంగానే గదిలోకి అడుగుపెట్టింది ఆమె. వెంటనే విజయ్ తలుపు మూసి గడియపెట్టాడు.

పరువాల బరువులతో బంగారు బొమ్మలా నిలబడింది ఆమె.

విజయ్ ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

ఆమె ఎర్రటి పెదవులను అందుకున్నాడు. అతడి మెడచుట్టూ చేతులువేసి మత్తుగా కళ్ళలోకి చూసింది. ఆమెను ఎత్తుకుని మంచంవైపు నడిచాడు అతను.

***

ఉదయం ఏడు గంటలు.

ఘటకేశ్వర్ పోలీసు స్టేషన్లో ఇన్స్పెక్టర్ పాండే డ్యూటీలో ఉన్నాడు. సీనియర్ కానిస్టేబుల్తో ఏదో కేసు గురించి చర్చిస్తున్నాడు. అంతలో టేబుల్ ముందున్న ఫోన్ మోగింది.

ఫోన్ ఎత్తి "ఇన్స్పెక్టర్ పాండే స్పీకింగ్" అన్నాడు.

"సార్, నేను సూపర్ గెస్ట్హౌస్ మేనేజర్ని. మా గెస్ట్హౌస్ రూం నెం.69లో ఒక యువకుడి శవం పడి ఉంది. వెంటనే రావాలి" అన్నాడు కంగారుగా.

"హలో, మేము వచ్చేవరకూ ఎవరినీ బయటికి పోనివ్వకండి. ఎవ్వరినీ లోపలికి రానివ్వకండి. గదిలో వస్తువులు ముట్టనివ్వకండి" అని ఫోన్పెట్టి బయటికి వచ్చాడు.

అప్పటికే వాహనం సిద్ధంచేశారు కానిస్టేబుల్స్. నలుగురు కానిస్టేబుల్స్తో ఘటనా స్థలానికి చేరుకున్నాడు పాండే.

రూం నెం.69లో మంచంమీద మృతదేహం నగ్నంగా పడివుంది. శవాన్ని క్షుణ్ణంగా పరిశీలించాడు. మృతుడు పాతికేళ్ళ యువకుడు. శరీరం నీలంగా మారింది. విషప్రయోగం జరిగి ఉండొచ్చని ఊహించాడు పాండే. శరీరంమీద గాయాలు లేవు. అంటే హత్యకు ముందు ఎలాంటి ఘర్షణ జరగలేదన్నమాట. చెదరిపోయినపక్క, వాడిపోయిన మల్లెపూలు, మృతదేహంమీద లిప్స్టిక్ మరకలు...మరణానికి ముందు యువకుడు స్త్రీతో గడిపాడనటానికి సంకేతాలు. మరి ఆ స్త్రీ ఎవరు? నేరస్థురాలు మహిళా? అయితే ఎందుకు హత్య చేసింది? డబ్బుకోసమా? లేక ఏదైనా పగ, ప్రతీకారం కారణమా? ఇలా ఆలోచిస్తూనే, ఇన్స్పెక్టర్ పాండే మృతుడి దుస్తులు తనిఖీ చేయించాడు. జేబులో దొరికిన విజిటింగ్ కార్డ్మీద, 'విజయ్, మేనేజర్, ఆయిల్ ఫ్యాక్టరీ, రాంనగర్' అనే చిరునామా ఉంది. వెంటనే ఓ కానిస్టేబుల్ను పంపి వివరాలు కనుక్కోమన్నాడు.

తరువాత పోలీసుల విచారణ ప్రారంభమైంది.

ఆరోజు సాయంత్రం ఓ జంట గెస్ట్హౌస్కు వచ్చి భార్యాభర్తలనిచెప్పి గది తీసుకుంది. రాత్రి భోజనాలు, ఉదయం కాఫీకూడా తెప్పించుకోలేదు. రూమ్క్లీనింగ్వాళ్ళు ఎన్నిసార్లు పిలిచినా తలుపులు తెరవకపోవడంతో వాళ్ళు మేనేజర్ను అప్రమత్తం చేశారు. మాస్టర్ కీతో డోర్ తెరచిచూస్తే లోపల యువకుడి శవం ఉంది. అతనితోపాటు వచ్చిన యువతి ఎప్పుడు వెళ్ళిపోయిందో, తమకు తెలియదని హోటల్ మేనేజర్ వాంగ్మూలం ఇచ్చాడు.

విజయ్ తన అసలు పేరుతోనే రూం తీసుకున్నాడు. హోటల్ రిసెప్షన్లోని సిసి కెమెరాలో విజయ్తో కలిసి వచ్చిన యువతిని గుర్తించేందుకు ప్రయత్నించారు.

ఇన్స్పెక్టర్ పాండే వేలిముద్ర నిపుణులను పిలిపించాడు. వివిధ కోణాల్లో పోలీస్ ఫొటోగ్రాఫర్ ఫొటోలు తీశాడు. వేలిముద్రల నిపుణులు వెళ్ళిపోతుండగా ఓ కానిస్టేబుల్ ఓ వ్యక్తిని వెంటబెట్టుకు వచ్చాడు. మృతదేహాన్ని చూడగానే, "బాబూ విజయ్" అంటూ ఆ వ్యక్తి భోరుమని ఏడవసాగాడు.

కొద్దిసేపటి తర్వాత ఆ వ్యక్తి కొంచెం తేరుకున్నాడు. తర్వాత పాండే ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చాడు. "నా పేరు రామనాథ్. వీడు నా కొడుకు విజయ్. ఎం.బి.ఏ చదివి ఇక్కడే 'ఆయిల్ ఫ్యాక్టరీలో' మేనేజర్గా చేస్తున్నాడు. వీడి చావుకు కారణం నమిత" అన్నాడు.

"నమిత ఎవరు?" అన్నాడు ఇన్స్పెక్టర్ పాండే.

"ఆయిల్ ఫ్యాక్టరీ యజమాని కూతురు నమిత. నా కొడుకు, నమిత ఇద్దరూ ప్రేమించుకున్నారు. నేను మొదటే మావాణ్ణి హెచ్చరించాను. మనం వాళ్ళకు సరితూగం, వద్దు నాయనా అని అనేక రకాలుగా చెప్పాను" అంటూ మళ్ళీ దీనంగా రోదించసాగాడు.

శవపంచనామా చేసి పోస్టుమార్టంకి తరలించారు.

తరువాత రామనాథ్ ఇచ్చిన స్టేట్మెంట్ రికార్డు చేశారు పోలీసులు. దాని ఆధారంగా నమిత ఇంటికి వెళ్ళాడు ఇన్స్పెక్టర్ పాండే.

పోలీసులను చూడగానే నమిత భయపడిపోయింది. ఆమె భయంచూశాక విజయ్ హత్యకు ఆమెకు సంబంధం ఉండొచ్చుననిపించింది. అయితే విజయ్ హత్యకు గురైన విషయం తెలుసుకుని షాక్కు గురైంది. భోరుమని ఏడవసాగింది. ఆమె మనస్ఫూర్తిగా ఏడుస్తున్నట్టే అనిపించింది. కాసేపటి తర్వాత ఆమె నుంచి వివరాలు రాబట్టాడు పాండే.

***

'ఆయిల్ ఫ్యాక్టరీ' యజమాని చమన్లాల్ గారాలపట్టి నమిత. ఎక్కుపెట్టిన మన్మథబాణం లాంటి ఇరవైఏళ్ళ అందగత్తె. పెద్దపెద్ద కళ్ళు. మత్తుగా గమ్మత్తుగా నవ్వే ఆమె కళ్ళు, ఎత్తయిన గుండెలు, కొండచిలువలా ఒంపులు తిరిగిన

**ఆటోవచ్చి అతనిముందు ఆగింది. రతీదేవి లాంటి అందగత్తె ఆటోలోంచి దిగి ఎదురుగా నిలబడి ముసిముసిగా నవ్వింది. ఫిదా అయిపోయాడతను. కళ్ళతోనే ఆమె అందాలు జుర్రుకోవడం మొదలెట్టాడు. ఒట్టి చూపులేనా? రెచ్చగొట్టింది ఆమె. నిద్రపట్టడంలేదు తెలుసా? అన్నాడు. ఎందుకో? గోముగా అడిగింది. చెబుతాపద అంటూ ఆటో ఎక్కించి గెస్ట్హౌస్కి తీసుకెళ్ళాడు. అప్పుడు ఏం జరిగిందంటే.....**

నడుము....మతిచెదిరిపోయే సోయగం, చలాకీమాటలతో ఇట్టే ఆకట్టుకునేది నమిత.

నమిత ఈడువాడే విజయ్. చూడగానే సినిమా హీరోలా ఆకట్టుకునేవాడు. ఫ్యాక్టరీ పనుల నిమిత్తం తరచు యజమాని వద్దకు వెళ్ళేవాడు. అలా ఆ ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి.

ఆమె అందం విజయ్‌ని రెప్ప మూయనివ్వలేదు. విజయ్ మాన్లీనెస్ చూసిన నమిత గుండె చప్పుడు పెరిగింది. క్రమంగా వాళ్ళ పరిచయం పెరిగి ఒకరినొకరు ఇష్టపడసాగారు. అలా ఒకసారి ఆఫీసు పనిమీద విజయ్ వచ్చినప్పుడు చమన్‌లాల్ ఇంట్లోలేడు. భార్యతో గుడికి వెళ్ళాడు. నమిత ఒంటరిగా టీవీ చూస్తూ కనిపించడంతో మంచి తరుణం వచ్చిందని విజయ్ ఆనందంతో తబ్బిబ్బయ్యాడు. నమిత క్రీగంట అతడి భావాలు గమనించింది.

"నమితా, నువ్వంటే నాకు చాలా ఇష్టం. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వు లేకుండా నేను బతకలేను" అన్నాడు.

ఆ మాటల కోసమే ఎదురుచూస్తోంది నమిత. విజయ్ ఆమెను గట్టిగా కౌగలించుకుని ఆమె ముఖాన్ని ముద్దులతో నింపేశాడు. ఆ స్పర్శకు ఆమె శరీరం పులకరించింది. సుడిగాలిలా చుట్టుకుపోయింది. గుండెల్లోంచి కోరికలు తన్నుకొస్తుంటే పరవశంతో తన మేను విజయ్‌కి అప్పగించింది. తన కౌగిలిలో మైనంలా కరిగిపోతున్న నమితను బెడ్‌రూంలోకి ఎత్తుకుపోయాడు విజయ్.

***

ఇక అప్పటినుండీ వాళ్ళిద్దరూ తరచు కలుసుకుంటూ కోర్కెలు తీర్చుకునేవారు. పార్కులు, హోటళ్ళకు తిరిగేవారు. అప్పుడప్పుడు గెస్ట్‌హౌస్‌కెళ్ళేవారు. ఈ విషయం ఎక్కువకాలం దాగలేదు. చమన్‌లాల్ మండిపడ్డాడు. కూతురిని కట్టడి చేశాడు. విజయ్‌ని రాజీనామాచేసి పొమ్మన్నాడు.

అయితే విజయ్ ఏ మాత్రం భయపడలేదు. "మా పెళ్ళి జరిపించండి. లేకపోతే నా దగ్గరున్న ఫొటోలు బయటపెడతాను" అన్నాడు. నమిత నగ్నంగా తన ఒడిలో పడుకుని వున్న ఫొటోలు చూపించాడు. అది చూసి చమన్‌లాల్ వణికిపోయి, తొందరలో పెళ్ళి జరిపిస్తానని నచ్చజెప్పాడు. కూతురును చమన్‌లాల్ తనకిచ్చి పెళ్ళి చేయబోతున్నాడని అదేరోజు విజయ్ ఇంట్లోవాళ్ళకి చెప్పాడు. నమితకు ఫోన్‌చేసి, "మన పెళ్ళికి మీ తండ్రి అంగీకరించాడు" అని చెప్పాడు. నమిత ఆనందంతో పొంగిపోయింది.

రెండు నెలల తర్వాత పెళ్ళి చేస్తానని చమన్‌లాల్ ఆ ఇద్దరికీ విడివిడిగా చెప్పాడు. కానీ ఫొటోలు చూపి బెదిరించిన విషయం మాత్రం కూతురుకు చెప్పలేదు. దాంతో నమిత, విజయ్‌ల వ్యవహారం మామూలుగానే కొనసాగింది.

***

చమన్‌లాల్ గుండెల్లో అగ్ని పర్వతాలు బ్రద్ధలవుతున్నాయి. కూతురి న్యూడ్ ఫొటోలు చూపించడం తల్చుకుని తీవ్ర అవమానానికి, బాధకు గురవుతున్నాడు. విజయ్‌లో అతడికి నిజమైన ప్రేమికుడు కనిపించలేదు. కూతురిని కూడా ఫొటోలతో భయపెట్టే బ్లాక్ మెయిలర్‌గా కనిపించాడు. చాలా జాగ్రత్తగా ఆమె జీవితంలోంచి అతడిని తొలగించాలనుకున్నాడు.

అదే సమయంలో పాత నేరస్థురాలు సుష్మ గురించి తెలిసింది చమన్‌లాల్‌కి. అందమైన ఆమె రూపం వెనుక ఓ భయంకరమైన హంతకురాలుందని ఎవరూ ఊహించలేరు. డబ్బున్న మగవాళ్ళకు తన అందం ఎరవేసి, ఉన్నది కాజేయడం, గప్‌చిప్‌గా వాళ్ళ ప్రాణాలు తియ్యడం ఆమె ప్రత్యేకత.

చమన్‌లాల్ ఆమెను కాంటాక్ట్‌చేశాడు. అప్పటినుంచి సుష్మ విజయ్‌ని ప్లాన్డ్‌గా ఫాలో అయింది. బస్టాప్‌లో తారసపడి వలవిసిరింది. మెల్లిగా వారం రోజులకు మాట కలిపింది. ఆమె అందానికి ఫిదా అయిపోయాడు విజయ్. తనంతటతానుగా వలచి వచ్చిన అందగత్తెను చూసి తనలో ఏదో ప్రత్యేకత ఉందనుకున్నాడు విజయ్. హోటల్లోకాఫీలు, పార్కుల్లో కబుర్లు పెరిగాయి. సుష్మ అందం అతడిని పిచ్చివాణ్ణి చేసింది.

ఆరోజు ఎలాగైనాసరే ఆమెను అనుభవించాలనుకున్నాడు.

అతని మనస్సు చదివినట్టే ప్రవర్తించింది సుష్మ.

సాయంత్రం ఆరు గంటలకు విజయ్ బస్సు కోసం ఎదురుచూస్తున్నాడు.

ఆటోలో వచ్చి అతడిముందు దిగింది సుష్మ.

కళ్ళార్పకుండా నిలబడిపోయాడతను. ముసిముసిగా నవ్వుతూ "ఊరికే చూడ్డమేనా? కాఫీకేమైనా తీసుకెళతావా?" అంది.

ఆమె అందాన్ని కళ్ళతోనే తాగేస్తూ "ఒట్టి కాఫీయేనా?" అన్నాడు.

"నాకైతే కాఫీచాలు బాబు. నీ విషయం నాకు తెలియదు" అంది వగలుపోతూ.

"నిన్నరాత్రంతా నిద్రపట్టలేదు సుమా?"

"అవునా? ఎందుకో?" పెదాలు కొరుక్కుంటూ అంది సుష్మ.

"చెబుతాను. పద" అని ఓ టాక్సీ పిలిచి ఆమెను ఏ వన్ గెస్ట్‌హౌస్‌కు తీసుకెళ్ళాడు విజయ్. గదిలోకెళ్ళగానే ఆమెను తనమీదకు లాక్కున్నాడు. అతడిని మరింత రెచ్చగొట్టింది ఆమె. ఆ కోరికకాస్తా తీరిపోయాక విశ్రాంతిగా ఆమెమీద వాలిపోయాడతను. దాంతో విషం పూసిన సూదిన అతడిమెడలో గుచ్చింది సుష్మ.

***

అలా విజయ్ హత్య జరిగింది.

క్షుణ్ణంగా పరిశోధించి చమన్‌లాల్, సుష్మాలపై కేసు నమోదుచేశాడు ఇన్‌స్పెక్టర్ పాండే. వారిని అరెస్టుచేసి కోర్టులో హాజరుపరిచాడు. నేరస్థులిద్దరూ ప్రస్తుతం జైల్లో ఉన్నారు.

—సూర్యనేత్ర




**"రేయ్!"**

**"చెప్పరా?"**

**"రేపొద్దున్నే మీముందు వాలిపోతాను. సత్తిగాడూ, భీముడూ, షరీఫ్‌గాడూ..." పాజ్ ఇచ్చాడు ధీరజ్.**

**"నాగ్గాడూ, పాణిగాడూ..." పూర్తి చేశాడు సారధి. అవతల ఫోన్లో హోరుమనే నవ్వు. సారధిలో ఉత్సాహం కెరటంలా ఎగదన్నుకొచ్చింది. కాసేపు ఇంకేదో పిచ్చాపాటి మాట్లాడి, సన్నగా హమ్ చేస్తూ కుర్చీలో కూలబడ్డాడు. ధీరజ్ ఫోన్‌కాల్ గొప్ప శక్తినిస్తోంది అతడికి. సంతకాల కోసం క్యాబిన్‌లోకి వెళ్ళాలా వద్దా అన్నట్టు సందేహంగా నిలబడిపోయారు బాస్‌ని గమనిస్తున్న స్టాఫ్.**

ఆ సాయంత్రం మిత్రబృందమంతా రాఘవయ్య పార్క్‌లో చేరిపోయారు. ధీరజ్ వస్తున్నాడంటే అందరికీ తన్మయం కలుగుతోంది. అంతగా ప్రభావితం చేయగలడతను. ఎవరింట్లో దిగాలో అని కాసేపు వాదించుకుని మళ్ళీ ధీరజ్‌కే ఫోన్ చేసి గెస్ట్‌హౌస్‌లో దిగుతాడని విని వాదన ఆపారు. రేపటి కార్యక్రమం నిర్ణయించమని సారధికే పెద్దరికం అప్పగించి బయల్దేరారందరూ.

"పాపం ఈసారి భీమరాజు మిస్సవుతున్నాడ్రా. ఆపరేషన్ జరిగి ఎన్నో రోజులు కాలేదు. చాలా ఇబ్బందుల్లో ఉన్నాడట" పాణి దిగులుపడ్డాడు. "నాగ్గాడూ అంతేకదా? వాడొచ్చాక అన్నీ ఆలోచిద్దాం. అసలువీడు ఎన్నిరోజులు గడపగలడో మనతో!" కారు దగ్గరకి నడిచి "రేపు స్టేషన్‌కి రండ్రా అందరూ" అన్నాడు సారధి. అంతా తలలూపి కదిలారు.

ఉదయమే విజయవాడ ప్లాట్‌ఫాంమీద ప్రత్యక్షమైన స్నేహితులను పేరుపేరునా పలకరిస్తూ కౌగలించుకున్నాడు ధీరజ్. అందరూ ముందుగా గెస్ట్‌హౌస్‌కి దారితీశారు. కాసేపు సందడిచేసి బయటకొచ్చారు.

అరేయ్ నువ్వేం మారలేదురా! అదే రూపం, అదే వేషధారణ, అవే మాటలు... సారధి నవ్వుతూ చూశాడు. అందరూ బాబాయ్ హోటల్ ముందు పిట్టల్లా వాలిపోయారు. వీళ్ళ అల్లరికీ, సందడికీ కాలేజీ స్టూడెంట్స్ కూడా సరిపోరని కౌంటర్ దగ్గరున్న బాబాయి వారసుడు అనుకున్నాడు. ఉప్మా పెసరట్లూ, ఇడ్లీలూ ఆప్యాయంగా తింటూ ఆస్వాదిస్తూ కాలేజీ రోజుల్ని తలచుకున్నారు.

"తర్వాత మజిలీ..." షరీఫ్ తలెగరేశాడు. "కాలేజీకి పోదాం పదండ్రా. ఆదివారమేగా హాయిగా అన్నీ చుట్టబెట్టొచ్చు" ధీరజ్ కదిలాడు. సారధి కారు డోర్ తీసి స్టార్ట్ చేశాడు. వీధులు చూసుకుంటూ, నిట్టూరుస్తూ, మధ్యమధ్య పాత విషయాలు జ్ఞాపకం చేసుకుంటూ కాలేజీ సమీపంలోని మెడికల్ షాపు దగ్గర ఆగారు. వీళ్ళ క్లాస్‌మేట్ కిషోర్ పలకరించాడుగానీ మరీ అంతగా కలిసిపోలేదు. "కాఫీ తెప్పిస్తానుండండి" అన్నాడు యథాలాపంగా. వీడు మనతో కలవడన్నట్లు తల అడ్డంగా ఊపి మెయిన్‌గేటు లోపలికి నడిచారు.

అంతవరకూ నవ్వుతూ, తుళ్ళుతూ ఉన్న ధీరజ్ బోటనీల్యాబ్ దగ్గరకొచ్చేసరికి గంభీరంగా మారిపోయాడు. రెండు చేతులూ మడిచి కాస్త వెనగ్గా బొటానికల్ గార్డెన్ దగ్గరకొచ్చి ఆగాడు.

"గత స్మృతులా?" సారధి మెల్లగా గొణిగాడు.

"చాలా.... అన్నీ నిన్న మొన్న జరిగినట్టే ఉన్నాయి కదరా?" ధీరజ్ కళ్ళల్లో సన్నటి నీటితెర. అందరూ మౌనంగా లైబ్రరీవైపు నడవడం ప్రారంభించారు. ఆ ఆటల మైదానం, కళాసదనం, పొడుగాటి వరండా



## నక్షత్రానికి పూజా పేరు?

*నక్షత్రాలకి హీరోగారు తమ ప్రేయసి పేరు పెట్టే సన్నివేశాలు సినిమాల్లోనే చూస్తుంటాం. సరిగ్గా ఇలాంటి సంఘటనే నిజజీవితంలో కూడా జరిగింది. లండన్‌కు చెందిన ఓ అభిమానికి పూజా హెగ్డే అంటే చెప్పలేనంత ఇష్టం అట! తన ఇష్టాన్ని చాటి చెప్పడానికి వినూత్నమైన విధానాన్ని ఎన్నుకున్నాడు ఆ అభిమాని. లండన్‌లో ఓ ఆన్‌లైన్ సంస్థ ద్వారా తన అభిమాన హీరోయిన్ పేరును ఆకాశంలో ఓ నక్షత్రానికి పెట్టాడట! కాకపోతే ఈ పేరు ఆ వెబ్‌సైట్ వరకే పరిమితం తప్ప అధికారికంగా కాదట! అభిమానులందరూ ఇదే విధానాన్ని అనుసరిస్తే ఉన్న నక్షత్రాలు సరిపోవేమో అని అంటున్నారు!*

చూసుకుంటూ అందరూ వరండా చివరమెట్లమీద కూలబడ్డారు.

“ఎందుకురా అనవసరంగా పెద్దవాళ్ళమవుతాం? ఆ పిల్లల్ని చూడండి? ఎండని లెక్కచేయనంత హుషారు వాళ్ళకి.” చిన్నచిన్న రాళ్ళు విసురుతూ అన్నాడు ధీరజ్. “ప్రకృతిని ఎవరు మారుస్తారు?” పాణి తనలో తాను అనుకున్నాడు. చాలాసేపు మౌనం తర్వాత “మన లెక్చరర్స్‌లో ఎంతమంది బతికున్నార్రా? ఇంగ్లీష్ సార్ విజయ్‌కుమార్‌తో కలిసి కల్చరల్ వీక్‌ని అద్భుతంగా జరిపేవాళ్ళం కదరా?”

“చాలామంది ఇంకా ఉన్నార్లేరా? అప్పుడప్పుడు సెంటర్లోనో, సినిమాహాల్స్ దగ్గరో తగుల్తూనే ఉంటారు. మీ ధీరజ్ చాలా పాపులరయ్యాడని పలకరిస్తుంటారు”

“మీరంతా హాయిగా ఇక్కడే తగలడ్డారు. నేనే బంతిలా అటూఇటూ దొర్లుతున్నా” విచారంగా నవ్వాడు ధీరజ్.

“నీకేంరా?” అంటూ ప్రేమగా చూశారంతా. “

“రచయితవి, జర్నలిస్టువి, కాలమిస్టువి, అప్పుడప్పుడూ నటుడివి నీకెంత గ్లామరూ...” అందరూ ముక్తకంఠంతో అన్నారు. “అవేమీ ఈ ధీరజ్‌ని సహజంగా ఉండనీయవురా. అంతా మాయ. అందుకే తిక్క పుట్టినప్పుడు నాలోపలున్నవాణ్ణి బయటకు లాగి కసిగా ఎడాపెడా రాసేస్తూ ఉంటాను. పిచ్చినా కొడుకులు. అందుక్కూడా ఆహ ఓహో అంటూ భజన చేస్తుంటారు. ఏమిటో?” “పిచ్చికాదు నాయనా, అందరూ ఆత్మపరిశీలన చేసుకునే దివ్యమైన విశ్లేషణ” షరీఫ్ నవ్వాడు. అలా కబుర్లతో కాలక్షేపం చేస్తూ మళ్ళీ ఆ కాలేజీ విద్యార్థులుగా మారిపోయారు. శీతాకాలపు నులివెచ్చని ఎండ సున్నితంగా పరామర్శిస్తుండగా కాసేపు ఆ చుట్టుపక్కల రౌండ్లువేసి భోజనానికని కాలేజీ ఎదురుగా ఉన్న పేరయ్య హోటల్‌లోకి దూరారు. ఆ వారసత్వం కొనసాగిస్తున్న పేరయ్యగారి అబ్బాయిని పొగిడారు. ఎదురుగా వ్రేలాడుతున్న పటంలో పేరయ్యగారు చిరునవ్వుతో పలకరించారు. ఆ వడ్డనలూ, రుచులూ, రకరకాల పచ్చళ్ళూ, పొడులూ, కమ్మటి నెయ్యీ మళ్ళీ పేరయ్యగారిని గుర్తుచేస్తూ జిహ్వని సంతృప్తి పరచాయి. హోటల్ సిబ్బందికి థాంక్స్ చెప్పి బయటికొచ్చారు. సారధి కారు స్టార్ట్ చేశాడు. పాణీ, షరీఫ్ బైక్‌ల మీదకి ఎగిరారు. సాయంత్రం కలుద్దామంటూ చేతులూపుతూ కదిలారు.

“అరేయ్, ఒకసారి తల కాస్త పైకి...నీ లవ్ వస్తోంది” అల్లరిగా అన్నాడు సారధి. ధీరజ్ కుతూహలంగా తల తిప్పాడు. ఎండకి కందిన మొహంతో, లేతాకు పచ్చ కాటన్ చీరలో అలసిపోయిన వనకన్యలా రాధిక

**చిన్నప్పటి స్నేహితులువాళ్ళు. అతనొక్కడే మిగిలిన మిత్రులందరికీ దూరంగా స్థిరపడ్డాడు. వాళ్ళందరికీ అతడే హీరో. జీవితంలో అన్ని రకాలుగా ఎదిగినవాడు. అందరినీ కలుసుకోడానికి వస్తున్నట్టు ముందుగానే సమాచారమిచ్చాడతను. స్టేషన్‌కువెళ్ళి ఆదరంగా ఆహ్వానించి అతన్ని తీసుకెళ్ళారు మిత్రులంతా. బాల్యంనాటి పరిసరాలన్నీ తిరిగి మధురానుభూతులు నెమరేసుకున్నారు. కానీ తర్వాత....? తర్వాత అతడేం చేశాడు?**

కింద రోడ్‌మీదకొచ్చి వీళ్ళ కారు చూసి, సంభ్రమంగా “హలో” అంది.

“రాధికా ఎలా ఉన్నావు? మన కాలేజీలోనే లెక్చరర్‌గా పనిచేస్తున్నావట కదా!” ఆత్మీయంగా నవ్వుతూ పలకరించాడు ధీరజ్. “అవును. సంవత్సరం క్రితం బదిలీ అయింది. అలాగే ఉన్నావు ధీరజ్. నీలో అస్సలు ఏమీ మార్పులేదు” ఆపాదమస్తకం పరీక్షించి నవ్వింది రాధిక. “ఓకేమరి. కాలేజీలో ప్రైవేట్ క్లాస్ పెట్టా. వెళ్ళాలి. బై..” సుతారంగా చేయి ఊపుతూ రోడ్ దాటింది. “ఏరా, దిగులుగా ఉందా?” “ఛ, అలా అనుకుంటే ఆ రోజుల్లో సంవత్సరానికి ఒకరు చొప్పున ముగ్గుర్ని తెలిసో తెలియకో కాస్త ప్రేమించాను. ఈ అమ్మాయి మరీ సంప్రదాయవాది. అప్పుడే మనకి సరిపడదని దూరంగా పెట్టా”

“నీకేంరా హీరోవి.”

“కానీ జీవితంలో జీరోని రా.”

“ఏం కాదు నువ్వు తల్చుకోవడంలేదంతే” సారధి అలా మాట్లాడుతూ ధీరజ్‌ని గెస్ట్‌హౌస్ దగ్గర వదిలి వెళ్ళాడు. ‘నిజంగా నేను హీరోనా?’ మంచం మీద వాలిన ధీరజ్ తనను తాను ప్రశ్నించుకున్నాడు. భుక్తాయాసం వల్ల కళ్ళు బరువెక్కాయి. కలతనిద్ర.. ఏవో కలలు... పరుగులు....

సాయంత్రమయ్యేసరికల్లా మళ్ళీ కృష్ణా బ్యారేజీ దగ్గర చేరిపోయారు స్నేహితులంతా. లేత నీలం రంగు టీషర్ట్, జీన్స్‌ప్యాంట్, రిమ్‌లెస్ కళ్ళజోడు, కుడిచేతికి సన్నటి కడియం...జోరుగా హుషారుగా అన్నట్టు చెదరని చిరునవ్వుతో కుర్రతనంతో ఆకర్షణీయంగా ఉన్న ధీరజ్‌ని ముచ్చటగా చూసుకున్నారు మిత్రులు. దూరంగా హుందాగా నిలబడిన కొండలతో వంపుతిరిగిన కృష్ణమ్మ నీరెండలో హొయలు పోతోంది. బ్యారేజీ అవతల సీతానగరం. కొత్తగా వచ్చిన మార్పులు చూస్తూ, సీతానగరంవైపు వెళ్ళి ఇసుకలో కూలబడ్డారంతా. చల్లగాలి గిరికీలు కొడుతూ కవ్విస్తోంది.

“మార్పు అనివార్యం. నేనా బంగార్రోజుల్లోనే బ్రతికేస్తా. ఐలవ్ ఇండియా, ఐ లవ్ మై విజయవాడ. కొంటెగా గట్టిగా ఈలవేశాడు ధీరజ్. ఎందుకైనా మంచి దని చుట్టూ చూశాడు.

“నీకింకా మాలాగా ఈతి బాధలు లేవురా?” షరీఫ్ అన్నాడు.

“ఏ బాధలున్నా మీలో అసలు వ్యక్తిని కాపాడుకోండ్రా! ఒకప్పుడు మనల్ని తన్మయంలో ముంచిన అనుభూతిని ఎందుకు దూరం చేసుకోవాలి. అనుభూతికన్నా మిగిలినవి విలువైనవా?”

“కాదు కాదు.”

“ఇదిగో ఈ వేరుశనగపప్పు తింటూ ఇంకా విజయవాడ గురించి చెప్పండి. ప్చ్...చాలా థియెటర్లు కూల్చేశారు”

“మన జ్ఞాపకాల్ని కూల్చలేరుగా!”

“నువ్వింకా ఎక్కడో బతుకుతున్నావురా!”

“లేదు. నేను వర్తమానంలో రకరకాల డ్యాన్సులు చేసినా తీయని నా గతాన్ని వదులుకోను. మీరంతా నా వాళ్ళేగా! జ్ఞాపకాల నిధులేగా!” ఆ మాటల్లోని భావుకత కాస్తో కూస్తో అందరినీ చుట్టుముట్టింది. బాగా చీకటి పడ్డాక లేచారు. గవర్నర్‌పేట, గాంధీనగర్ అన్నీ తిరిగారు. బజ్జీల సెంటర్‌కెళ్ళి అరటికాయ బజ్జీలు, మిరపకాయ బజ్జీలు తిని సోడాలు తాగారు. “రేపు నాతో ఎవరైనా వస్తే మా ఊరెళ్ళి రాజుగాణ్ణి కలిసి సాయంత్రం మళ్ళీ బండెక్కుతా....” అందరికీ వీడ్కోలిచ్చి కదిలాడు ధీరజ్. బందర్ రోడ్డు, ఏలూరు రోడ్డు, ప్రకాశం రోడ్డు మనస్సులోని మబ్బులని పూర్తిగా తుడిచేశాయి. ఒక్కడే రేడియో స్టేషన్‌వైపు పచార్లు చేస్తూ తిరిగాడు. రేపు తను సెవెంత్‌క్లాస్ వరకూ చదివిన ఊరు వెడుతున్నామంటే ఆ చిన్ననాటి విషయాలు గుర్తుకొచ్చి నిద్రపట్ట లేదు.

సారధి, షరీఫ్‌లతో కార్లో బంటుమిల్లి చేరాడు. ఊరు మొదట్లో కలువపూలతో నిశ్చలంగా, నిండుగా ఉండే చెరువు మాయమైంది. కారు సరాసరి హైస్కూలుదగ్గర ఆగింది. ఆ ఊర్లోనే వ్యాపారం చేసుకుంటున్న బాల్యమిత్రుడు రాజు వచ్చి కలిశాడు. హైస్కూలు చూడగానే ధీరజ్ కొత్తజన్మ ఎత్తినవాడిలా తను కూర్చున్న క్లాస్‌రూం బెంచీల దగ్గరికి

పరుగెత్తాడు. వరసగా సెక్షన్స్ ఉండేవి. బెంచీల్నీ, బ్లాక్ బోర్డుల్నీ తడిమితడిమి చూసుకున్న ధీరజ్ ఉద్వేగం భరించలేక భోరుమన్నాడు. "అరేయ్, మరీ ఇంత సెంటిమెంటల్‌గా ఉంటే ఎలారా? మనం వద్దన్నా కాలం ఆగుతుందా!" సారధి దగ్గరకి తీసుకుని తల నిమిరాడు. రాజు కళ్ళూ చెమర్చాయి. "అరేయ్, చాలామంది టీచర్లు కాలం చేసుంటారుకదరా? పాపం, వాళ్ళు నా అల్లరంతా భరించారు" స్కూలు వెనక చెరువు దగ్గరకి నడుస్తూ బరువుగా అన్నాడు ధీరజ్. ఏడవ తరగతివరకు బంటుమిల్లిలో గడిపిన బాల్య స్మృతులు అతన్ని కుదిపేస్తున్నాయి. పల్లెటూరు గాలీ, చెట్ల ఆకుల వాసనా, పశువులమంద నిదానపు నడకలూ....అవ్యక్తమైన ఆనందంతోపాటు పోగొట్టుకుంటున్న వ్యధనీ పెంచుతున్నాయి. ఆ రకమైన బరువు మిగిలిన ముగ్గుర్నీ ఆవరించింది. "ఇంత స్వేచ్ఛాపూరితమైన ప్రకృతీ, మట్టివాసనా, కాలువల సొబగూ నేను నిత్యం తిరిగే కాంక్రీట్ జంగిల్‌లో దొరకవురా! సారీరా, పోదాం పదండి. నా ఫస్ట్ లవ్‌ని కలవాలి. లోగడ రెండుసార్లు మిస్సయ్యాను. ఎర్రబడిన కళ్ళను కర్చీఫ్‌తో తుడుచుకుంటూ వాతావరణాన్ని తేలిక పరిచాడు ధీరజ్. "అంత చిన్నవయసులోనే మళ్ళీ వీడికో లవ్" అంతా నవ్వారు.




అరేయ్, నీ లవ్‌కి ఏనాడో పెళ్ళై పిల్లాపాపలతో సుఖంగా ఉండి ఉంటుంది.

"సో వాట్."

"ఆమె మొగుడుగారు నిన్ను తంతాడేమో చూడు" షరీఫ్ వెక్కిరించాడు.

"మనకా భయం లేదు" సరదాగా కాలరెగరేశాడు. "ఇక్కడే మన స్కూలు దాటాకే వాళ్ళిల్లు, నేను గుర్తు పట్టగలను".

"మామూలుగా అయితే ఈ గూడెంలోకి అడుగు పెట్టంరా!"

"ఈ ఊళ్ళల్లో ఇంకా ఇవి మారలేదేరా?" రాజు మాటలకు స్పందిస్తూ ఆ ఇళ్ళల్లోకి దారితీశాడు ధీరజ్. సారధికి కుతూహలం పెరిగింది. వీడి ఆకతాయితనంలో కొన్ని ప్రేమలూ...గాధలూ కూడాను... చిత్రమైన వెధవ వీడు" అనుకుంటూ చుట్టూ పరిసరాలు గమనించాడు. ఎక్కువగా పెంకుటిళ్ళు, అక్కడక్కడా డాబా ఇళ్ళు. వాకిళ్ళలో బంతిపూలు, కనకాంబరాలు విరగపూసి ఆహ్వానిస్తున్నాయి.

'జాన్ మాస్టారిల్లు మార్పు లేకుండా అలాగే ఉంది. ఆయన కూతురు స్వరూపా తనూ చిన్నప్పట్నుంచీ క్లాస్‌మేట్స్. హైస్కూల్లో చేరాక స్కూలుకెళ్ళే తోవలో కలిసేది. బాగా చదివేది. తను సరిగ్గా చదవకుండా దెబ్బలు తింటుంటే తనవైపు జాలిగా చూసేది. ఓహ్... ఆ లేలేత ప్రేమ చూపులు ఇప్పటికీ తాజాగా తన మనస్సుని స్పృశిస్తుంటాయి'

"ఎవరు కావాలి బాబూ?" అరవయ్యేళ్ళ స్త్రీ జుట్టు ముడేసుకుంటూ లేచి నిలబడింది.

"జాన్ మాస్టారు...." అంటూ ఆగిపోయాడు ఫొటో కేసి చూస్తూ. "ఎప్పుడో పోయారు బాబూ"

వరండాలో ఆయన ఫొటో పక్కన...! 'అదేమిటి, స్వరూపా? అప్పుడే ఆమె కూడా పటంలోకి ఎక్కేసిందా?' కళ్ళు నులుముకుని చూశాడు ధీరజ్.

దూరంగా ఆడుకుంటున్న ఇద్దరు పిల్లలు దగ్గర కొచ్చి నిలబడి, 'ఎవరు వీళ్ళంతా?' అన్నట్టు వింతగా చూస్తున్నారు.

"స్వరూప పోయాక ఈ పిల్లల ఆలనాపాలనా అంతా నేనే చూసుకుంటున్నాను బాబూ. నేను స్వరూప మేనత్తని" దిగులుగా అందావిడ. 'స్వరూప యస్సెల్సీ పాసయ్యాక, ఎక్స్ సర్వీస్‌మ్యాన్‌గా ఎయిర్‌ఫోర్స్ నుంచి తిరిగొచ్చిన మేనమామకిచ్చి పెళ్ళిచేశారు. నాన్న బదిలీ వల్ల తను ఎయిత్‌క్లాస్‌నాటికే విజయవాడ వెళ్ళిపోయాడు. ఈ జ్ఞాపకాలేమిటో? బాధలేమిటో? రెండుసార్లు మిస్ అయిన చెలి శాశ్వతంగా అందరినీ వీడివెళ్ళిపోయిందా?'

సారధి చేయి ధీరజ్ భుజాన్ని నొక్కింది. "ఎలా పోయారమ్మా ఆవిడ?" అడిగాడు సారధి.

"పెనిమిటి తాగుబోతయ్యాడయ్యా. ఏ పనీ చేయడు. నిలదీస్తే బాగా కొట్టేవాడు. ఆ దెబ్బలు తట్టుకోలేకపోయేది. ఒకసారి కోపంవచ్చి పక్కూరికెళ్ళి అక్కడ బావిలో పడి చచ్చిపోయింది."

అయ్యో అనుకునే ఓపిక మిగల్లేదు ధీరజ్‌లో. 'స్వరూప జ్ఞాపకాలుగా మిగిలిపోయిన ఆమె ఇద్దరు పిల్లల్నీ ఆర్తిగా దగ్గరకు తీసుకున్నాడు ధీరజ్. అసలీ జీవితం, ఈ స్నేహాలు, గతం గురించిన పాకులాట.... ఇదంతా పెద్ద మెలోడ్రామా!' ధీరజ్‌కి విరగబడి నవ్వాలనిపించింది.

షరీఫ్, సారధి సానుభూతిగా మిత్రుణ్ణి చూస్తూ వెనక్కి మళ్ళారు.

"సారీరా. ఈ ఊళ్ళో పేరుకి ఉంటానేగాని, బిజినెస్ గురించి లైన్ మీదకి పోతుంటా. ఊళ్ళో ఏం జరుగుతోందో కూడా ఏమీ తెలియదు" సంజాయిషీగా అన్నాడు రాజు.

"అప్పుడే సంవత్సరమైందయ్యా. ఇదిగో ఆ సచ్చినోడు తాగి ఇంటెనకాల పడుకున్నాడు." ఆ మేనత్త మాటలు గాల్లో కలిసిపోయాయి. ఊరంతా తిరిగి అణువణువూ పరిశీలించాలన్న కోరిక అణచుకుంటూ కారెక్కారు. "భోజనాలు చేసి వెళ్ళండ్రా" అని రాజు చెప్పినా వినిపించుకోలేదు. తనని తాను సంబాళించుకుని రాజుకి వీడ్కోలిస్తూ మిత్రులతో కలిసి ఊరు పొలిమేర దాటాడు ధీరజ్. 'ఇంత చేదు భరించడం కష్టమే. వీణ్ణి మంచి మూడ్‌లోకి ఎలా లాక్కురావడం?' షరీఫ్, సారధిలు మథనపడసాగారు. కాసేపటికి తేరుకుని నవ్వుతూ కబుర్లు చెప్పడం మొదలెట్టాడు ధీరజ్. "అంతా మనస్సు చేసే గారడీరా, ఏమీలేదు. మామూలుగా ఉండండి" ధీరజ్ మళ్ళీ జోకులు పేలుస్తూ మాట్లాడడంతో హమ్మయ్య అని తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు మిత్రులు. ఆ రాత్రికే మిత్రులందరినీ మనసారా గాఢంగా కౌగలించుకుని నవ్వించి మరీ ట్రైన్ ఎక్కాడు ధీరజ్. చేయి ఊపుతున్న ధీరజ్‌ని బెంగగా చూస్తూ చేతులూపుతూ అంతా కదిలారు.

వారం రోజుల వరకూ ధీరజ్‌ని కలసిన ఆ సందడిని గుర్తు చేసుకుంటూ గడిపేశారు మిత్రులు. ధీరజ్ ఇంకా వాళ్ళకి అర్థంగాని పజిల్‌గానే అనిపిస్తున్నాడు. పెళ్ళి చేసుకుంటే అన్నీ కుదుటపడతాయిలే అని తమలో తామే సర్దిచెప్పుకునేవాళ్ళు. హఠాత్తుగా కొరియర్‌లో వచ్చిన ధీరజ్ ఉత్తరం చూసి సారధి విస్తుపోయాడు. ఆ ఉత్తరం తీసుకుని షరీఫ్ దగ్గరకు పరుగెత్తాడు. అప్పటికే పాణీ, భీమరాజూ అక్కడికి చేరారు. "ఏమిట్రా ఇది!" సారధికి మాటలు రాలేదు. షరీఫ్‌ని దగ్గరికి తీసుకున్నాడు.

సారధీ! ప్రియనేస్తమా!

మీ అందరితో హాయిగా గడిపేశాను. కానీ రేపో మాపో అన్నట్టున్న నా అంతిమ ప్రయాణంలో కూడా మళ్ళీ చిన్న అసంతృప్తి... అపశ్రుతి. అయినా ఫర్లేదు. మీలాంటి స్నేహితుల్ని పొందిన నేను, నాకు కావాల్సినవిధంగా స్వేచ్ఛగా బతికాను. చెన్నైలో ఐదేళ్ళ క్రితం నాకొచ్చిన జబ్బుకి నా జీవితం ఎంతవరకూ పొడిగించే వీలుందో ఆనాడే చెప్పిన డాక్టర్స్.... చివరి క్షణాల్ని కూడా ఈ మధ్యే నిర్ణయించేశారు. నన్ను చూసిన మీకెవరికీ ఆ సందేహం అస్సలు రాదు (అదేరా మరి మీ ధీరజ్ మొండితనం... పొగడండ్రా నన్ను).

మన భీమరాజు, నాగేశ్వరరావుల్ని ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమని చెప్పండి. అందరూ నాలా అల్పాయుష్కులు కాకూడదు. స్వరూప నా చిన్ననాటి అందమైన జ్ఞాపకం, అంతే. మీద్వారా ఆమె పిల్లలకి కావాల్సిన ఆర్థికపరమైన ఏర్పాట్లు చేశాను. ప్లీజ్, నా గురించి ఏడవకుండా మిగిలిన జీవితాన్ని హాయిగా ఆస్వాదించండి. అనుభవించండి.

నాగ్గాడికీ, భీమరాజుకీ కూడా డ్రాఫ్టులు పంపుతున్నాను. మీ అందరి ప్రేమతో జ్ఞాపకాలతో నిశ్చింతగా వీడ్కోలు తీసుకుందామనే మీముందు వచ్చివాలాను. నవ్వులు పంచుకున్నాం, అన్నీ కలబోసుకున్నాం. ఈ జీవితానికి ఇది చాలు..

మీ

(చిరంజీవి) ధీరజ్.

వీడేంట్రా మరీ! అందరం వెళ్ళి ధైర్యం చెబుదాం పదండ్రా" సారధి వెక్కిళ్ళు పెట్టాడు.

"లేదురా నాన్నా, ధీరజ్ లేడు. ఫోన్‌లో ఇందాకే తెలుసుకున్నాం. మృత్యువుకి జడవని మొనగాడురా వాడు. ధీమంతుడు. ఆ చిరునవ్వుల సందడిని మళ్ళీ మళ్ళీ చూడగలమా..." నివాళి అర్పిస్తున్నట్టు కళ్ళు మూసుకున్నాడు షరీఫ్.

నవ్య

# అలర్జీ - హోమియో చికిత్స

అలర్జీ అనే పదం మనము సర్వసాధారణంగా ప్రతీ రోజు వింటూ వుంటాము. అలర్జీ అనేది రోగనిరోధక వ్యవస్థకు సంబంధించిన ఒక రుగ్మత. వర్షాకాలం మెరిసే వేడి వేసవి నుండి ఉపశమనం ఇస్తుంది. అలాగే అది పలురకాల వ్యాధులతో ప్రాణాలు తోడేయనూ వచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వర్షాకాలంలో ఒక అలర్జీ సమస్య వేదిస్తుంది. తుమ్ములూ, దగ్గులే కాదు ఒక్కోసారి శ్వాసతీసుకోవడము కష్టమవుతుంది. ఈ జలుబు మరియు దగ్గు సహజంగా వైరల్ జ్వరాలకు దారితీస్తుంది. ఈ వర్షాకాలంలో ఆస్తమా, అలర్జీ, బ్రాంకైటీస్, ఫ్లూ వంటి వ్యాదులు ఎక్కువ చూస్తాము. మన అధునిక జీవనం, పారిశ్రామిక ప్రాంతాలలో మరియు పెద్ద పట్టణాలలో వాతావరణ కాలుష్యం ఈ అలర్జీ ఒక పెద్ద కారణం.

అలర్జీతో ఇబ్బందులు పడేవారి బాధ వర్ణనాతీతం. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నా, పెద్దా అందరు శ్వాసకోశ అలర్జీలను కలిగించే వాటిలో ప్రధానమైనవి. అలర్జీతో బాధ పడేవారిలో ఏదో ఒక ప్రత్యేకమైన పదార్థానికి దగ్గరగా వచ్చినప్పుడు శరీరంలోని రక్తంలో ఉండే ఇమ్మ్యూనోగ్లోబిన్-ఇ అనే యాంటీబాడీస్ తో అలర్జీన్ కలవడం వల్ల హిస్టమిన్ విడుదల వుతుంది. దీని వలనే వ్యాధి లక్షణాలు ప్రారంభ మవుతాయి. మనిషి శారీరకతత్వము, వాతావరణం, వంశపారంపర్య చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కలుషితం వలన రక్తంలో జరిగే మార్పుల వలన ఈ అలర్జీ కొందరికి కొన్ని పదార్థములు, కొన్ని వస్తువులు అలర్జీ కారణం అవుతాయి.




**కారణాలు:** 1.దుమ్ము, పుప్పొడి రేణువులు. 2. పెంపుడు జంతువుల వెంట్రుకలు 3. ఘాటు వాసనలు, చల్లటిగాలి. 4. శీతలపానియాలు, ఐస్‌క్రీమ్‌లు. 5.వంశపారం పర్యం. 6.మస్కిటో రిపెల్లెంట్స్. 7.వాతావరణ మార్పులు.

**లక్షణాలు:** తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, వాంతులు, ఉబ్బసం, ముక్కు కారడం, ఎర్రని దద్దుర్లు, కళ్లు దురద, కంటిపోర గుచ్చు కోవడం.

**వ్యాధి నిర్ధారణ:** సి.బి.పి, ఈఎస్ఆర్, ఇస్నోఫిల్ కౌంట్ (ఏఈసీ), ఐజీ.ఈ.యాంటీబాడీస్, ఎక్స్‌రే, ఫల్మనరీ ఫంక్షన్‌టెస్ట్, సిటీస్కాన్, అలర్జిక్‌ప్రోఫైల్.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీ నుంచి పూర్తిగా ఉపశమనంకలిగించే మందులు ఉన్నాయి. హోమియోచికిత్సతో అన్ని రకాల అలర్జిక్ సమస్యలు దూరమవుతాయి. హోమియోపతిలో అలర్జీకి మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని పెంచి వ్యాధి నివారణ త్వరితంగా అయ్యేలా చేయడం జరుగుతుంది. అలర్జీ ఏ కారణం వలన వస్తుంది. ఎంత తీవ్రంగా వుంది, తీవ్రతను బట్టి మందులు ఇవ్వబడుతాయి. దీనికి హోమియోలో ఆర్సనిక్ ఆల్బ్, రస్టాక్స్, బెల్లడోన, ఆర్టికమురిన్స్, ఆరమ్‌డైఫిలమ్, ఇప్రెసియా, ఆలెయంసెవ మొదలగు మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడితే అలర్జీ సమూలంగా తగ్గిపోతుంది.

**www.starhomeopathy.com** | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ | ✆ 90300 64224

# మహిళల్లో సంతానలేమి ఆధునిక పరిష్కార మార్గాలు

**సంతానం అనేది స్త్రీలకు దేవుడిచ్చిన వరం, కానీ ప్రస్తుతం చాలా మంది స్త్రీలు కొన్నిరకాల కారణాలువలన 'సంతానలేమి' సమస్య తో బాధపడుతున్నారు. మనసమాజం అధునికతను సంతరించు కుంటున్నకొద్దీ ఎంతోమంది దంపతులు "సంతానలేమి" సమస్య ను ఎదుర్కొంటున్నారు. దీనికికేవలం శారీరక వ్యాధులు, లోపాలే కాదు, మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్లు, రాత్రివేళ ఉద్యోగాలు, మానసిక ఒత్తిడి వంటివి గణనీయమైన పాత్ర పోషిస్తున్నాయి. అయితే ఆధునిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో సంతానలేమికి చక్కటి పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి కనుక ఆందోళన చెందవలసిన అవసరం లేదు అంటున్నారు మన ఫర్టీ 9 హాస్పిటల్ వైద్యులు డా॥ సి.జ్యోతి.**

అసలు సంతానలేమి అంటే ఆరోగ్యవంతులైన దంపతులు ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకుండా ఏడాది పాటు దాంపత్యజీవనం సాగించినా పిల్లలు కలగపోవటాన్ని "సంతానలేమి"అంటారు. దీనికి కవలం స్త్రీలనునిందించటం సర్వసాధారణం. కానీ నిజానికి స్త్రీ, పురుషులిద్దరూ సమాన భాగస్వాములే. **స్త్రీలలో సంతానలేమిని 2 రకాలుగావిభజించ వచ్చు:** 1.ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీఅంటే స్త్రీ ఏడాదినుండి రెండేళ్ల పాటు సాధారణ లైంగిక జీవితం గడిపినప్పటికీ గర్భం ధరించ కపోవటం. 2. సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ అంటే స్త్రీ సాధారణ లైంగిక జీవితం గడపటంవలన ఒకసారి గర్భ ధారణ జరిగి, పిల్లలు కలిగినా లేదా గర్భస్రావమై, రెండవ సారి గర్భధారణ జరగక పోవటం. **స్త్రీలలో సంతానలేమికి గల కారణాలు: స్త్రీ ప్రత్యుత్పత్తి వ్యవస్థలోలోపాలు:** అవి ముఖ్యంగా 1. చిన్న గర్భ సంచి ఉండటం (ఇనెఫాంటైల్ యుటి రస్) లేదా అసలు గర్భ సంచి లేకపోవటం. 2.రెండుగదులు గా ఉండే గర్భసంచి ( బైకార్న్ మేట్ యుటిరస్ ) 3.యోని మార్గం చిన్నగాఉండటం లేదా మూసుకుపోవటం 4.ఫాలో పియన్‌ట్యూబ్స్ మూసుకు పోవటం. **బీజవాహికలలో లోపాలు:** 1. సాల్పింజైటీస్-ఇది బీజ వాహికల్లో వచ్చేవాపు. 2. హైడ్రో సాల్పింక్స్-దీనిలో బీజవాహిక లు ద్రవంలో నిండి మూసు కుపోతాయి. ఇది ముఖ్యంగా గర్భసంచి ఇన్‌ఫెక్షన్‌ల వల్ల ముఖ్యంగా టి.బి, లైంగికంగా సంక్రమించే వ్యాధుల వల్ల వస్తుంది. 3.ఎక్టోపిక్‌ప్రెగ్నెసీ **హార్మోన్ సమస్యలు:** 1.థైరాయిడ్, మధుమేహంవంటివి. 2.ఎఫ్.యస్.హెచ్, ఎల్.హెచ్, వంటివి ప్రోలాక్టిన్ వంటి హార్మోన్ల అసమతుల్యత 3. పి.సి.ఒ.డి 4. ఎ.ఎమ్.హెచ్ వంటి హార్మోన్స్ స్థాయిలు తగ్గటం వలన కూడా సంతానఅవకాశాలుతగ్గుతాయి.5.అండా శయంలో కణుతులు లేదాపాలిసిస్టిక్ ఓవరీస్ వంటివి. **యోని, గర్భ సంచిలో లోపాలు:** మహిళల్లో సంతానలేమి సమస్యలకు 5% కారణాలు దీనికి సంబంధించినవే. 1. ఎండోమెట్రియా సిస్ 2. గర్భసంచిలో కణితులు ఏర్పడటం (యుటిరైన్ ఫైబ్రాయిడ్స్)పాలిప్స్, సర్వైకల్ ఫైబ్రాయిడ్స్, ఎడినోమయోసిస్ వంటివి. 3.యోనిలోఉండే మ్యూకస్‌పొర అధికఆమ్ల గుణాన్ని కలిగి ఉండటంవలన కూడా శుక్రకణాలుచనిపోవటంవంటివి సంతానలేమికి కారణాలు. 4.గర్భసంచికి సోకే టి.బి. లైంగికం గా సంక్రమించే వ్యాధులు ( ఎస్.టి.డిస్ )గర్భసంచి ఇన్‌ఫెక్షన్స్. **ఇతర కారణాలు:** 1.వయసు, అధిక బరువు, 2. స్త్రీలలో 30 సంవత్సరాల వయసు దాటిన తర్వాత గర్భందాల్చేఅవకాశాలు తగ్గుతాయి. వయసుతో పాటు అండాల ఉత్పత్తి తగ్గటం, హార్మోన్స్ స్థాయిలలో తేడాలు కూడా అధిక గర్భస్రావానికి అవకాశా లను పెంచుతాయి. వయసు పెరిగిన కొద్ది సంతాన అవకాశా లు తగ్గుతాయి. 3.కొన్నిసార్లు ఎటువంటి కారణం లేకుండా కూడా సంతానలేమి ఉంటుంది. ఇటువంటి వారికి కృత్రిమ పద్ధతుల ద్వారా చికత్స చేస్తారు. **స్త్రీలలో సంతానలేమికి నిర్ధారణ పరీక్షలు:** 1. థైరాయిడ్ పరీక్షలు, హార్మోనల్ ఎస్సే (ఈస్ట్రోజన్,ప్రోజెస్టిరాన్,ఎఫ్.సి.హెచ్, ఎల్.హెచ్, ప్రోలాక్టిన్ వంటివి). 2.అల్ట్రాసౌండ్‌పెల్విక్‌స్కానింగ్. 3. ఫాలిక్యు లార్ స్టడీ 4.హిస్టిరో సాల్పింజియోగ్రమ్(హెచ్.ఎస్.జి) 5.డయా గ్నోస్టిక్ లాప్రోస్కోపి వంటివి. **వీరికిచేయదగినచికిత్సలు:** ఇందు లో ముఖ్యమైనవి 1.హార్మోన్ థెరపీ 2. ఐ.యు.ఐ 3. ఐ.వి.ఎఫ్ 4.ఇక్సీ 1.హార్మోన్‌థెరపిలోమందులద్వారా ఋతుచక్రసంబంధ లోపాలను సవరించవచ్చు. అండాల విడుదలను ప్రేరేపించ వచ్చు. 2.లాప్రోస్కోపిక్ సర్జరీ ద్వారా అండాశ యంలోని నీటి తిత్తులను (పిసిఒడి) ని సవరించవచ్చు. 3. ఐ.యు.ఐ. దీనిలో పురుషుల్లోని శుక్రకణాలను నేరుగా స్త్రీ గర్భశయంలోకి ప్రవేశపెడతారు. దీన్ని అండం విడుదలజరిగినపుడు చేయడం ద్వారా గర్భధారణకి అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. దీన్ని ఎక్కువగా వీర్యకణ లోపాలు ఉన్నపుడు, స్త్రీలలో బీజవాహిక లలో సమస్యలు ఉన్నపుడు సూచిస్తారు. దీన్ని 6నుంచి 10 రుతుచక్రాలు ప్రయత్నించవచ్చు. అంతేకాక ఇది తక్కువ వ్యయం కూడా. 4. ఐ.వి.ఎఫ్. దీన్ని"టెస్ట్‌ట్యూబ్‌విధానం" అంటారు. దీనిలో స్త్రీ అండాన్ని,పురుషుడి శుక్రకణాన్ని లేబరేటరీ లో ఫలదీకరణం చెందించి తిరిగి స్త్రీ గర్భాశయం లోకి ప్రవేశపెడతారు. దీన్ని ఎక్కువగా స్త్రీలలో ట్యూబులు మూసుకున్న వారికి, శుక్రకణాల సంఖ్య కదలికల్లో లోపాలు మగవారిలో ఉన్నపుడు, దంపతుల వయసు ఎక్కువగా ఉన్న పుడు సూచిస్తారు. 5. ఇక్సీ దీన్ని ఐ.వి.ఎఫ్ సత్ఫలితాలను ఇవ్వ నిసందర్భంలో ఉపయోగిస్తారు. ఇందులోశుక్రకణాలనుకృత్రిమ పద్ధతి ద్వారా అండంలోకి ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. అలా ఫలదీకరణం చెందించిన దాన్ని తిరిగి స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశపెడతారు. ఇటువంటి అత్యాధునిక చికిత్సల ద్వారా సంతానలేమికి మంచి పరిష్కారాన్ని పొందవచ్చు. "**ఫర్టీ 9 హాస్పిటల్** " లో నిపుణులైన వైద్యులు పరీక్షలు నిర్వహించి, మీ సమస్యలకు తగిన సంతాన సాఫల్య చికిత్సలను సూచిస్తారు. దీని ద్వారాఎంతో మంది దంపతులు సంతాన భాగ్యాన్ని పొందుతున్నారు.

**- డా॥ సి.జ్యోతి** ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**



**✆90300 15588** | సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । వరంగల్ | **www.ferty9.com**

11

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్

-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

**"ఉత్సాహంతో శ్రమించడం, విలక్షణంగా ఆలోచించడం, అలసటను ఆనందంగా అనుభవించడం. ఇవే విజయం కోరుకునే వారికి ఉండాల్సిన ప్రాథమిక లక్షణాలు"– (స్వామి వివేకానంద)**

**అందరూ నడిచేదారిలో నడిస్తే మీ ప్రత్యేకత ఏముంటుంది? మీలో ఉన్న ప్రతిభ వెలుగులోకి రాదు. బాహ్యంగా, అంతర్గతంగా మీరు మీ ప్రతిభని విలక్షణంగా చూపగలిగితే విజయం తథ్యం.**

# విలక్షణమే... విజయం



"ఆ యువకుడు అందరితో కలిసి టీ తాగుతున్నాడు. అతని ముందు టీ కెటిల్ ఉంది. వేడిగా ఉన్న టీ ఆవిరి బయటికి వెళ్ళకుండా దానిమీద ఒక మూత ఉండటం గమనించాడా యువకుడు. తదేకంగా దాన్నే చూస్తుంటే అతని మెదడులో మెరుపులా ఓ విలక్షణమైన ఆలోచన కలిగింది. ఆ ఆవిరిని ఉపయోగించి ఏదైనా చేస్తే!?!

అంతే! ఆ ఆలోచన, అతని కృషి ఫలితమే ప్రపంచంలో మొట్టమొదటి పొగ ఇంజన్ ఆవిష్కరణ. నాటి నుండీ నేటి వరకూ ఎంతోమంది కార్మికులకు ఉపాధి కల్పించి, ప్రపంచం తీరుతెన్నులను మార్చేసింది. ఆ పొగ ఇంజన్ ఆవిష్కర్త పేరు "జేమ్స్‌వాట్".

"మీ మదిలో ఏదైనా విలక్షణమైన ఆలోచన మెదిలితే దాన్నలా వదిలేయకండి. ఆ ఆలోచనకు సానబెట్టి ఓ రూపాన్నివ్వండి. కార్యాచరణలో పెట్టండి. ఆ విలక్షణం వెనక మీరు పరుగెత్తాలి. అప్పుడే విజయం మీ వెనుక పరుగెత్తుకొస్తుంది.

### సాహసమే విజయం

ధైర్యే సాహసే లక్ష్మి: ధైర్య సాహసాలున్న వాళ్ళే విలక్షణంగా ఆలోచిస్తారు. కార్యసాధకులకు శ్వాస విలక్షణమైతే, విశ్వాసం ఊపిరి. "ధైర్యసాహసాలు, ప్రతిభ విజయసాధనకు సోపానాలు"

–(గోథే)

"అపూర్వ పరిశోధనల ద్వారా ఇన్ని అద్భుతాలు ఎలా సృష్టించగల్గుతున్నారు? మీకు అదెలా సాధ్యమౌతోంది?" అని ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్‌ని, బాపూజీ అడిగారు.

అందుకు ఐన్‌స్టీన్ ఇలా సమాధానమిచ్చారు...

"దేవుడు చాలా జీవరాశులను సృష్టించాలనుకున్నాడు. అన్నీ ఆయనొక్కడే చేయలేడు గనుక నాలాంటి కొంతమందికి విలక్షణంగా ఆలోచించే మెదడిచ్చాడు, అంతే!" అన్నాడు.

అంటే! అపార మేధాసంపన్నుడైన ఐన్‌స్టీన్‌కి ఎక్కడెక్కడ నుండో విలక్షణమైన ఆలోచనలు అందుతున్నాయనే కదా! ఇదే మనిషి మనస్సు, మేధస్సు గొప్పతనం, విలక్షణం దాని ప్రత్యేకత. ప్రతివారి లోనూ ఇది ఉంటుంది. ఒక్కొక్కరిలో ఒక్కొక్కలా.

విలక్షణం ఎవరి సొత్తూ కాదు. దానికోసం గొప్ప గొప్ప చదువులే చదవనక్కర్లేదు.

'గిన్నిస్‌బుక్'లో స్థానం సంపాదించిన వారిని చూస్తే... వాళ్ళ ఆలోచనలు ఆవిష్కరణలు ఎంత విలక్షణంగా ఉంటాయో అవగతమౌతుంది. మనందరికీ పరిచయమున్న డ్రమ్స్‌వాద్య కళాకారుడు శివమణి. అతి ప్రధానవాద్య పరికరం డ్రమ్స్. అయినా కాదేదీ సంగీతానికి అనర్హమన్నట్టు, విలక్షణంగా... మనం పనికిరావని పారేసే వస్తువులనే సంగీత పరికరాలుగా చేసుకుని విచిత్ర ధ్వనులు సృష్టించి, అందరినీ అబ్బురపరచడం మనకు తెల్సిందే.

### శక్తి స్థావరం

సృష్టిలో ఉత్తమోత్తమమైన జన్మ మానవజన్మ. ఎందుకంటే 'ఆలోచన' అనే అద్భుత 'వరం' మనిషికి మాత్రమే ఉంది. మిగిలిన ప్రాణుల్లో ఆలోచన ఉన్నా మనిషి వ్యక్తం చేసినట్టు అవి వ్యక్తం చెయ్యలేవు.

మనిషి మెదడులో సరాసరి వెయ్యికోట్ల న్యూరాన్ సెల్స్ ఉన్నాయి. ఒక న్యూరాన్ సెల్ ఒక సూపర్ కంప్యూటరంత శక్తిమంతమైనది. సామాన్య మానవుడు 109 కోట్ల విషయాలు గుర్తుంచుకోగలడని సైన్సు చెబుతోంది. జీవితకాలంలో మనిషి గుర్తుంచుకునే సమాచారం మొత్తం రాస్తూపోతే పదికోట్ల తొంభైలక్షల కిలోమీటర్ల పొడవైన పేపరు అవసరపడుతుందట. ఇది ఒక సామాన్య మానవుని మెదడు సంగతి. ఇక ఒక మేధావి మెదడులోని సమాచారం రాయడానికి ఇంకెంత పేపరు కావాలో ఆలోచించండి. ఇంతటి అపార 'శక్తిస్థావరం' మానవ మెదడు బరువెంతో తెలుసా? 49 ఔన్సులు మాత్రమే.

అది మానవుడు విలక్షణంగా ఆలోచించబట్టే.... నిప్పు, ఉప్పు వంటివి ఎన్నో నేటికీ ఉపయోగించగల్గుతున్నాం. కాలక్రమంలో నేటి ఐఫోన్–7 వరకూ ఎన్నో ఆవిష్కరణలు మానవ మెదడు తాలూకు విలక్షణ ఆలోచనలే కదా!

ఆ క్రమంలో భారతదేశానికి చెందిన ఎందరో మహానుభావుల విలక్షణ ఆలోచనలు విశ్వ మానవాళికి ఎంతగానో ఉపయోగపడ్డాయి. ఉపయోగపడుతున్నాయి. చరిత్రలో వారిపేర్లు సుస్థిరమయ్యాయి.

భాస్కరాచార్య: 12వ శతాబ్దికి చెందిన గొప్ప గణితశాస్త్రజ్ఞుడు. ఖగోళ విషయాలు చర్చించిన

'సిద్ధాంత శిరోమణి' అనే గ్రంథం, 'లీలావతి' అనే గణిత గ్రంథం రచించాడు.

ఆర్యభట్టు: గుప్తుల కాలానికి చెందిన ఖగోళ శాస్త్రవేత్త. భారతదేశ తొలి కృత్రిమ ఉపగ్రహానికి ఈయన పేరు పెట్టారు. 'సున్న' (0) యొక్క ప్రాధాన్యత, బీజగణితంలో అనేక సిద్ధాంతాలకు మూలకర్త. రేఖా గణితంలో ఉపయోగించే "పై" విలువను ఖచ్చితంగా గుణించిన తొలి వ్యక్తి.

సి.వి.రామన్: భారతీయ భౌతికశాస్త్రవేత్త. 1930లో భౌతికశాస్త్రంలో నోబెల్ బహుమతి గ్రహీత.

అమర్త్యసేన్: భారతదేశ ఆర్థిక శాస్త్రవేత్త. 1998లో నోబెల్ బహుమతి, భారతరత్న అవార్డులు అందుకున్నారు. ఇలా అన్నిరంగాల్లో ఎంతోమంది భారతీయులు తమ విలక్షణతకు పెద్దపీటవేసి చరిత్ర సృష్టించారు, సృష్టిస్తున్నారు.

వైద్యరంగంలో నాటి చరకుడు, శుశ్రుతుడు మొదలు సాఫ్ట్‌వేర్‌రంగంలో నేటి సుందర్ పిచ్చై వరకూ 'విలక్షణతత్వమే' వారికి విజయాన్నందిస్తోంది.

మేధావులంతా తమలోని ఈ విలక్షణమైన ఆలోచనల్ని వెలికితీసి, కార్యాచరణలో పెట్టారంతే.

ప్రతి మనిషిలోనూ నిద్రాణమైయుండే ఇలాంటి విలక్షణ ఆలోచనల్ని విభిన్నంగా అమలు పరచాలంటే...

**నిద్రపోనీయని సంకల్పం:** విలక్షణంగా ఆలోచించినంతమాత్రాన విజయం రాదు. అది బలమైన కోరికగా మారాలి. కోరిక సంకల్పంగా రూపుదిద్దుకోవాలి. అది చిరుదీపంలా మిగిలి పోకూడదు. సునామీ సైతం ఆర్పలేని విద్యుద్దీపంలా మారాలి.

ప్రముఖ సంగీత దర్శకుడు ఎ.ఆర్.రెహమాన్ రాత్రిపూట నిశ్శబ్దాన్ని తన స్వరాలతో శబ్దాల్ని సృష్టిస్తాడు. అందుకే ఒకేసారి రెండు ఆస్కార్ అవార్డులు అందుకున్నాడు.

**మార్గం ముఖ్యం:** సంకల్పంగా మారిన ఆలోచనను సరైన మార్గంలో ముందుకు తీసుకెళ్ళాలి. నువ్వు నమ్మినమార్గంలో పయనించేటప్పుడు అవాంతరాలు ఎదురౌతాయి. అడ్డుగోడలు లేచి నిలబడతాయి. వాటినిచూసి భీరువులా మారకుండా, ధీరువులా గోడలుకూల్చి మార్గం సుగమం చెయ్యగలవాడే విజేత. "కాస్ట్ అవే" అనే ఆంగ్లచిత్రం మనందరికీ సుపరిచితమే. హీరో టామ్‌హాంక్స్ వెళ్తున్న విమానం అనుకోనివిధంగా సముద్రంలో కూలిపోతుంది. ఒక దీవిలో ఒంటరిగా "నాలుగేళ్ళు గడపాల్సిన పరిస్థితుల మధ్య అతడెలా జీవించాడు, చివరికి ఎలా బయటపడ్డాడన్నది చిత్రకథ. కాబట్టి మనం ఎంచుకున్న మార్గంలో ఎదురయ్యే సమస్యలకు సమాధానాలు మనం వెతుక్కుంటేనే 'విజయం' లభిస్తుంది.

## హేట్సాఫ్ సుందర్ పిచ్చై



*ఆగస్టు 10, 2015న గూగుల్‌సంస్థ తమ కొత్త సి.ఇ.ఓ. పేరు ప్రకటించి యావత్ ప్రపంచానికి పెద్ద సర్‌ప్రైజ్ ఇచ్చింది. ప్రపంచం మొత్తంలో కోట్లాది మంది ఒక్కరోజైనా ఆ సంస్థలో పని చెయ్యాలని కలలుగనే గూగుల్‌సంస్థకి ఒక భారతీయుడు సి.ఇ.ఓ. అవటం భారతీయులందరికీ గర్వకారణం. ఆ స్థితికి చేరుకోవడానికి ఎన్నో అవరోధాలు అధిగమించారు. గూగుల్ సి.ఇ.ఓ. సుందర్ పిచ్చై. ఆయనలోని విలక్షణమే ఆయనను ఆ స్థితిలో నిలబెట్టింది.*

*పిచ్చై సుందరరాజన్ తమిళనాడు మధురైలో ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు. ఆర్థిక నేపథ్యం కారణంగా టీవీ చూడటం, కార్లలో తిరగటం వంటి కోరికలు తీరలేదతనికి. సుందర్ పిచ్చై 12 ఏళ్ళ వయస్సులో ఇంటికి ల్యాండ్‌లైన్ ఫోన్ పెట్టించాడు తండ్రి. అప్పట్లో తానుచేసే ప్రతిఫోన్ నెంబరూ సుందర్ పిచ్చైకి కంఠోపాఠమే. స్కూల్లో అద్భుతంగా రాణించడంవల్ల ఆయనలోని ప్రతిభ ఆయనను ఖరగ్‌పూర్ ఐ.ఐ.టి. వరకూ తీసుకెళ్ళింది.*

*1993లో గ్రాడ్యుయేషన్ తర్వాత పిచ్చై యు.ఎస్. చేరుకున్నారు. అప్పట్లో స్టాన్‌ఫోర్డ్ యూనివర్సిటీలో పి.హెచ్.డి. చేద్దామనుకున్నారు. కానీ విరమించుకుని ఓ కంపెనీలో ఇంజనీర్ ప్రొడక్ట్ మేనేజర్‌గా చేరారు. ఆ తర్వాత ఎం.బి.ఏ చేసి మేనేజ్‌మెంట్ కన్సల్టెంట్‌గా చేరారు. సక్సెస్ కోసం తపించే ఆ రోజుల్లోనే తన గాళ్‌ఫ్రెండ్ అంజలిని పెళ్ళాడారు.*

*2004లో గూగుల్‌లో చేరారు. గూగుల్‌సంస్థ జి-మెయిల్ ప్రారంభించిన సంవత్సరం అది. సుందర్‌కి అక్కడ తొలి సక్సెస్ డ్రూమ్స్ బే సిస్టంలో వచ్చింది. 2006 గూగుల్ టూల్‌బార్‌ను పి.సి.లోనే ఇన్‌స్టాల్ చేయడంలో కృషి చేశారాయన. ఆ తర్వాత 'గూగుల్ క్రోమ్' ఆవిష్కరణలో ప్రధాన పాత్ర పోషించారు. 2008లో ప్రొడక్ట్ డెవలప్‌మెంట్ వైస్‌ప్రెసిడెంట్‌గా పదోన్నతి పొందాక, క్రమంగా గూగుల్ ప్రెజెంటేషన్స్‌లో తన ర్యాంకు పెంచుకున్నారు. 2012లో సీనియర్ వైస్‌ప్రెసిడెంట్ బాధ్యతలు తీసుకుని తక్కువ సమయంలో ప్రొడక్ట్ హెడ్ అయ్యారు. ఆ తర్వాత 2015లో సి.ఇ.ఓ. అయ్యారు.*

*నేటి యువతకు ఆదర్శం సుందర్ పిచ్చై. అవకాశాన్ని అందిపుచ్చుకుని, విలక్షణమైన ఆలోచన లుంటే ఉన్నతస్థితికి చేరుకోవచ్చని నిరూపించిన విజేత. ఆయన నెలజీతం 25 కోట్ల 16 లక్షలు.*

### మేధస్సే తేజస్సు

మనిషిలో జనించే ఆలోచనావిలక్షణతకు, ఏదో అదృశ్యశక్తి ఆ ఆలోచనా మూలాలకి ఫ్లాష్‌లా ఐడియా అందిస్తుంది. అది అంతవరకే. దానిని కార్యాచరణలో పెట్టినప్పుడే మేధస్సుకి తేజస్సు లభిస్తుంది.

అమ్మచేతివంటలో కమ్మదనం, ఆప్యాయత కన్పిస్తాయి. కానీ, దానికి కారణమైన ప్రకృతి అందించే కాయగూరలు, అందులోవాడే దినుసుల్లో నిక్షిప్తమైన రుచిగురించి ఆలోచించం. అదే అదృశ్యశక్తి.

### విలక్షణంగా ఆలోచించాలంటే

* నీ ఆలోచనల్ని ఒకచోట పరిమితం చెయ్యకు. 'తర్వాత ఏమిటి?' అన్నదే నీలోని విభిన్నతని వెలికితీస్తుంది.
* నీ ఆలోచనలు కార్యాచరణలో దూసుకుపోవాలంటే, నీచుట్టూ ఉన్నవాళ్ళలోకి ఆ ఆలోచనల్ని ప్రవేశ పెట్టగలగాలి.
* నీ ఆలోచనలే నీకు ముఖ్యంగా కన్పించాలి. నిరంతరం జ్వలింప చెయ్యాలి.
* నీ ఆలోచనలు వెలుగు చూడాలంటే, ముందు నిన్ను నువ్వు నమ్మాలి. నమ్మినదానికి ఎంత విభిన్నంగా కార్యరూపం ఇవ్వగలిగితే అంతత్వరగా విజయాన్ని అందుకోగలవు.
* నీ ఆలోచనల వెనుక మానసికబలం దండిగా ఉన్నప్పుడే విజయం సాధించగలవు.
* నీ ఆలోచనలకు అడ్డుపడే ఏ సమస్యా నిరంతరమైనది కాదు. అది నీకెదురయ్యే ఓ పరీక్ష మాత్రమే.
* నీ ఆలోచనలకు, నీకు నువ్వే రోల్‌మోడల్ కావాలి. ఇదే ప్రతిదశలోనూ, దిశా నిర్దేశం చేస్తుంది. ముందువరుసలో నిలబడాలంటే, అక్కడిదాకా నువ్వే నడిచి వెళ్ళాలి.
* విలక్షణంగా ఆలోచించేవారి 'విజయాలు' చరిత్రలో శాశ్వతంగా, చిరస్థాయిగా నిలిచి పోతాయి.







(10)

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**మరునాడు బ్యాంకులోకి అడుగు పెట్టగానే నా కళ్ళు రాగిణి కోసం వెతికాయి. నిన్న మేమిద్దరం విడిపోయినప్పటి నుండి ఫోన్ ఆపేసి ఉంది. ఆఫీసులో నాకు రాగిణి కనిపించలేదు. నేను కంగారు పడ్డాను. 'ఏమై ఉంటుందబ్బా?' అని ఆలోచనలో పడ్డాను.**

**జేబులో పెట్టుకున్న మల్లెపూల దండలా, నిన్నటి వలపు పరిమళాలు నాలో ఇంకా గుబాళిస్తూనే ఉన్నాయి. ఎంతో ఆశతో వచ్చిన నేను ఉస్సూరుమంటూ నా సెక్షన్లోకి నడిచాను.**

ఇప్పుడు నేను ఆ సెక్షన్‌కు మేనేజర్‌ను.

నాతో పాటూ ఇద్దరు స్కేల్ వన్ ఆఫీసర్లు, ఒక స్టెనో, ఒక క్లర్క్ కం టైపిస్ట్, ఒక అటెండర్ పని చేస్తారు.

నా పనేమిటంటే మా జోనల్ ఆఫీస్ పరిధిలో ఉన్న బ్రాంచుల నుండి ఋణాల కోసం వచ్చే ప్రతిపాదనలను క్షుణ్ణంగా పరిశీలించి నిబంధనలకు అనుగుణంగా, సరైన సెక్యూరిటీలు ఉన్నాయో లేవో చూసుకుని, వారి CIBIL స్కోర్ పరిశీలించి అన్నీ సరిగ్గా ఉన్నట్టయితే ఆ లోన్ ఇవ్వవచ్చని బ్రాంచులకు అనుమతి ఇవ్వడం. అఫ్‌కోర్స్, నేను ఆ లోన్ ప్రపోజల్‌ను నా రికమెండేషన్‌తో జోనల్ మేనేజరుకు పుటప్ చేస్తే ఆయన దాన్ని శాంక్షన్ చేస్తాడు.

బ్యాంకు వ్యవహారాలన్నీ మిగతా డిపార్ట్‌మెంట్లలో, ఒక నిర్ణీత పద్ధతిలో, ఒక టైం ఫ్రేములో, ఎవరి ప్రమేయం, జోక్యం లేకుండా, సాధారణంగా జరిగిపోతుంటాయి. ఆ పనులన్నింటినీ హెడ్డాఫీసు వారు, ఇంటర్నల్, ఎక్స్‌టర్నల్ ఆడిటర్లు వేయి కళ్ళతో పర్యవేక్షిస్తుంటారు.

కానీ, లోన్ డిపార్ట్‌మెంట్‌లో మాత్రం బ్రాంచ్ మేనేజర్లకు, జోనల్ ఆఫీసుకు, జోనల్ మేనేజరుకు విపరీతమైన విచక్షణాధికారాలు (Discretionary Powers) ఉంటాయి. అందుకే ప్రపంచంలో ఏ బ్యాంకులో జరగనన్ని మోసాలు మా బ్యాంకు లోన్ డిపార్ట్‌మెంట్‌లో జరుగుతున్నాయని నాకు ముందే తెలుసు.

అట్లాంటి పవర్‌ఫుల్ సెక్షన్‌కు నన్ను మేనేజర్‌గా ఊహించుకుంటేనే జోనల్ మేనేజర్, బ్రాంచి మేనేజర్లు, ముఖ్యంగా యూనియన్ లీడర్ల గుండెల్లో రాళ్ళు పడ్డాయి. నేను అగ్రికల్చరల్ లోన్ల విషయంలో హెడ్డాఫీసుకు పంపిన రిపోర్టు, దాని ఫలితంగా అనేకమంది మేనేజర్లకు ఛార్జ్ మెమోలు జారీ అయిన విషయం ఇంకా వారి మనసుల్లో తాజాగానే ఉంది.

నేను నా సెక్షన్‌కు చేరుకోగానే టీపీరావు అనే స్కేల్ వన్ ఆఫీసర్ పరిచయం చేసుకున్నాడు. అతనితో అంతకు ముందే ముఖ పరిచయం ఉంది. డిపార్ట్‌మెంట్‌లో చాలా సీనియర్.

"సార్! మీరు జోనల్ మేనేజర్ గారిని కలిసి వస్తే, పని ప్రారంభిద్దాం" అన్నాడు.

"ఎందుకు?" అని ప్రశ్నించాను.

అప్పటికే నా గురించి అందరికీ తెలిసిన విషయమే కాబట్టి ఆయన పెద్దగా విస్తుపోలేదు. కొత్త సెక్షన్ మేనేజర్‌గా, అదీ ప్రమోషన్ మీద, ఛార్జ్ తీసుకోబోయే ముందు జోనల్ మేనేజర్‌ను కలిసి ఆశీర్వచనాలు తీసుకోవడం సంప్రదాయం. కానీ, అంతకు ముందురోజు జరిగిన ఉదంతం దృష్ట్యా నేను ఆయనను కలవదలుచుకోలేదు.

ఆయన ఒక్క క్షణం నన్ను ఆశ్చర్యంగా చూసి, "యువర్ విష్!" అన్నాడు.

ఆ రోజంతా అతనే నాకు మా డిపార్ట్‌మెంట్ గురించి విపులంగా, విడమరిచి చెప్పారు.

నేను కొత్తగా లోన్ సెక్షన్ మేనేజర్‌గా పదవీ బాధ్యతలు తీసుకోబోయేముందు జోనల్ మేనేజర్‌ను కలవలేదన్న విషయం అప్పటికే సంచలన వార్త అయిపోయింది.

ఇద్దరం కలిసి బయటికెళ్ళి లంచ్ చేద్దామని ప్రపోజ్ చేశాను. టీపీరావు 'అమెరికన్ సిస్టం ఆఫ్ పేమెంట్' అయితేనే వస్తానన్నాడు.

'అంటే ఏం లేదు. ఎవరు తిన్న దానికి వారే బిల్లు చెల్లించడం'



### జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పనిచేసే ఆ అధికారి, మాకనూరులో జరిగిన బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. ఆ సందర్భంగా ఏర్పాటు చేసిన పార్టీలో రామస్వామిని చూసి, గతంలోకి జారిపోతాడు. కష్టపడి బ్యాంకులో ఉద్యోగం సంపాదిస్తాడతను. ఏ డిపార్ట్‌మెంట్‌లో వేసినా, అక్కడ జరిగే లొసుగులను బయటకు లాగుతుంటాడు. స్కేల్ టూ ఆఫీసర్‌గా అతనికి ప్రమోషన్ వస్తుంది. ఆ విషయం జోనల్ మేనేజర్‌కు మింగుడుపడదు. స్టెనో ఆఫీసర్ రాగిణి అతణ్ణి ఆకర్షిస్తుంది.

ఆ తర్వాత...

నేను సరేనన్నాను.

భోజనం చేస్తున్నప్పుడు టీపీరావు చాలా విష యాలు చెప్పాడు.

టీపీరావు గారు వయసులో నా కన్నా చాలా పెద్దవాడు. క్లరికల్ స్థాయి నుండి ప్రమోషన్ మీద స్కేల్ వన్ ఆఫీసర్ అయ్యాడు. నాలాగే నిజాయితీ పరుడు. కానీ, ఎవ్వరినీ ఎదిరించే ధైర్యం లేక, అవి నీతికి పాల్పడలేక రిటైర్‌మెంట్ వయసు దగ్గరకు వచ్చినా స్కేల్ వన్ హోదాలోనే మిగిలిపోయాడు. బ్యాంకులో క్షీణిస్తున్న విలువల గురించీ, మా డిపా ర్ట్‌మెంట్‌లో జరుగుతున్న మోసాల గురించీ చెప్పి బాధపడ్డాడు. 'వీటన్నింటికీ మౌనసాక్షిగా మిగిలానే తప్ప మీ లాగా ఎదిరించే ధైర్యం చేయలేని అశక్తుణ్ణి'ని మొర పెట్టుకున్నాడు.

"మరి నాతో బయటకు వచ్చారు. భయం లేదా!" అని అడిగాను.

"నన్నెవ్వరూ టచ్ చెయ్యరు సార్! ముందు ముందు మీకే తెలుస్తుంది నేనేమిటో!" అన్నాడు నవ్వుతూ. నవ్వితే పసిపిల్లాడు నవ్వినట్టుంది.

కానీ, ఒకే ఆఫీసులో పని చేస్తున్నాం కాబట్టి అప్పటికే ఆయన గురించి నాకు కొంచెం తెలుసు. టీపీరావుగారు కాలిక్యులేషన్స్‌లో ఉద్ధండుడు. ఇప్పు డంటే కాలిక్యులేటర్లూ, కంప్యూటర్లూ వచ్చాయి గానీ అవన్నీ లేని కాలంలోనే ఆయన కంటిచూపు తోనే ముప్పై నలభై వరసలున్న లెక్కలో కూడిక ఎక్కడ తప్పిందో చెప్పేవాడట.

ఆయన లోన్ డిపార్ట్‌మెంట్‌లో ఆఫీసర్ అయినా ఆయనకు బ్యాంకులోని అన్ని డిపార్ట్‌మెంట్లకు సంబంధించిన ప్రతీ సర్క్యులర్ కంఠోపాఠం. నోటి మీదనే ఏ సర్క్యులర్ గురించైనా చెప్పేయగలరు. ఆయన సలహా కోసం, రాష్ట్రం మొత్తం నుండే కాకుండా ఆయనకు పరిచయముండి, ప్రస్తుతం దేశ విదేశాల్లో బ్యాంకులో పనిచేస్తున్న జనరల్ మేనేజర్ క్యాడర్ నుండి అటెండర్ క్యాడర్ వరకు, వాళ్ళే కాకుండా అనేక మంది కస్టమర్లు కూడా ఫోన్ చేస్తుంటారు. ఆయన ఫోన్ ఉదయం ఆరింటి నుండి రాత్రి తొమ్మిదింటి వరకూ నిత్యం మోగు తూనే ఉంటుంది. ఫోన్ స్విచాఫ్ అని వచ్చిందంటే, ఆయన బాత్రూంలోనో, పూజ రూములోనో, లంచ్ రూములోనో ఉన్నట్టు లెక్క. తిరిగి ఫోన్ ఆన్ అయి తేనే, బ్యాంక్ వాళ్ళు ఊపిరి పీల్చుకుంటారు.

పాటించాల్సిన రూల్స్ గురించీ చెబుతాడు. చేయకూడని పనుల గురించీ, సామాన్యంగా తెలి యక చేసే పొరపాట్ల గురించి కూడా చెబుతాడు. వాటి అమలు విషయం ఎదుటివాళ్ళకు వదిలేస్తాడు. ఎవ్వరి దగ్గరి నుంచి రూపాయి ప్రతిఫలం ఆశించడు.

మనిషి కూడా చూడ్డానికి తెల్లగా నెరిసిన జుట్టుతో, నల్లటి మందపాటి కళ్ళద్దాలతో, బక్క పలుచగా, పచ్చటి ఒంటిరంగుతో, ఇస్త్రీ చేయని, ముడుతలు పడిన చొక్కానే మోచేతుల వరకు మడిచి టక్ చేసుకుని పవిత్రంగా, ఒక చిన్నపాటి దేవ దూతలా అనిపిస్తాడు. ఎవరు పలకరించినా నవ్వుతూ మాట్లాడతాడు.

ఆయన పిల్లలిద్దరూ అమెరికాలో సెటిల య్యారు. రోజంతా ఫోన్ మాట్లాడటంతో కుడి చెవికి వినికిడి శక్తి తగ్గిపోయింది. హియరింగ్ మిషన్ పెట్టుకుంటున్నాడు. పిల్లలు కోప్ప డ్డంతో ఇప్పుడిప్పుడే హెడ్‌ఫోన్స్ వాడుతు న్నాడు.

మొత్తానికి ఆయన నాకు బాగా నచ్చాడు. ఈ కాంక్రీట్ జంగిల్‌లో, మానవ ముసుగు ధరించి సంచరిస్తున్న ఈ మృగాల బ్యాంకు కీకారణ్యంలో, ఒకరిద్దరు మానవతా మూర్తులుండడం, వారు – రాగిణి, టీపీరావుగారు నాకు పరిచయం కావడం నా అదృష్టం.

చిత్రంగా వాళ్ళిద్దరూ నన్ను హీరోగా భావిస్తున్నారు. కానీ, నేను మాత్రం వాళ్ళ లాంటి వారి వల్లే ఈ మాత్రం పనైనా చేయ గలుగుతున్నాను.

****

ఆనాటి నుంచే, 'ఆలస్యం అమృతం విషం' అనుకుని, లంచ్ నుండి రాగానే రంగంలోకి దిగాను.

లోన్ సెక్షన్ అధికారిగా, బ్రాంచ్ మేనే జర్లకు కొన్ని సర్క్యులర్స్ నేరుగా జారీ చేసే అధికారం నాకు సంక్రమిస్తుంది. వాటికి, అవి విధాన నిర్ణయాలు కానంత వరకూ, పై అధికారుల పర్మిషన్ అవసరం లేదు.

మొదటి సర్క్యులర్‌లో ఇక నుంచి ప్రతీ ప్రపోజల్ పకడ్బందీగా, అన్ని సపోర్టింగ్ డాక్యుమెంట్లతో పంపాలని లేకపోతే నిర్ల క్ష్యంగా వ్యవహరించి, విలువైన బ్యాంక్



సమయం వృథా చేసినందుకు గాను సంజాయిషీ కోరబడుతుందని ఆజ్ఞలు జారీచేశాను.

రూల్సుకు విరుద్ధంగా ఉన్న అన్ని ప్రపోజల్సును వెంటనే ఆయా బ్రాంచులకు వాపసు పంపించేయ మని మా స్టాఫుకు ఉత్తర్వులు ఇచ్చాను.

తరువాత 'నాకు ముట్టలేదూ, నేను చూడ లేదూ' అనే సాకు చూపించి తప్పించుకోవడానికి వీలు లేకుండా ఉత్తర్వులన్నీ, రాతకోతలన్నీ ఆన్ లైనులోనే మేనేజర్ పర్సనల్ పోర్టల్‌లోనే జారీ చేయాలని చెప్పాను.

అందుకు కారణం ఏమిటంటే, నేను పరిశీలిం చిన పెద్ద మొత్తం లోన్ ఫైళ్ళన్నీ లోప భూయిష్టం గానే ఉన్నాయి. రాష్ట్రంలోని దొంగ వెధవలంతా మా జోనల్ మేనేజరుకు క్లోజ్ ఫ్రెండ్సే అన్నట్టుగా ఉన్నాయి ఫైల్స్ అన్నీ.

అవన్నీ, ఫైళ్ళన్నీ ఇన్‌కంప్లీట్‌గా ఉండడంతో, ఇచ్చిన లోన్లను రికవరీ చేయడంలో ఇబ్బందులు ఎదురయ్యాయి. అందుకే, లోన్ రికవరీ అంటే తీసు కున్న ఋణాల వసూలులో, దేశం మొత్తం మీద మా జోనల్ ఆఫీసే అట్టడుగు స్థాయిలో ఉంది.

ఇక కారణాలు అన్వేషించడం మొదలు పెట్టాను.

పెద్దగా కష్టపడాల్సిన పని లేకుండానే, తీగె లాగగలిగాను.

సింపుల్‌గా చెప్పాలంటే, కమర్షియల్ ఋణా లను మంజూరు చేయాలంటే, ఋణమొత్తం కన్నా రెండింతలు లేదా అంతకన్నా ఎక్కువ విలువ గలి గిన ఆస్తులు తనఖా పెట్టుకుని బ్యాంకు ఋణం మంజూరు చేస్తుంది. ఎందుకంటే, ఒకవేళ లోన్ డిఫాల్ట్ అయ్యి, అంటే, వాయిదాలను సకాలంలో చెల్లించకపోతే, బ్యాంకు తను ఇచ్చిన సొమ్మును, వడ్డీతో సహా రికవరీ చేసుకోవడానికి వీలుగా ఆస్తు లను తనఖా పెట్టుకుంటారు.

నేను చూసిన చాలా ఫైళ్ళలో ఇవన్నీ ఉల్లం ఘించారు. ఏ ఫైల్లోనూ లీగల్ ఒపీనియన్లు సరిగ్గా లేవు; ప్రభుత్వ ధృవపత్రాలు లేవు; సిబిల్(CIBIL) రిపోర్టులు లేవు; మా సెక్షన్ మేనేజర్ ఇచ్చిన ఫీజి బిలిటీ రిపోర్టులు లేవు. చివరి పేజీలో మాత్రం లోన్ శాంక్షన్ అయినట్టుగా లెటర్ ఉంది. తరువాత ఆ లోను అతీగతీ, రికవరీ సంగతి, పట్టించుకున్న నాథుడే లేడు.

ఒక ఫైల్లో అయితే, 'జెడ్. ఎం గారి ఉత్తర్వుల ప్రకారం లోన్ మంజూరు చేయబడింది' అని ఉంది. లోన్ మొత్తం పన్నెండు కోట్లు. వెంటనే, ఆ మేనేజ రుకు, 'జెడ్‌ఎం గారి ఉత్తర్వులను' మెయిల్ చేయ మని చెప్పాను. అటువంటి రాతపూర్వక ఉత్తర్వులు ఉండవని నాకు తెలుసు.

డొంక కదలడం మొదలైంది.

ఆ మేనేజర్ కంగారు పడ్డాడు.

"జెడ్‌ఎం గారు చెబితే ఇచ్చామని అందులో రాశాను కదా సార్!" అని నాకు ఫోన్ చేశాడు.

"జెడ్‌ఎం గారు చెప్పారని మీరు రాసుకుంటే సరిపోదు కదా సార్! రేపు ఆడిటర్లకు మేము ఏం సమాధానం చెప్పాలి? అందుకే జెడ్‌ఎం గారు మీకు ఇచ్చిన ఆర్డర్స్ పంపించండి సార్!" అని నేను కూల్ గా చెప్పాను.

"ఆయన రాతపూర్వకంగా ఇవ్వలేదు సార్!" అన్నాడు.

"అయితే, జెడ్‌ఎం గారి రిటెన్ ఆర్డర్స్, ఇప్పుడు తీసుకుని, ఫైల్ బిల్డప్ చేసి రెండు రోజుల్లో స్పెషల్ మెసెంజర్ ద్వారా నాకు పంపించండి. ఓకేనా సార్!" అన్నాను కూల్‌గా. రెండు రోజుల్లో రాకపోతే మూడో రోజు ఉదయం మెమో వెళ్తుందన్న అజ్ఞాత సందేశం కూడా ఉంది నా మాటల్లో.

అయితే, బ్యాంకుకు చాలామంది విలువైన కస్ట మర్లు ఉంటారు. వాళ్ళ డిపాజిట్లు మా దగ్గర మూలుగుతుంటాయి. వాళ్ళకు అర్జెంటుగా డబ్బులు అవసరమయితే, అన్ని పద్ధతులను పక్కన పెట్టి, వారికి మేము సేవ చేయాల్సిందే, క్షణాల మీద లోను మంజూరు చేయాల్సిందే. మేనేజర్లకీ, జోనల్ మేనేజర్లకూ ఆ విచక్షణాధికారాలు ఉంటాయి. ముందు లోన్ డిస్బర్స్ చేసిన తర్వాత ఫైల్ బిల్డప్ చేసుకుంటారు. ఎందుకంటే వాళ్ళకు లోన్ ఇవ్వడం వల్ల బ్యాంకుకు లాభమే కానీ నష్టం లేదు కాబట్టి.

కానీ, ఇక్కడ అలా కాదు. ఏదో మతలబు జరి గింది.

నిజానికి ఆ మేనేజర్ నా కన్నా చాలా సీని యర్. నేను స్కేల్ టూ అయితే ఆయన స్కేల్ ఫోర్.

**అన్యమనస్కంగా ఉన్నాడతను. మనసంతా చికాకుగా ఉంది. విలువైనదేదో పోగొట్టు కున్నట్టు మనసు విలవిల లాడుతోంది. దేని కోసమో వెతుక్కుంటోంది. కళ్ళముందు ఫైళ్ళున్నా, దృష్టి మాత్రం పదేపదే ఆ సీటువైపే మళ్ళు తోంది. ఇక నిలువలేదతను. ఆత్రుతగా, ఆరాటంగా బయలుదేరాడు. చేరాల్సిన చోటికి చేరాడు. అసలతను ఎక్కడికి చేరాడు? అతని మనసు అంతలా చికాకు పడటానికి కారణం ఏమిటి?**

కానీ, తప్పు చేశాడు కాబట్టి కంగారు పడ్డాడు.

అతను మా ఆఫీసర్స్ యూనియన్ మెంబరే. కానీ, దానివల్ల నా పనిలో, నా బాధ్యతలో తేడా ఏమీ ఉండదు నాకు. అసలు నేను ఎవరు ఏ యూనియన్ మెంబర్ అన్న విషయమే పట్టించు కోను.

కానీ, నాకు వెంటనే,

"ఆ లోన్ విషయం చూసీ చూడనట్టు వదిలేయ మని" మా యూనియన్ ప్రెసిడెంట్ నుండి ఫోన్ వచ్చింది.

నేను కుదరదన్నాను.

యూనియన్ ప్రెసిడెంట్ అగ్గిమీద గుగ్గిల మయ్యాడు.

తన మెంబరు ఎవరైనా తప్పు చేస్తే ఆ తప్పును సరిదిద్దాల్సింది పోయి, తప్పును ఎత్తి చూపే వాడి మీద, అంటే నా మీద మండిపడ్డాడు.

'బట్, ఐ డోంట్ కేర్' అనుకున్నాను ఫోన్ పెట్టేసి.

ఆ వార్త కార్చిచ్చులా వ్యాపించింది. మా జెడ్‌ఎం సైతం మా యూనియన్ ప్రెసిడెంటు చెపితే కాద నడు.

మా యూనియన్ ప్రెసిడెంట్ తన దయాదాక్షి ణ్యాలపైనే బ్యాంకు నడుస్తున్నదన్నంత బిల్డప్ ఇస్తాడు. దానికి జోనల్ మేనేజర్ గంగిరెద్దులా తలూపుతాడు. కానీ, అది నిజం కాదన్నట్టుగా నేను అడ్డంగా నిలబడ్డాను.

అందుకే, ఆయన కోరికను నేను నిరాకరించే సరికి ప్రతీకార జ్వాలలు చెలరేగాయి.

టీపీరావుగారు కూడా,

"అంత నిర్మొహమాటంగా చెప్పాల్సింది కాదు" అని అన్నారు.

నేను నవ్వాను.

సంధించిన మొట్టమొదటి బాణాన్నే వెనక్కు తీసుకుంటే, ముందు జరగబోయే యుద్ధంలో మన మెలా గెలుస్తాం! సమరశంఖం పూరించగానే తుస్సుమనే ధ్వని వస్తే అది సమరనినాదం ఎలా అవుతుంది?

నా యుద్ధ తంత్రం వేరు.

నా యుద్ధ లక్ష్యం వేరు.

****

ఆ రోజంతా ఆఫీసులో బిజీగానే ఉన్నా, మన సంతా రాగిణి మీదే ఉంది. ఏదో మరచిపోయి



నట్టూ, ఏదో పోగొట్టుకున్నట్టూ, మనసు దేన్నో పదే పదే వెతుక్కుంటోంది. రాగిణి కూర్చునే సీట్ వైపే మాటిమాటికీ నా చూపు మళ్ళుతోంది.

'ఏమై ఉంటుందబ్బా?' అని ఆలోచిస్తూనే బ్యాంకులో ముళ్ళమీద కూర్చున్నట్టుగా కూర్చుని, సాయంత్రం ఆరు కాగానే వెళ్ళడానికి లేచాను.

మా సెక్షన్‌లో అందరూ నన్ను ఆశ్చర్యంగా చూశారు.

"అదేంటి సార్? జెడ్ఎంగారు ఇంకా బ్యాంకులో ఉండగానే మీరెలా వెళ్తారు? లోకల్ బ్రాంచుల మేనేజర్లంతా, లోన్ ప్రపోజల్స్ పట్టుకుని ఇప్పుడే వస్తారు. అన్ని విషయాలు ఇప్పుడే ఫైనలైజ్ అవుతాయి." అన్నారు టీపీరావుగారు.

'అన్ని' అన్న పదం కాస్త వ్యంగ్యంగా పలికిన ట్టనిపించింది.

"ఈ రోజైతే నేను పని చేయలేను సార్! ఏమైనా ముఖ్యమైన విషయాలుంటే మీరు నోట్ చేసుకోండి!" అని చెప్పి బయటకు నడిచాను.

ఒకప్పటి బ్యాంకుల సంగతేమో కానీ, ఇప్పుడైతే, బ్యాంకు మేనేజర్లు, ఆఫీసర్లు గాడిద చాకిరీ చేస్తున్నారు. ప్రతీ రోజు రాత్రి ఇంటికి చేరేసరికి తొమ్మిదీ పదీ పై మాటే. బ్రాంచుల్లో అయితే డే-ఎండ్ రిపోర్టు పంపడం, క్యాష్ టాలీ కావడం వంటి సవాలక్ష తిరకాసులుంటాయి.

అవార్డు స్టాఫ్ మెంబర్స్‌కి ఈ బాదరబందీ ఏమీ ఉండదు. ఠంచనుగా ఐదు కొట్టగానే, వీలైతే ఇంకా ముందుగానే, వాళ్ళ సీట్ పని పూర్తి కాగానే, వెళ్ళి పోతారు.

ఈ విషయాలన్నీ నాకు తెలుసు. రేపటినుంచి నేను కూడా ఆఫీసునుండి జెడ్ఎం బయలుదేరి వెళ్ళే వరకు బ్యాంకులో ఉండాల్సిందే.

## లాకర్ నెం.369

### కూపన్ నెం.6 విజేత

**ఎ. వెంకట్‌రెడ్డి**

**కాజీపేట, వరంగల్ జిల్లా**

కానీ, ఈ రోజు మాత్రం వెళ్ళి తీరాలి. రాగిణి బ్యాంకుకు ఎందుకు రాలేదో తెలుసుకునే వరకు నా మనసు మనసులో నిలవడం లేదు.

నేనెప్పుడూ రాగిణి వాళ్ళింటికి వెళ్ళలేదు.

కానీ, నిన్నటి వలపు గంధం ఇగిరిపోకముందే రాగిణిని చూడాలని మనసు తహతహలాడు తోంది. ఇవ్వాళ రోజంతా, నేను ఏమరుపాటుగా ఉన్న ఏ క్షణంలోనో రాగిణి వచ్చి పక్కన కూర్చుని చటుక్కున ముద్దు పెడుతుందేమోనన్న ఆలోచన నన్ను ఒక్కచోట నిలవనీయలేదు.

గాంధీనగర్‌లో ఉన్న రాగిణి వాళ్ళ అపార్ట్‌మెంట్ ముందు బైక్ పార్క్ చేసి లోపలికి నడిచాను. తనుండే ఫ్లాట్ మూడో ఫ్లోర్‌లో ఉంది.

'రాగిణి ఏ విధంగా రిసీవ్ చేసుకుంటుంది? ఆమె ఇంట్లో వాళ్ళు ఏమనుకుంటారు? తిరిగి వెళ్ళి పోదామా?' అన్న ఆలోచనలు ముసురుకుంటుంటే, కొంచెం భయంగానే మెట్లెక్క సాగాను.

అప్పుడే సన్నటి జల్లు పడి, ఆగిపోయింది. అపార్ట్‌మెంట్ చుట్టూ పెంచిన చెట్లు వర్షంలో తడిచి, ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర వెలిగిన ఆకుపచ్చ లైట్లలా మెరిసిపోతూ, నన్ను ముందుకే వెళ్ళమని ప్రోత్సహిస్తున్నట్టుగా తలలూపుతున్నాయి.

ట్రాఫిక్ జంక్షన్‌లో, కొన్ని సెకండ్ల పాటే గ్రీన్ సిగ్నల్ ఉంటుంది. నిర్ణీత టైం దగ్గర పడుతున్న కొద్దీ చకచకా ఐదు, నాలుగు, మూడు, రెండు, ఒకటి సెకన్ల అంకెలు ఫ్లికర్ అవుతూ చివరకు రెడ్ లైట్ పడుతుంది. ఈ లోపలే సిగ్నల్ దాటాలి. ఒక్క క్షణం సంకోచించినా రెడ్ సిగ్నల్ పడుతుంది.

అలాగే, నేను ఇప్పుడు సంకోచిస్తే, నా ధైర్యానికి రెడ్ సిగ్నల్ పడితే మళ్ళీ నేను ఆ మెట్లెక్కలేను. 'పిరికి' రెడ్ లైట్ పడేలోగానే నేను సిగ్నల్ దాటాలి. లేదా, ఇక శాశ్వతంగా నా ప్రేమ జంక్షన్‌లో రెడ్ లైటే వెలుగుతూ ఉంటుంది.

అందుకే మనసులో వెలిగిన ఆకుపచ్చ లైట్ మారిపోయే లోగానే, పరుగుపరుగున మెట్లెక్కి తలుపు ముందు నిలబడి మరో 'పిరికి' ఆలోచన వచ్చే లోపున డోర్ బెల్ బటన్ నొక్కాను.

లోపలెక్కడో సంగీత తరంగంలా బెల్లు మోగింది. మరుక్షణంలో తలుపు తెరుచుకుంది.

---

**ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## లాకర్ నెం. 369-8 (16-8-2017)

మా ప్రశ్న: సెక్షన్‌కి చేరుకోగానే అతన్ని ఎవరు కలిశారు?

మీ జవాబు----------------------------------------------------------------------

చిరునామా----------------------------------------------------------------------

-------------------------------------------------------------------------------

-----------------------------------పిన్-----------------------ఫోన్‌నెం-----------------------

**ఈ కూపన్‌ను 15 ఆగస్టు 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33



*నిబంధనలు వర్తిస్తాయి

ఎదురుగా రాగిణి.

నన్ను చూసి తను సంభ్రమాశ్చర్యాలకు గురైతే, నేను తనను చూసి ఆనందంలో మునక లేశాను.

రాగిణి వేసుకున్న డ్రెస్ చూసి ఫక్కున నవ్వాను. ఆఫీసులో ఎంతో పద్ధతిగా నిండు చీరతో, పొడుగాటి చేతుల జాకెట్‌తో ఒద్దికగా ఉండే రాగిణి... ఇంట్లో, టీ షర్ట్లు, త్రీ ఫోర్త్ పొడవుండే బెర్ముడా వేసుకుని ఉంది. గబుక్కున చూస్తే ఎవరో చిన్న పాపలా ఉంది. కారిడార్‌లో వేసిన లైటు కిరణ మొకటి ఆమె ముఖం మీద పడి ముక్కుపుడకలోని రవ్వ మెరిసింది.

ఇద్దరమూ ఆశ్చర్యంలోనే ఉండిపోయాం. కొంత సేపటికి నేనే తేరుకుని,

"కనీసం ఇంట్లోకి రమ్మని కూడా అనడం లేదు?" అని ప్రశ్నించాను.

"ఏయ్? ఇంటికెందుకు వచ్చావ్? అసలే ఇంట్లో ఎవరూ లేరు, తెల్సా?" అంది కంగారుగా.

"వావ్! అయితే కరెక్ట్ టైముకే వచ్చానన్న మాట!" అంటూ తనను తోసుకుంటూ లోపలికి నడిచాను. హెల్మెట్ పక్కన పడేసి సోఫాలో రిలాక్స్‌డ్‌గా కూర్చు న్నాను.

"ఏయ్! అరే! ఏమిటిది?" అంది కోపం నటిస్తూ.

కానీ, నేనొచ్చినందుకు ఆమె కళ్ళల్లో మెరు పులు, బుగ్గల్లో సిగ్గులు మొగ్గ తొడగడం నేను గమనించలేదనుకుంది. అందుకే, నేను అదేమీ పట్టించుకోకుండా,

"బ్యాంకుకు రాలేదెందుకు?" అని ప్రశ్నించాను.

"ఆరోగ్యం బాగో లేదు" అంది బుంగమూతి పెడుతూ.

తనకు తెలుగు బాగానే వచ్చినా అప్పుడప్పుడు ఆమె మాట్లాడే మాటల్లో తమిళయాస తొంగి చూస్తుంది. ఇప్పుడు కూడా అంతే. 'ఆరోగ్యం బాగో లేదు' అన్న మాటలు తమిళ యాసతో ముద్దు ముద్దుగా అంది.




"ఏమైంది? జ్వరమా?" అన్నాను సోఫాలో నుంచి లేచి నుదుటి మీద చెయ్యి వేస్తూ.

'నిన్న'కు ముందైతే ఆ సాహసం చేసి ఉండక పోయే వాణ్ణి. కానీ, నిన్నటి నుంచి మా ఇద్దరి మధ్య ఒక అనురాగ బంధం ఏర్పడి ఆ మాత్రం చొరవ తీసుకునే ధైర్యాన్ని ఇచ్చింది.

"కాదు" అంది.

"మరి"

"ఛీ.... నేను చెప్పను పో!" అంది బుంగమూతి పెడుతూ.

అరసున్నా లాగా చుట్టిన ఆ పెదాలను కసు క్కున కొరకాలనిపించింది నాకు. నాకర్థమయ్యింది. తను నన్ను టీజ్ చేస్తోంది.

"చెప్పరా, బ్యాంకుకు ఎందుకు రాలేదు? నీ కోసం చూసి చూసి కళ్ళు కాయలు కాశాయి. అవి పండి రాలిపోతాయేమోనని నీ దగ్గరకు పరుగెత్తు కుంటూ వచ్చాను."

"అబ్బ, కవిత్వమా?"

"కాదు గానీ, చెప్పు! ఎందుకు రాలేదు?"

"నాకూ.... నాకు...." అంటూ సిగ్గు పడింది.

కొంపదీసి 'పెళ్ళిచూపులు జరిగాయని' చెబ్తుం దేమోనని నా గుండెలు పీచుపీచుమన్నాయి.

నేను దిగ్గున లేచి నిలబడ్డాను. "చెప్పు. నాన్చకు!" అన్నాను చిరాకుగా. ఒకవేళ పెళ్ళిచూపులని చెబితే వెంటనే వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను. నేను కసురుకునేసరికి రాగిణి చిన్నబుచ్చుకుంది.

"నాకూ... నాకు నిన్నటి మూడ్ నుండి బయ టకు రావాలన్పించడం లేదు. రాత్రంతా.... నీ ఆలో చనలతోనే నిద్ర పట్టలేదు. అందుకే పొద్దున్నంతా ముసుగు తన్ని పడుకున్నాను."

నేను మురిపెంగా తనను చూశాను.

"ఎందుకో నువ్వు తప్పకుండా నన్ను చూడ్డా నికి వస్తావని నా మనసు చెబుతూనే ఉంది."

"అమ్మదొంగా! ఒక్క క్షణం గుండెలు పీచుపీచు మన్నాయి తెలుసా?"

"ఏదీ, నిన్న నా గుండెలు కొట్టుకున్నట్టుగానా?" అంది కన్ను గీటుతూ.

'ఓ మై గాడ్! రాగిణి మస్తు రొమాంటిక్ మూడ్‌లో ఉంది' అని అనుకున్నాను.

"అవునూ! నిజంగానే ఇంట్లో ఎవరూ లేరా?" అని అడిగాను.

"అమ్మానాన్నా, తమ్ముడూ చెన్నై వెళ్ళారు, అక్కయ్య డెలివరీకి. అన్నయ్యకి నైట్ డ్యూటీ" అంది.

నేను ఒక్క క్షణం కూడా ఆగలేదు.

"అయితే నా నైట్ డ్యూటీ కూడా ఇక్కడే!" అన్నాను.

"ఎందుకు? కింద వాచ్‌మెన్ డ్యూటీ చేస్తావా?" అంది ఫక్కున నవ్వుతూ. నేనూ నవ్వి,

"అవును నైట్ వాచ్‌మన్. వాచింగ్ మై ఉమన్ యిన్ ది నైట్" అన్నాను కావాలనే కళ్ళు విలన్ లాగా పెట్టి.

రాగిణి నల్లటి టీ షర్టులో నుంచి పచ్చటి భుజాలు మెరుస్తున్నాయి. టైట్‌గా ఉన్న టీ షర్టు కావడంతో కొన్ని చోట్ల వంపులు తిరిగి ఉంది ఆమె శరీరం. అలాగే వేసుకున్న బెర్ముడా పరువాలను కాపాడలేకపోతోంది. కాళ్ళకు తొడిగిన బంగారు రంగు కాలిపట్టీలు ఆమె ఒంటి రంగులో కలిసిపో యాయి. జుట్టును పైకి దువ్వి ఏదో రబ్బర్ బ్యాండ్ పెట్టింది. నాకైతే కొత్త రాగిణిని, అంతవరకూ నాకు తెలియని కొత్త రాగిణిని చూస్తున్నట్టుగా ఉంది.

అందంగా డెకొరేట్ చేసి, బంగారు విద్యుత్ దీపాల వెలుతురులో అద్దాల షో కేస్‌లో ప్రదర్శనకు ఉంచిన కేకు ముక్కలా అనిపిస్తోంది. ఊరిస్తోంది.

"ఇదేంటీ? మొట్టమొదటి సారిగా అత్తగారిం టికి అల్లుడు గారొస్తే ఏం మర్యాదలు చేయరా? మర్యాదలు అటుంచి నాతో నైట్ వాచ్‌మన్ డ్యూటీ చేయిస్తానంటారా? ఇదేనా పద్ధతి?" అంటూ నా పక్కనే సోఫాలో కూర్చున్న రాగిణిని చూశాను.

"ఓయ్, ఓయ్! అల్లుడేంటీ? అత్తగారిల్లేంటీ? మేం తమిళ బ్రాహ్మిన్స్. నా మొగుడూ..." అంటూ కొంటెగా నవ్వింది.

నేను ఇక ఆపుకోలేక పోయాను. సోఫాలో కూర్చున్న తన పైకి వాలి,

"నీ మొగుణ్ణి నేనే. ఈ ఇంటికి అల్లుణ్ణి కూడా నేనే. ఇదే నా అత్తగారిల్లు తెలుసా?" అన్నాను.

రాగిణి ఒంటి నుండి వస్తున్న సువాసన ముక్కుపుటాలకు తియ్యగా తాకింది. అలా పడ డంతో నిన్నటి సీనే మళ్ళీ రిపీటయింది. రాగిణి గింజుకుంది.

"ఒక్క నిమిషం. ప్లీజ్, ఆగు..." అంటూ నన్ను విడిపించుకుని,

"వార్నీ! ఎన్నడా? ఇంటి తలుపు మూసి ఉందో లేదో కూడా చూసుకోవా అబ్బీ?" అంటూ మెయిన్ డోర్ మూసింది.

'అబ్బీ!' అనడం నాకు నవ్వు తెప్పించింది.

డోర్ మూయడం నాకు గ్రీన్ సిగ్నల్‌లా తోచింది. అది రెడ్‌లోకి మారక ముందే, రాగిణిని నా కౌగిలిలో బంధించాను.

**(ఇంకా వుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## హార్మోన్ సమస్యల నివారణకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ఈ మధ్యకాలంలో చాలామంది థైరాయిడ్, పీ.సి.ఓ.డి., సంతానలేమి మరియు డయాబెటిస్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలతో ఎక్కువగా బాధపడటం జరుగుతోంది. ఈ విధమైన ఆరోగ్య సమస్యలు హార్మోన్‌ల అసమతుల్యత వలన ఏర్పడతాయని చాలామందికి తెలియదు. ఇలాంటి అసమతుల్యతలు ఏర్పడటానికి కేవలం చిన్న కారణమైనా చాలు – అవి తీవ్రమైన దీర్ఘకాలిక వ్యాధులకు దారి తీస్తాయి. కాబట్టి వీటి పట్ల అవగాహన పెంచుకోవడం వలన ఇలాంటి వ్యాధుల బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

హార్మోన్‌లు అనేవి శరీరంలోని ఎండోక్రైన్ గ్రంథుల నుండి ఉత్పత్తి అయ్యే రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంతపు కణజాలం, అవయవాల నుండి ఉత్పత్తి కాబడి – రక్తప్రసరణ ద్వారా వివిధ శరీర భాగాలకు చేరుకుని, ఆయా నిర్దిష్ట అవయవాలను ప్రభావితం చేసి, తద్వారా శరీర జీవక్రియల సమతుల్యతకు తోడ్పడతాయి. ఇవి శరీరంలో సూక్ష్మమోతాదులోనే ఉత్పత్తి అయినప్పటికీ, శరీరంలోని సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ మొదలుకొని శారీరక–మానసిక ఎదుగుదల, ప్రత్యుత్పత్తి, మానసిక సమతుల్యత వంటి అన్ని జీవక్రియలపై ఈ హార్మోన్‌ల ప్రభావం ఉంటుంది. ఏ కారణం చేతనైనా ఇవి అసమతుల్యతకు గురి అయితే, అలాంటి పరిస్థితులు తీవ్రమైన ఆరోగ్య సమస్యలను కలుగజేస్తాయి.




**వివిధ హార్మోన్‌లు - వాటి అసమతుల్యత వలన కలిగే వ్యాధులు:**

థైరాయిడ్ హార్మోన్‌లు–(T3, T4): ఇవి థైరాయిడ్ గ్రంథి నుండి ఉత్పత్తి అవుతాయి. మానవుడి జీవక్రియలపై వీటి ప్రభావం 90% ఉంటుంది. వీటి అసమతుల్యత వలన హైపోథైరాయిడ్, హైపర్‌థైరాయిడ్, గాయిటర్ వంటి దీర్ఘకాలిక జబ్బులు కలుగుతాయి. హైపర్‌థైరాయిడిజం: శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు ఎక్కువ మోతాదులో ఏర్పడటం వలన ఈ సమస్య కలుగుతుంది. **లక్షణాలు:** బరువు తగ్గడం, నీరసం, గుండెదడ, కాళ్ళు–చేతులు వణకడం మొదలైన లక్షణాలు కనిపిస్తాయి.

హైపోథైరాయిడిజం: థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడం వలన ఇది ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు పెరగటం, జుట్టు రాలడం, నీరసం, మతిమరుపు, ఋతుచక్ర సమస్యలు మొదలైన లక్షణాలు కనిపిస్తాయి. **గాయిటర్:** గొంతు క్రింద ఉండే థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని గాయిటర్ అంటారు. ఇది ముఖ్యంగా అయోడిన్ అనే మూలకం యొక్క లోపం వలన కలుగుతుంది. ఇది హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ సమస్యలతో కూడుకుని ఉండవచ్చు.

**హోమియోకేర్ చికిత్స:** ప్రస్తుత పరిస్థితులలో మానవుని ప్రకృతి విరుద్ధమైన జీవన విధానం, అధిక ఒత్తిడికి గురికావడం, వ్యాయామ లోపం వలన ఎక్కువ శాతం థైరాయిడ్ వ్యాధుల బారినపడటం మనం తరచుగా గమనిస్తున్నాము. థైరాయిడ్ సమస్యలకు జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, ఈ సమస్యలు రావడానికి గల మూలకారణాన్ని గుర్తించి, రోగి యొక్క తత్వానికి అనుగుణంగా సరైన హోమియో వైద్యం చేయడం ద్వారా థైరాయిడ్ హార్మోన్ సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**స్త్రీలలో ఉండే హార్మోన్‌లు:** ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్, ప్రొలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్‌లు స్త్రీలలో రజస్వల, ఋతుచక్రం, ద్వితీయ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి మరియు ప్రసవంలో ఉపకరిస్తాయి. వీటి అసమతుల్యత వలన స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు (పీ.సి.ఓ.డి.), హిర్సుటిజం (అవాంఛిత రోమాలు) మరియు సంతానలేమి సమస్యలు ఏర్పడతాయి. స్త్రీలలో మెనోపాజ్ మరియు రజస్వల అయ్యే సమయంలో హార్మోన్‌ల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. మెనోపాజ్‌లో హార్మోన్‌ల హెచ్చుతగ్గుల వలన Hot Flushes, మానసిక అశాంతి, నీరసం, కీళ్ళు మరియు కండరాల నొప్పులు కలుగుతాయి. **పురుషులలో ఉండే హార్మోన్‌లు:** TSH, LH మరియు టెస్టోస్టిరాన్ హార్మోన్‌లు పురుషులలో శుక్రకణాల ఉత్పత్తికి తోడ్పడతాయి. ఈ టెస్టోస్టిరాన్ అసమతుల్యత వలన శీఘ్రస్కలనం, అంగస్థంభన సమస్యలు, శుక్రకణాల సమస్యలు ఏర్పడటం వలన సంతానలేమి సమస్యలు కలుగుతాయి. **హోమియోకేర్ చికిత్స:** హార్మోన్ సమస్యలు ఒకదానితో మరొకటి అనుసంధానమై ఉంటాయి. వీటికి హోమియోకేర్ వైద్యంతో ఎలాంటి హార్మోన్‌లు బయట నుండి ఇవ్వకుండా, హార్మోన్ అసమతుల్యతలను సరిచేయటం వలన ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా ఋతుచక్ర సమస్యలతో పాటు, పీ.సి.ఓ.డి., సంతానలేమి మరియు శుక్రకణ సంబంధిత సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

డయాబెటిస్ ఇన్‌సెపిడిస్: ఈ సమస్య ADH (యాంటీ డయూరెటిక్ హార్మోన్) లోపం వలన కలుగుతుంది. దీనిని అతి మూత్ర వ్యాధి అంటారు.

డయాబెటిస్ మెల్లిటస్: ఇది క్లోమ గ్రంథి ఉత్పత్తి చేసే ఇన్సులిన్ లోపం వలన లేదా తక్కువ మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కావడం వలన కలుగుతుంది. ఇది రెండు రకాలు.

టైప్-I డయాబెటిస్: ఇది ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవడం వలన వస్తుంది. దీనిని 'జువెనైల్ డయాబెటిస్' అని అంటారు. ఈ వ్యాధి ఉన్నవారు పూర్తిగా ఇన్సులిన్ ఇంజెక్షన్లపై ఆధారపడవలసి వస్తుంది. టైప్-II డయాబెటిస్: ఇది ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గటం వలన వస్తుంది. ఇది ఎక్కువగా 30 సం॥లు పైబడిన వారిలో వచ్చే అవకాశం ఉంటుంది. కానీ ఈ మధ్యకాలంలో యుక్తవయస్సులో ఉన్నవారికి కూడా ఇది వస్తోంది. డయాబెటిస్‌తో బాధపడే వారి రక్తంలోని చక్కెర శాతాన్ని సరిగ్గా నియంత్రణ చేయకపోవడం వలన దీర్ఘకాలంలో డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ న్యూరోపతి, రెటినోపతి, గుండె సమస్యలు, అంగస్థంభన సమస్యల లాంటి కాంప్లికేషన్‌లు వస్తాయి.

**హోమియోకేర్ చికిత్స:** డయాబెటిస్‌ను తొందరగా గుర్తించి, తద్వారా తొలిదశలోనే హోమియోకేర్ ప్రత్యేక హార్మోన్ సెల్ మరియు కాన్స్టిట్యూషనల్ విధానం ద్వారా దీర్ఘకాలికంగా డయాబెటిస్ బాధితులుగా ఉన్నవారిలో వ్యాధిని అదుపులో ఉంచటమే కాకుండా, ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా డయాబెటిస్ సంబంధిత కాంప్లికేషన్‌లన్నింటినీ నివారించవచ్చు.

కార్టికో స్టిరాయిడ్స్: ఇవి అడ్రినల్ గ్రంథి నుండి విడుదల అవుతాయి. ఇవి అన్ని ముఖ్యమైన జీవక్రియలలో మరియు రోగనిరోధక వ్యవస్థలో ప్రముఖ పాత్ర పోషిస్తాయి. వీటి అసమతుల్యత వలన కుషింగ్స్ మరియు అడిసన్స్ వ్యాధులు వస్తాయి.

**హార్మోన్ సమస్యలకు హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** 'హోమియోకేర్' సొంతమైన ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ సిమిలిమం పద్ధతుల ద్వారా అన్ని హార్మోన్ సమస్యలకు ఖచ్చితమైన మరియు ఎటువంటి దుష్ఫలితాలు లేని వైద్యం అందించి, తద్వారా ఇక జీవితంలో హార్మోన్ సమస్యలు మళ్ళీ తిరగబెట్టకుండా సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది.

**టోల్ ఫ్రీ 1800 108 1212** | కన్సల్టేషన్ ఉచితం **955 000 1199** | www.homeocare.in



-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సెల్:98480 78079

**అడవిదారి.**

**ఒక వయసు మళ్ళిన బాటసారి నడచినడచి అలిసిపోయి, మనస్సుచెదిరి దారితప్పాడు.**

**వెళ్ళివెళ్ళి ఒక నేలబారు నూతిలో పడ్డాడు.**

**పడుతూ పడుతూ వేగంగా చెయ్యి పైకి విసిరాడు.**

**నూతి అంచులపైనా, చుట్టూనూ జీబుగా మొక్కలు మొలిచిపోయి ఉండడంవల్ల ఆ చేతికి ఒక చెట్టు పట్టు దొరికింది. అయితే అతడి బరువుకి ఆ చిన్నచెట్టు వేళ్ళు జవజవలాడి పోయాయి. అంటే: అది ఊడి, ఏ క్షణంలోనైనా చేతిలోకి వచ్చేయొచ్చు.**

**బాటసారి ఎక్కడలేని ఓపికా కూడదీసుకుని, పైకి ఎగబాకే ప్రయత్నంలో ఉన్నాడు. సరిగ్గా అప్పుడే అతగాడి తల పైగా కనిపించే పెద్దచెట్టుకొమ్మకి పట్టుకు వ్రేలాడుతున్న పెద్ద తేనె పట్టు నుంచి పచ్చితేనె, బొట్లు బొట్లుగా కురుస్తోంది. బాటసారి వాటికోసం నాలుక చాచాడు.**

**ఇది వ్యాసమహర్షి భారతంలో ఒక కథ. వేదాంతపండితులు ఈ ఘటనను మనిషి జీవితపు ఆశాతత్వాన్ని ఉదహరిస్తూ గొప్పగా వ్యాఖ్యానించారు. అదలా ఉండనిద్దాం.**

# ఆశా! నా ప్రాణసఖీ!

వట్టి సాధారణ మనుషులమైన మనం, ఈ ఘటననుంచి గ్రహించదగిన విశేషం: మనం ప్రతి ప్రయత్నంలోనూ, చివరిక్షణం వరకూ సాధించగల మనే ఆశతోనే బతుకుతుంటాం. Never Give up.... అని మన భుజాల్ని మనం తట్టుకుని, ప్రోత్సహించుకుంటూంటాం. ఆ బాటసారి సంగతే చూద్దాం. అలసిపోయి ఉన్నాడు. వయస్సు చెల్లిపోయింది. దారితప్పి పోయాడు. నూతి అంచును పట్టుకు మొలిచిన చెట్టువేళ్ళకు బలం లేదు. అయినా బతుకుమీద ఆశ వదలదు. తేనెబొట్లకోసం నాలుకచాపడం మానడు. అదీ, మన మానవుల ఆశకున్న బలం!

మనలో చాలామంది ఒక సామెతగా వినే ఉంటారు. "అటు నుంచి నరుక్కురండి" అని.

ఒకరాజుగారు ఆరుగురు నేరస్థులకు శిరశ్ఛేద శిక్ష విధించారు. తలవరి ఆరుగురిని వరసగా నిలబెట్టి పదునైన 'వేటారుతునకల' కత్తి అందుకున్నాడు. ఒక కొసనించి ప్రారంభించబోయాడు. అక్కడ నిలబడిన నేరస్థుడు, "అన్నా, అటునుంచి నరుక్కురా" అన్నాడు. ఎటు ప్రారంభిస్తేనేం? శిక్ష అమలు చేయాలి. తలవరి అంగీకరించి 'అటునుంచి' మూడు తలలు నరికేశాడు.

రాజుగారి నుంచి హుటాహుటి వార్త వచ్చింది: రాణీగారు ప్రసవించింది. అబ్బాయి పుట్టాడు. ఈ శుభసందర్భంలో నేరస్థుల శిక్ష అమలు జరపవద్దు, విడిచి పెట్టమని.

ముగ్గురు నేరస్థులు బతికిపోయారు.

ఆశావహుడి ఆలోచన ఇలాగ ఉంటుంది.

ప్రసిద్ధ గ్రీకుతత్వవేత్త, బహుశాస్త్రాలలో పండితుడు అరిస్టాటిల్ కాలాన్ని నిర్వచిస్తూ, "Time is a Three Fold Present" అన్నాడు.

కాలం, మూడు మడతల వర్తమానం అన్నమాట. ఎలాగ?

వర్తమానకాలంలోకి 'గతం' ఒక మడత అంటే: అనుభవరూపంగా, అది వర్తమానంలో ప్రవేశించి ఉంటుంది. అలాగే ఆశారూపంగా 'భవిష్యత్తు' మరొక మడతగా వర్తమానంలోకి వంగి నిలబడుతుంది.

సారాంశం ఏమంటే అనుభవం – ఆశ అనే రెండు బిందువుల మధ్య, వర్తమానం ప్రతి వ్యక్తికీ లోలకం మాదిరి ఊగిసలాడుతుంటుంది.

అంతమాత్రాన మనకి అనుభవాలు పాఠాలు నేర్పుతాయనిగాని, కోరుకున్న ఆశలు అంది వస్తాయనిగాని ఏమీ హామీ లేదు.

సూర్యాస్తమయం కాబోతోంది.

అదొక తామరపూలు నిండిన పెద్దచెరువు. ఒక తుమ్మెద పూలతేనె తాగాలని ఒక తామర పువ్వు పైని వాలింది. మాంచి రసకందాయంగా, స్తిమితంగా మధువు ఆస్వాదిస్తుండగా సూర్యాస్తమయం జరిగిపోయింది. ఇంకేం వుంది? తుమ్మెద వాలివున్న తామరపువ్వు ముడుచుకుపోయి మొగ్గలాగ అయిపోయింది. తుమ్మెద లోపల ఇరుక్కుపోయింది. అయినా ఇలా అనుకుంది తుమ్మెద...

"ఈ రాత్రి గడిచిపోతుంది. పలపలమంటూ తెల్లవారుతుంది. సూర్యుడు ఉదయిస్తాడు. ఈ తామరపూల చెరువులో పూలన్నీ పకపక వికసిస్తాయి..."

ఇలా అనుకుంటూనే ఉంది. కానీ అయ్యయ్యో, ఒక యేనుగు చెరువులో ప్రవేశించి పువ్వుల్ని లాగి పారేసింది. తుమ్మెద ఇరుక్కునిఉన్న పువ్వు, చెరువులో తెగి ఒడ్డున పడింది. మరింక దానికి సూర్యోదయం లేదు. వికసించడం అంతకన్నా లేదు.

మన "రేపటి ఆశలు" ఏ హఠాత్ కారణాల వల్లనో భగ్నమై పోతుంటాయి. ఈ అర్థంవచ్చే అద్భుత శ్లోకాన్ని ప్రసిద్ధ సంస్కృతపండితకవి, అలంకార శాస్త్రవేత్త, జగన్నాథ పండితరాయలు వ్రాశాడు.

1960ల కాలంలో యూరప్‌లో ABSURDISM అనే సాహిత్య ఉద్యమం నడిచింది. వీరు, అంటే ఈ మార్గాన నడచిన ABSURDIST రచయితలు గొప్పనాటకాలు వ్రాశారు. వాళ్ళ సిద్ధాంతప్రకారం, "ఈ ప్రపంచంలో మనుషులనేవాళ్ళు ఏ ప్రయోజనం లేకుండా బతుకుతుంటారు. వారి జీవితాలకు ఒక క్రమం అంటూ నిర్దిష్టంగా ఉండదు. ఊరికే అలాగ బతికేస్తుంటారు. ఏ పరిస్థితులెదురైనా వాటిని నిశ్శ



బ్దంగా అనుభవించడంతప్ప వాళ్ళు చెయ్యగలిగేదేమీ ఉండదు". దీన్ని నిరాశావాదంగా కొట్టిపారేశారు కొందరు. కాని, యూరప్‌లో ప్రజలు తమ ప్రమేయం లేకుండా రెండు ఘోరతర ప్రపంచయుద్ధాలు చూశారు. దారుణమైన మానసిక, భౌతిక పరిస్థితుల్ని ఎదుర్కొన్నారు. ఇటువంటి స్థితిని, హెరాల్డ్ పింటర్ అనే బ్రిటీష్ రచయిత "A Kind of Alaska" అనే గొప్పనాటకంలో చిత్రించాడు.

"చేతికందింది నోటి కందాలనేముంది?" అంటూ ఒక కవి పాటకు పల్లవి కూర్చాడు.

ఆశకీ – నిరాశకీ మధ్య విషాదంవంటి నిషాదమే ('ని') కద అడ్డు!

కాసేపు ఒక ఆశ గురించి ఆలోచిద్దాం.

ఒక అందమైన ఆశలాంటి అమ్మాయి వాళ్లాయన్ని తెగ ప్రేమించిమరీ పెళ్ళాడింది. రేపు అతడు కనక, చెప్పిన ప్రకారం ఊరునించి తిరిగి రాడో!...

ఇంతలో ఆ అమ్మాయి ఎడమకన్ను అదిరింది. వెంటనే తన ఎడమ కన్నుకి ఆ అమ్మాయి ఒక ఆశ పెట్టింది "ఒయ్యోయి...నీ అదురుడే గనక నిజమై, అతగాడు అనుకున్నవేళకి తిరిగి వచ్చినట్టాయెనా, 'కుడికన్ను' మూసేసి చాలాసేపు 'నీ తోనే' అతణ్ణి చూస్తాను" అని.

ఈ తమాషా'గాథ', హాలశాతవాహనుడు సంకలనంచేసిన ప్రాకృతగాథలలో ఒక చమత్కారినే!

ఇవన్నీ పాత కథలు.

ప్రముఖ కథారచయిత హితశ్రీ "తెల్లవారింది" అని ఒక నాటిక వ్రాశారు. చాలాచిన్న ఇతివృత్తం.

పెద్దగా ప్రాక్టీసులేని లాయరుగారికి భార్యలేదు. ఉద్యోగవార్తకోసం ఎదురుచూసే పెద్ద కొడుకు, కాలేజీసీటు వార్తకోసం ఎదురుచూసే చిన్నకొడుకు, పెళ్ళికావలసిన చక్కనైన కూతురు ప్రతిరోజూ ఇంటిగుమ్మంలో "పోస్ట్" అనే కేక వినపడగానే ఆశగా, ఏదో కొత్తవిషయం జరగబోతుందన్నట్టు గుమ్మం వైపు పరుగెడుతుంటారు. లాయరుగారు కూడా, ఏ క్లయింట్లో, పెళ్ళిసంబంధాల మనిషో రాకపోతారా! అని తెల్లవారడంకోసం ఆశావహంగా ఎదురుచూస్తూనే ఉంటారు. ఆశపడడంతప్ప ఇంకేమీ చెయ్యజాలని మనుషుల నిస్సహాయతను ఈ నాటిక అద్భుతంగా చెపుతుంది.

ఒక చిన్న కొసమెరుపు సందర్భంతో ఈ ప్రస్తావన ముగిస్తాను.

దంపతుల జంటలు రెండు గంగాస్నానంకోసం కాశీ వెళ్ళారు. విశ్వేశ్వర దర్శనం, గంగాస్నానం పూర్తయ్యాక ఒక జంట రైలుస్టేషనుకు వెళ్ళిపోయారు. అదేరైలుకి వెళ్ళవలసిన రెండవజంట మరికొన్ని దర్శనాలు, స్నానాలు పూర్తి చేసుకున్నారు. అయితే, ఈ దంపతుల్లో భర్త ఒకడే రైల్వేస్టేషన్‌కి ఒంటరిగా వచ్చేశాడు. అతగాడిముఖంలో ఏనాటి వెయ్యిఆశలో తీరిన ఆనందకాంతి గమనించి, అంతక్రితమే స్టేషనుకుచేరిన 'మిత్రదంపతి' కుతూహలంగా అడిగారు.

"ఆవిడేదీ?" అని. అతగాడు చిరునవ్వుతో, ఇలా సమాధానం చెప్పాడు. "కాశీలో, మనకి చాలా ఇష్టమైన దాన్ని వదిలెయ్యాలంటారు కదా! మా ఆవిడ కంటే మరేదైనా ఇష్టమైనది ఉందని చెపితే, ఆవిడకి కోపం వస్తుందని, ఆవిణ్ణి మించిన ఇష్టవస్తువు లేదన్నాను. అయితే వదిలెయ్యాలన్నారు. వదిలేసి వచ్చేశాను" అని.

అలాగ అతగాడి ఏకైక జీవితాశ నెరవేరిందని, నా మిత్రుడు హాస్య రచయిత, 'తంబు' ఈ కథ వ్రాశాడు.

'ఆశ' గురించి తలుచుకున్నప్పుడల్లా నాకు ప్రముఖ లలిత వాగ్గేయకారులు 'రజని' అనబడే బాలాంత్రపు రజనీకాంతరావు గారి ఒకపాటలో పల్లవి గుర్తుకొస్తుంటుంది:

"ఆశా! నా ప్రాణసఖీ – ప్రభాత తారా!
దగ్గరగా రా, ఇంకా దగ్గరగా రా
మరీ దగ్గరగా రా..." అని

ఏ ఆశ అయినా, తీరిపోవడంలో ఆకర్షణ లేదు. తీరకపోవడం, తీరాలని ఎదురు చూడడంలోనే కవిత్వమూ, సాహిత్యసర్వస్వమూ ఉన్నాయి.

నవ్య

## గోడలపై జీవనచిత్రం

అదొక చిన్న పల్లెటూరు. పేరుకే పల్లెటూరు. కానీ అక్కడ జనాలెవరూ ఉండరు, పాడుబడిన ఇళ్లు, కూలిపోవడానికి సిద్ధంగా ఉండే గోడలుతప్ప. ఆ ప్రాంతం అంతా నిర్మానుష్యంగా ఉంటుంది. అసలు అక్కడ ఉండడానికి జనాలు కూడా ఇష్టపడరు! దయ్యాల దిబ్బను తలపించేలా ఉండే ఆ ఊరును నిజంగానే అక్కడి వారు 'దయ్యాల దిబ్బ' అని పిలుచుకుంటారు. కానీ ఇప్పుడు ఆ దయ్యాలదిబ్బలో మార్పు మొదలైంది. ఇంతకీ జనాలు ఉండడానికి కూడా ఇష్టపడని పరిస్థితి ఎందుకొచ్చింది? ఇప్పుడు ఆ ఊళ్లో వచ్చిన మార్పేంటి? ఏంటా ఊరు కథ? మీరూ తెలుసుకోండి.

ఉత్తరాఖండ్ రాష్ట్రంలోని కొన్ని గ్రామాల్లో విధి వక్రీకరించింది. పర్యావరణం కన్నెర్ర చేసింది. వర్షాలు కురవకపోవడంతో తిండి గింజలు లేక ప్రజలు అల్లాడిపోయారు. దీనికి నిరుద్యోగం కూడా తోడైంది. బతకడం వారికి కష్టమైంది. దీంతో ఆ గ్రామాలలోని ప్రజలంతా వారి వారి గ్రామాలను విడిచి పట్టణాలకు వలసవెళ్లారు. అలా ఉత్తరాఖండ్‌లో ఇప్పటికి 16,793 గ్రామాల్లో 1,053 గ్రామాల పరిస్థితి ఇదే. వారంతా తమ కుటుంబాలతో పట్టణాలకు వలస పోయారు. అలాంటి గ్రామాల్లో ఒకటి ఇప్పుడు మనం చెప్పుకున్న గ్రామం.

టెహ్రీ గర్వాల్ అనేది ఉత్తరాఖండ్ రాష్ట్రంలోనే పెద్ద జిల్లా. అందులో గార్వాల్ రీజియన్‌లో సార్ అనే ఓ పల్లెటూరు ఉంది. 300 ఏళ్ల చరిత్ర కలిగిన పల్లెటూరది. ఒకప్పుడు వందలాది మంది జనాలతో కళకళలాడుతూ ఉండేది.




కానీ ఇప్పుడు అందరూ కరువు కారణంతో వలస వెళ్లడంతో బోసిపోయింది. ప్రస్తుతం ఈ గ్రామంలో కేవలం 12 కుటుంబాలకు చెందిన ముసలివాళ్లు మాత్రమే ఉంటున్నారు. అందుకే దాన్ని అందరూ 'దయ్యాల దిబ్బ' అని పిలుస్తారు.

ఒకసారి దీపక్ రమోలా అనే అతను, అతని బృందం కలిసి ఈ గ్రామం సందర్శించారు. వందలఏళ్ల చరిత్ర కలిగిన గ్రామం ఇలా దయ్యాల దిబ్బలా మారిపోవడం వారికి నచ్చలేదు. అప్పుడే ఈ ఔత్సాహిక బృందానికి ఓ ఆలోచన వచ్చింది. దీన్ని ఎలాగైనా ఓ ఆకర్షణీయ ప్రదేశంగా మార్చి, సుందర పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దాలనుకున్నారు. తద్వారా ఆ గ్రామాల్లో ప్రజలకు జీవనోపాధి కల్పించినట్లు కూడా అవుతుందని భావించారు. అందుకోసం FUEL (Forward the understanding of every life lesson) అనే ప్రాజెక్ట్ రూపొందించుకున్నాడు. ఇందులో తన టీంతో పాటు మరికొంతమంది మిత్రులను, ఔత్సాహికులను కూడా చేర్చుకున్నాడు దీపక్. వారందరితో కలిసి ఆ ఊరు గోడలన్నింటికీ రంగులువేసి వాటిపై జానపదకథలను తెలిపే చిత్రాలను, గ్రామీణ వాతావరణాన్ని ప్రతిబింబించే మరెన్నో బొమ్మలను గీశాడు. దీంతో ఊరంతా సర్వాంగ సుందరంగా తయారైంది. ఇప్పుడు ఈ ఊరు ఇలా జీవనచిత్రాలను గోడలపై పెయింటింగులున్న దేశంలోనే మొట్టమొదటి ఊరుగా ప్రసిద్ధికెక్కింది. ప్రస్తుతం ఆ ఊరును చూడటానికి ఎంతో మంది వస్తున్నారు. కేవలం ఇది మాత్రమే కాక ఆ చుట్టుపక్కలున్న ఇలాంటి మరిన్ని గ్రామాలను కూడా ఆకర్షణీయంగా మలిచి, పూర్వ వైభవాన్ని తెస్తామని దీపక్ బృందం చెబుతోంది. ఒకప్పుడు దయ్యాల దిబ్బ అనిపించుకున్న ఊరు ఇప్పుడు ఆహా.. ఎంత అందంగా ఉంది అని అనిపించుకుంటోంది. ఎంతో మంది నేటితరం వారికి పల్లె వాతావరణం పరిచయం చేస్తూ వారిలో నూతన ఉత్సాహాన్ని నింపుతోందీ ఊరు.

నవ్య





# సెల్ఫ్ వెడ్డింగ్

**పెళ్లంటే ఆకాశమంత పందిరివేసి భూదేవంత పీటవేసి... అని ఎంతో గొప్పగా చెబుతాం. నవదంపతులను కూర్చోబెట్టి పండితుల వేద మంత్రాలు, మేళతాళాలు, బాజాలు, భజంత్రీలు, బంధుమిత్రుల సందడి మధ్యచేసే ఓ మధురమైన జ్ఞాపకమే పెళ్ళి. ఆచారాలు, సంప్రదాయాలు వేరైనా పెళ్ళి అనగానే బంధుమిత్రులు, పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు, రెలిజియస్ ప్రీస్ట్...వీళ్ళంతా తప్పనిసరిగా ఉంటారు. కానీ కొన్ని పెళ్ళిళ్ళకి మాత్రం ఇప్పుడు చెప్పుకున్నట్టు అందరూ ఉంటారు ఒక్క పెళ్ళికొడుకుతప్ప! అంటే పెళ్ళికొడుకు లేకుండానే పెళ్ళి చేసేసుకుంటారన్నమాట!**

అదేంటి? పెళ్ళికొడుకు లేకుండా పెళ్ళి ఎలా చేసుకుంటారు? ఇది వినడానికి కూడా విడ్డూరంగా ఉంది కదూ. అంటే ఈమధ్య అమ్మాయిలు, అమ్మాయిల్నీ, అబ్బాయిలు అబ్బాయిల్నీ వివాహం చేసుకుంటున్నారు కదా ఒకవేళ ఇది అలాంటి వివాహమేమో అనుకుంటున్నారా? ఎంతమాత్రం కాదు. అప్పటికాలంతో పోలిస్తే వివాహవ్యవస్థలో ఇప్పుడు ఎన్నో మార్పులు చోటుచేసుకున్నాయి, చేసుకుంటున్నాయి కూడా! అలాంటి మార్పులతోనే ఇప్పుడో కొత్త ట్రెండ్‌కి తెర లేచింది. ఆ రకమైన వివాహం పేరే 'సోలోగమీ'.

### అసలేంటీ సోలోగమి?

తమని తాము ఎవరైనా ఇష్టపడతారు. మనమీద మనకు ప్రేమ లేకపోతే ఇతరుల్ని మనం ప్రేమించలేం. మనమీద మనకు విశ్వాసం లేకపోతే ఇతరుల్ని విశ్వసించలేం. మనమీద మనకు అభిమానం లేకపోతే ఇతరుల్ని అభిమానించలేం. ఇది పాతమాటే. కానీ...

మనమీద మనకు ప్రేమ ఉన్నంత మాత్రాన మనల్ని మనమే పెళ్ళి చేసుకుంటామా?! కానీ అలా పెళ్ళి చేసుకోవడమే సోలోగమి. ఈ పద్ధతిలో అమ్మాయి తనకు తనే వివాహం చేసుకుంటుంది. సింగిల్‌గా ఉండడానికి ఇష్టపడే అమ్మాయిలు ఈ పద్ధతి ఫాలో అవ్వడానికి ఎక్కువగా ఆసక్తి చూపుతున్నారు. ఇప్పుడిప్పుడే వయసుమీదపడే అబ్బాయిలు, అమ్మాయిలు ఈ పద్ధతి ఫాలో అవ్వడానికి రెడీ అవుతున్నారు. ఎవరైనా తనకు తానే వివాహం చేసుకుంటే దాన్ని సోలోగమి అని పిలుస్తారు. మనదేశంలో ఈరకమైన వివాహ విధానంలేదు కానీ, విదేశాల్లో వారి వారి పద్ధతులను అనుసరించి ఈ వివాహం జరుపుకుంటున్నారు. దీన్నే సోలోగమి అని పిలుస్తున్నారు. ఒక్కముక్కలో చెప్పాలంటే సెల్ఫ్ వెడ్డింగ్ అన్నమాట. అసలు అలా పెళ్ళిచేసుకునే అమ్మాయిలు ఎక్కడున్నారు? తమని తామే ఎందుకు పెళ్ళిచేసుకుంటున్నారు? ఆ కథేంటో తెలుసుకోండి మరి!

### ఇలా మొదలైంది

సోలోగమి వ్యవస్థకి చట్టబద్ధమైన ఆమోదం ఏదీ లేదు. ఇప్పటివరకు యూరోప్, అమెరికాలాంటి దేశాల్లో ఇలాంటి తరహా వివాహాలు జరిగాయి. ఈ సోలోగమి వివాహాలు ఇష్టపడడానికి కారణం వ్యక్తిగతంగా ఇది వారి ఆత్మగౌరవాన్ని పెంచడమే. దాంతోపాటు, ఆత్మగౌరవాన్ని కాపాడుతుందని భావిస్తున్నారు. ఇతరులతో సంబంధం లేకుండా తమకు తాము ఏకాంతంగా గడపడానికి ఇష్టపడే మహిళలే ఈ వివాహానికి ఆసక్తి చూపిస్తున్నారు.

అదేవిధంగా, ఈ సోలోగమి తమ సాధికారతకు సంబంధించిన విషయంగా కూడా వాళ్ళు దీన్ని భావిస్తున్నారు. ఇలాంటి వివాహం చేసుకోవాలనుకునేవారిలో ముప్పైఏళ్ళ వయసున్నవారే ఎక్కువ మంది. పైగా మొదటి నుంచి ఒంటరిగా ఉండేందుకు ఇష్టపడేవారు, ఎంచుకున్న భాగస్వామిచేతిలో మోసపోయినవారే ఎక్కువ మంది.

సోలోగమి వివాహాలకు ఆద్యురాలు లిండా బేకర్. ఆమె నలభయ్యోపుట్టిన రోజున తనని తాను వివాహం చేసుకున్నారు. ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురుచూసే కన్నా మనపైన మనమే ఆధారపడాలన్నది ఆమె ఉద్దేశం. అందుకే 1993లో 75 మంది కుటుంబసభ్యులు, స్నేహితుల సమక్షంలో ఏడుగురు బ్రైడ్‌మేట్స్ సహాయంతో తనని తాను వివాహం చేసుకున్నారామె.

### బాధ నుంచి బయటపడేందుకే

పదిమంది బ్రైడ్‌మేట్స్ తోడురాగా సంప్రదాయబద్ధంగా జరిగిన వివా

హంలో తన వేలికి తానే ఉంగరం అలంకరించుకుని మరీ పెళ్ళి చేసుకుంది సోఫీ టాన్నర్. ఇది తనకు రెండో వివాహం. అసలు సోఫీకి తనను తాను పెళ్ళి చేసుకోవాలనే ఆలోచన ఎలా వచ్చిందో తెలుసా? తను ముప్ఫై యేళ్ళ వయసులో ఉన్నప్పుడు ఒక వ్యక్తితో ప్రేమాయణం కొనసాగించింది. అది కాస్తా బ్రేకప్ కావడంతో బాధలో కూరుకుపోయింది. ఆ బాధనుంచి తేరుకునే సమయంలో తనని తాను తెలుసుకోవడం ప్రారంభించింది. మళ్లీ పెళ్ళి చేసుకోకుండా ఒంటరిగా ఉండాలని నిర్ణయించుకుంది. ఆ విషయంలో ఎవరేమన్నా పట్టించుకోకూడదనుకుంది. తాను బాధపడకూడదని, సంతోషంగా ఉండాలని అనుకుంది. అందుకే సెల్ఫ్ మ్యారేజ్ చేసుకుంది. పెళ్ళి తర్వాత ఓ గ్రాండ్ రిసెప్షన్ ఏర్పాటు చేసింది. సోఫీ జర్నలిస్టు కూడా. 'హ్యాపిలీ' అనే ఒక నవల కూడా రాసింది. ఆ నవలలో తన పెళ్ళి గురించి, ఆ తర్వాతి జీవితం గురించి అనేక విషయాలు అందులో పొందుపరిచింది. మే 16, 2015న సోలోగమి చేసుకున్న సోఫీ ఇటీవలే తన సెకండ్ వెడ్డింగ్ యానివర్సరీ జరుపుకుంది.

## సీరియల్ చూసి ఆలోచన వచ్చింది

ఒక ఐడియా జీవితాన్నే మార్చేస్తుందన్నట్లు ఒక టీవీ సీరియల్ లిన్నే గొలోగ్లీ జీవితాన్నే మార్చేసింది. ఇంగ్లాండ్ సౌత్ యార్క్‌షైర్‌కి చెందిన లిన్నే ఓ బిజినెస్ ఎనలిస్ట్. నాకు నేనే మిస్టర్ రైట్‌ను ఇక వేరే మిస్టర్ రైట్ నాకెందుకు అనుకుని నలభైయేళ్ళ వయసులో, 2017 ఫిబ్రవరిలో తనని తాను వివాహం చేసుకున్నారామె. అసలు ఇలా వివాహం చేసుకోవాలని ఆమెకు ఎందుకు అనిపించిందో తెలుసా? 'కామెడీ సెంట్రల్' అనే ఇంగ్లీష్ ఛానల్లో 'ఫ్రెండ్స్' అనే కామెడీ సీరియల్ ప్రసారమవుతుంది. అందులో సింగిల్‌గా జీవితం నెట్టుకొస్తున్న రేచెల్, మోనికా, ఫిబీ అనే ముగ్గురు స్నేహితురాళ్ళు పెళ్ళిగౌను ధరించి చాలా సంతోషపడతారు. అది చూసిన లిన్నేకు తనని తాను ఎందుకు పెళ్ళి చేసుకోకూడదనే ఆలోచన వచ్చిందట. దీనికి ఆమె తల్లి నుంచి సహకారం అందడంతో తనుకూడా పెళ్ళికూతురైపోయింది. అంతే కాదండోయ్ పెళ్ళి తర్వాత ఏప్రిల్‌లో వచ్చిన తన పుట్టినరోజునాడు కూడా ఇదే వెడ్డింగ్‌థీమ్‌తో సెలబ్రేట్ చేసుకుంది. అసలింతకీ లిన్నే తనని తాను పెళ్ళి చేసుకోవడానికి ఒక కారణం ఉంది. గతంలో ఓ వ్యక్తితో ఆమెకు నిశ్చితార్థం జరిగింది. అయితే అది బ్రేకప్ కావడంతో అప్పటి నుంచి సింగిల్‌గానే ఉంటోంది.

## తల్లిదండ్రులే దగ్గరుండి మరీ

ఎవరినైనా ప్రేమించానని చెప్పగానే తల్లిదండ్రుల నుంచి వ్యతిరేకత సహజం. అలాగే 'నన్ను నేను పెళ్ళి చేసుకుంటా' అంటే ఏ తల్లిదండ్రులైనా ఒప్పుకుంటారా? కానీ గ్రేన్‌గెల్డర్ తల్లిదండ్రులు మాత్రం నీ సంతోషకోసం ఏమైనా చేస్తాం అంటూ గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు. ఈ విషయం విన్న ఆమె స్నేహితులైతే నువ్వెప్పుడూ ఇలానే ఆలోచిస్తావా అంటూ ఆశ్చర్యపోయారు. దాంతో గ్రేన్ పార్లమెంట్ హాల్లో ఉన్న ఓ పార్క్‌లో ముందుగా తనను తాను ప్రపోజ్ చేసుకుంది. పద్దెనిమిదేళ్ళ వయసులో ఉన్నప్పుడు యూనివర్సిటీలో ఎక్కువగా వినిపించిన పాటలోని 'మై నేమ్ ఈజ్ ఇసోబెల్. మ్యారీడ్ టు మైసెల్ఫ్' అనే వాక్యం ఆమె మదిలో నిలిచిపోయిందట. అది చాలా విచిత్రంగా అనిపించి ఎప్పుడూ ఆ వాక్యం గురించే ఆలోచించేది. ఆ క్రమంలోనే సెల్ఫ్ మ్యారేజ్ అంటే మనల్ని మనం ప్రేమించుకోవడం, మనం సాధించాలనుకుంటున్న దానికి మనకు మనమే మద్ధతు ఇచ్చుకోవడం అని గ్రహించింది. ఎంతో కాలంగా సింగిల్‌గా ఉండడంతో తనతో తాను చక్కటి అనుబంధాన్ని ఏర్పరుకుంది. వివాహానికి నెలముందు, నేను చేస్తున్నపని కరెక్టా? కాదా? అని ఆలోచన కలిగింది. వాటన్నింటినీ పక్కనబెట్టి మార్చి 16, 2014న యాభైమంది అతిథుల సమక్షంలో గ్రేన్ తనను తాను వివాహం చేసుకుంది. అప్పటికి ఆమె వయసు 31. ప్రస్తుతం ఫొటోగ్రాఫర్‌గా ఫిల్మ్‌మేకర్‌గా బిజీ జీవితాన్ని గడుపుతున్న గ్రేన్, తనకు నచ్చిన వ్యక్తి ఎవరైనా తారసపడితే మళ్లీ పెళ్ళి చేసుకుంటానని చెప్తోంది.

## పుట్టినరోజు అనుకున్నారు

పుట్టినరోజు పార్టీకి వచ్చిన అతిథులు అక్కడ కనిపించిన దృశ్యం చూసి ఆశ్చర్యపోయారు. ఎందుకంటే అక్కడ జరిగింది పుట్టినరోజు పార్టీ కాదు, పెళ్ళి పార్టీ. అమెరికాలోని హ్యూస్టన్ నగరానికి చెందిన యాస్మిన్ అలెబీ జనవరి 3, 2015లో పెళ్ళి చేసుకుంది. ఆమె నలభయ్యో పుట్టినరోజునే సెల్ఫ్ వెడ్డింగ్ చేసుకుంది. ఆఫ్రికన్ అమెరికన్ మహిళల కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన హ్యూస్టన్ మ్యూజియం ఆఫ్ ఆఫ్రికన్ అమెరికన్ కల్చర్ ఈ సోలోగమీకి వేదికగా మారింది. ఈ వివాహానికి 160మంది అతిథులు వచ్చారు. అక్కడికి వచ్చిన అతిథులంతా పెళ్ళిడ్రస్‌లో ఉన్న యాస్మిన్‌ను చూడగానే ఆశ్చర్యం వ్యక్తం చేశారు. యాస్మిన్ ఇలా తనను తానే పెళ్ళి చేసుకోవడానికి ఓ కారణముంది. ఆమె గతంలో కొంతమందితో బంధం కొనసాగించింది. అయితే ఏదీ వివాహం వరకు రాలేదు. దీంతో ఎప్పటికీ పెళ్ళి చేసుకోకుండా ఉండాల్సి వస్తుందేమోనని తనని తాను వివాహం చేసుకోవాలని నిర్ణయించుకుందట యాస్మిన్. అంతేకాదు వివాహ సమయంలో తనపట్ల తాను బాధ్యతగా, ప్రేమగా వ్యవహరిస్తానని బాసలు కూడా చేసుకుంది. యాస్మిన్ ప్రస్తుతం సౌదీ అరేబియాలోని ఓ స్కూల్లో కిండర్‌గార్టెన్ టీచర్‌గా పనిచేస్తున్నది







## అబ్బాయిలు కూడా...

సోలోగమి కేవలం అమ్మాయిలకు మాత్రమే కాదు. అబ్బాయిలు కూడా తమని తాము వివాహం చేసుకోవచ్చని అంటోంది న్యూయార్క్‌కి చెందిన సాషా కెగెన్. సాషా ప్రస్తుతం సెల్ఫ్ వెడ్డింగ్ అడ్వకేట్‌గా పనిచేస్తున్నారు. నలభైయేళ్ళ వయసులో ఇద్దరు అతిథుల సమక్షంలో తనని తాను పెళ్ళి చేసుకుంది సాషా. అలాగే క్విర్కీ ఎలోన్ పేరుతో మనల్ని మనం ఎలా ప్రేమించుకోవాలో వివరించేందుకు తరగతులు నిర్వహిస్తున్నారు సాషా. ఇది అమ్మాయిలకు ఉద్దేశించినది మాత్రమే కాదు. ఒంటరిగా ఉండడానికి ఇష్టపడే అబ్బాయిలకు సైతం క్విర్కీ ఎలోన్‌లో చోటు కల్పించారామె. అలాగే ఇది పూర్తిగా సోలోగమి ప్రచారానికే పరిమితం కాదు. మనతో మన బంధాన్ని ఎలా దృఢపర్చుకోవాలో చెప్పే సంస్థ ఇది. న్యూయార్క్‌లోని క్రాన్స్‌టన్‌లో పుట్టిపెరిగిన సాషా చదువు పూర్తయ్యాక పదమూడేళ్ళు శాన్‌ఫ్రాన్సిస్కోలో టెకీగా పనిచేసింది. ప్రస్తుతం అర్జెంటీనాలో ఉంటోంది. మనల్ని మనం పెళ్ళి చేసుకోవడం ద్వారా 'మనం చేసుకున్న వాగ్దానాలను నెరవేర్చుకోవడంపై శ్రద్ధ పెట్టవచ్చు. మనసుని నొప్పించే బంధాలకు దూరంగా ఉండొచ్చు' అంటోందామె. తన పెళ్ళి సమయంలో తాను కొన్ని వాగ్దానాలను చేసుకున్నానని వాటిని నిర్లక్ష్యం చేస్తే తనని తాను నిర్లక్ష్యం చేసుకున్నట్లే అని కూడా చెబుతోందామె. అలాగే సెల్ఫ్ మ్యారేజ్ అంశంపై సాషా 2004లో 'క్విర్కీ ఎలోన్- ఎ మ్యానిఫెస్టో ఫర్ అన్ కాంప్రమైజింగ్ రొమాంటిక్స్' అనే పుస్తకం రచించారు. ఆ పుస్తకం రాశాకే ఆమె సోలోగమి చేసుకుంది.

– నివేదిత



**మరోవారంలో పంటలు కోతకొస్తాయని నాన్న, పెదనాన్న అనుకోవటం విన్నాను. నాన్న చాలా సంతోషంగా ఉన్నాడు. పొలంలో వేసిన మొక్కజొన్న, జొన్నపంటలు బాగా పండాయట. "ఈ సంవత్సరం బాగా లాభాలు వస్తాయనుకుంటున్నా. పంట అమ్మాక నీ కోసం బంగారు చెయిన్ కొంటాను రామక్రిష్ణా" అన్నాడు నాన్న.**

**ఎన్నాళ్ళయిందో నాన్నని ఇంత సంతోషంగా చూసి. పొలంలో మొక్కజొన్న విరగ కాసిందట. జొన్నకంకుల బరువుకయితే మొక్కలు పక్కకు వాలుతున్నాయట. నాన్న ఉత్సాహంగా చెప్తుంటే నాకూ చూడాలనిపించింది. ఎప్పుడడిగినా పొలంవైపు రావొద్దనే నాన్న ఆ రోజు వెంటనే ఒప్పుకున్నాడు. "రేపు ఆదివారం కదా. స్కూలు ఉండదుగా. మధ్యాహ్నం పన్నెండు తర్వాత పొలానికొచ్చేద్దువు గానీ" అన్నాడు పొలానికి వెళ్ళబోతూ.**

మరునాడు పన్నెండు దాటాక పొలానికి బయల్దేరాడు. ఎండ విపరీతంగా ఉంది. చల్లటి పూట రమ్మనకుండా మిట్టమధ్యాహ్నం ఎందుకు రమ్మన్నాడో అర్థం కాలేదు. నాన్న నా కోసమే ఎదురు చూస్తున్నట్టున్నాడు... నేను వెళ్ళేటప్పటికి పొలం గట్టుమీద నిలబడి కన్పించాడు. ఏపుగా ఎదిగిన జొన్న, మొక్కజొన్న పంటల్ని చూపించాడు. మూడు మొక్కజొన్న కంకుల్ని కోసి "ఒకటి నీకు, ఒకటి సుందరానికి, ఇంకొకటి కీర్తికి. పెద్దమ్మకి చెప్పి నిప్పులమీద కాల్పించుకుని తినండి" అన్నాడు.

నాకు పనివాళ్ళెవ్వరూ కన్పించలేదు. "నాలుగైదు రోజులు పక్షులు వాలకుండా కాపాడుకుంటే చాలు. కోతల కెళ్ళిపోవచ్చు" అన్నాడు నాన్న. పొలం మధ్యలో అక్కడక్కడా పాతిన కర్రలకు కట్టిన తెల్లటి గుడ్డలు పక్షులకు నిరసన తెలుపుతున్న జెండాల్లా గాల్లో ఎగురుతున్నాయి.

పొలమంతా తిరిగిచూశాక ఇద్దరం వెదురుబద్దల్తో కట్టిన గదిలోకెళ్ళి మంచం వాల్చుకుని కూచున్నాం.

"బాగా చదువుతున్నావు కదా. నేను పొలం పనిలో పడి నీ చదువు గురించే పట్టించుకోవడం లేదు. మీ అమ్మ ఉండి ఉంటే నీ గురించి మరింత శ్రద్ధ తీసుకుని ఉండేది" అన్నాడు.

అమ్మ ప్రస్తావన వచ్చినప్పుడల్లా నాన్న కళ్ళల్లో బాధ చూశాను. "బాగా చదువుతున్నాను నాన్నా" అన్నాను.

"నీకు రోజూ పప్పుచారుతోనో, ఏదో ఓ కూరతోనో అన్నం పెట్టడంతప్ప రకరకాల వంటలు చేసిపెట్టలేకపోతున్నారా. నాకు చాతకావడం లేదు. అమ్మ ఉన్న రోజుల్లో ఆదివారం వస్తే చాలు కోడి కూరో, చేపల వేపుడో చేసి పెట్టేది" అన్నాడు.

"పర్లేదు నాన్నా... నాకలాంటివి తినాలన్న కోరిక ఏమీ ఉండదు. అయినా అప్పుడప్పుడూ పెద్దమ్మ చేసి పంపుతూనే ఉంటుందిగా" అన్నాను.

"వద్దంటే వదిన బాధపడ్తుందని తీసుకోవటం తప్ప నాకు ఇష్టం ఉండదు. మనం వేరే వాళ్ళ నుంచి సాయం పొంది వాళ్ళకు రుణపడటం కన్నా మనకు చాతనైనదేదో చేసుకుని గుట్టుగా ఉండటాన్నే ఇష్టపడతాను".

"నాకూ అలానే ఇష్టం నాన్నా" అన్నాను.

అప్పుడే లోపలికి ఓ స్త్రీ ప్రవేశించింది. వయసు ముప్పయి ఐదుకి అటూ ఇటూగా ఉండొచ్చు. కళ్ళకు కాటుక, నుదుట బొట్టు ఉన్నాయి. ఆమె చేతిలో స్టీల్

## జరిగిన కథ

ఒంగోలు దగ్గర చిన్న పల్లెటూరు. వాళ్ళిద్దరిదీ చూడముచ్చటైన జంట. వారికి ఒక్కడే కొడుకు, రామకృష్ణ. ఆరోజు రామకృష్ణ తల్లి వసుధ కొడుక్కి ఎన్నో జాగ్రత్తలు చెప్పి, పేరంటానికని వెళుతుంది. కానీ తిరిగి రాదు. ఆమె కోసం ఊరంతా గాలిస్తారు. చివరకు ఆమె ఎవరితోనో వెళ్ళిపోయిందని తెలుస్తుంది. భార్యమీద దిగులుతో తండ్రి మంచానపడడంతో, రామకృష్ణ విజయవాడ వెళ్ళి ఆమెకోసం గాలిస్తాడు. కానీ దొరకదు. తిరిగి తండ్రి దగ్గరకు వచ్చేస్తాడు.

ఆ తర్వాత....

# అన్వేషణ 4

-సలీం

క్యారేజ్ ఉంది. నాన్నవైపు చూసి నవ్వుతూ "ఆకలేస్తోందా?" అని అడిగింది. నాన్న సమాధానం చెప్పేలోపు "మాంసం కూర ఉడకటం ఆలస్యమైంది" అంటూ రెండు కంచాలు కడిగి మా ముందు పెట్టింది.

నాన్న ఆమె ఎవరో చెప్పకున్నా వెంకటలక్ష్మి అని అర్థమైంది. నాన్న ఆమెతో సన్నిహితంగా ఉంటాడన్న ఊహకే ఆమెను చూస్తే అసహ్యం వేయసాగింది. మా అమ్మ స్థానాన్ని ఆక్రమించిం దన్న ఆలోచనకే ఆమె మీద కోపం రాసాగింది.

ఆమె క్యారేజీ గిన్నెలు విప్పి రెండు కంచాల్లో అన్నం, గోంగూర మాంసం కూర వడ్డించింది.

"నీకోసమే వండించానురా. నీకు గోంగూర మాంసం అంటే ఇష్టం కదా. అమ్మనడిగి మరీ వండిం చుకునే వాడివి కదా" అన్నాడు నాన్న.

"ఇప్పుడు నాకు ఇష్టం లేదు" అన్నాను.

"వేడిగా ఉన్నప్పుడు తింటేనే బావుం టుంది. తినరా" అంటూ నాన్న అన్నంలో కూర కలుపుకుని ముద్ద నోట్లో పెట్టుకు న్నాడు. "చాలా రుచిగా ఉంది. తిని చూడు, నీకు బాగా నచ్చుతుంది" అన్నాడు.

"నాకు ఆకలిగా లేదు నాన్నా" అన్నాను మొహం పక్కకు తిప్పుకుని.

"అలాగంటే ఎలారా? ఇదంతా నీ కోసమేగా చెప్పి చేయించాను" తినడం ఆపేసి అన్నాడు.

"పెద్దమ్మ వండి పంపితే వద్దన్నవాడివి ఈమె తెచ్చిన అన్నం ఎలా తింటున్నావు? ఇది వేరే వాళ్ళకు రుణపడటం కాదా? నాకొద్దు. నేను ఇంటి కెళ్ళిపోతాను."

"మధ్యాహ్నం భోజనం ఇక్కడే చేస్తావని ఇంట్లో వంట కూడా చేయలేదు" అన్నాడు. నాన్న కళ్ళల్లో ఇప్పుడు అపరాధభావమేదో కన్పిస్తోంది.

"పర్లేదు. నాకూ వంట చేయడం వచ్చు. ఇంటి కెళ్ళి వండుకుని తింటాను. లేదంటే పస్తుంటాను. అంతే తప్ప ఈమె తెచ్చిన అన్నం మాత్రం ముట్టుకోను" అంటూ లేచి బైటికి పరుగెత్తాను.

నాన్న వెనకనుంచి 'రామక్రిష్ణా... ఆగరా...' అని పిలుస్తున్నా వినిపించుకోకుండా ఇంటివైపు పరిగె త్తాను.

ఇంటికొచ్చాక మంచంమీద పడిపోయి చాలా సేపు ఏడ్చాను. ఎందుకేడ్చానో నాకే తెలియదు. నాన్న ఎవరితో శారీరక సంబంధం పెట్టుకు న్నాడో ఆమెని మొదటిసారి చూసినందు వల్ల కలిగిన ఏహ్యాభావమా? ఈ విష యంలో ఆమెనొక్కదాన్నే అసహ్యించు కోవటం ఎంతవరకు న్యాయం? అలా గయితే నాన్నని కూడా అసహ్యించు కోవాలిగా... నాన్నంటే నాకిష్టం కాబట్టి, తప్పు ఇద్దరిదీ అయినా ఆమె మీదే కోపం వచ్చిందేమో. అమ్మ వండే గోంగూర మాంసం కూర ఆమె చేత వండించాడని కోపమా? వేరేవాళ్ళు వండింది మనం తినాల్సిన అవసరమే ముంది, మనమే వండుకుందాం అన్న నాన్న పరాయి స్త్రీ వండి తెస్తే తింటున్నాడన్న బాధా? నన్ను కూడా తినమన్నందుకు బాధా?

ఇవేవీ కాదేమో.. ఆమెతో సంబంధం పెట్టుకున్నాక నాన్న సంతోషంగా ఉన్నాడని పెద్దమ్మ చెప్పిందిగా. పెదనాన్న ఆ విష యంలో హెచ్చరిస్తానన్నా వద్దని చెప్పిందిగా. మరి నేనెందుకు నాన్నని నిలదీశాను? నాన్న ఎంత



బాధపడి ఉంటాడో? కొడుకుచేతనే ఛీ అనిపించుకున్నందుకు ఎంతగా కుమిలిపోయాడో? ఎంత అనాలోచితంగా నాన్నను గాయపర్చానో... అందుకనుకుంటా ఈ ఏడుపు... లేక ఈ కారణాలన్నీ కలిసిపోయి కలగాపులగమై ఏడుపు తన్నుకు వచ్చిందేమో.

ఆకలి వేయటం లేదు. ఏమీ తినాలనిపించటం లేదు. నా దుఃఖం కరిగిపోయేలా ఏడ్వాలని పిస్తోంది. ఎంత ఏడ్చినా అది కరిగిపోవటం లేదే. రాయిలా మారిపోయిన దుఃఖం.

నిద్ర పట్టేసింది. లేచేటప్పటికి చీకట్లు ముసురుకుని ఉన్నాయి. చల్లటి గాలి వీస్తోంది. గోడ గడియారం వైపు చూశాను. సమయం నాలుగూ నలభై... మరి అప్పుడే చీకటిపడటం ఏమిటి? ఇంటి బైటికొచ్చి ఆకాశం వైపు చూశాను. దట్టంగా కమ్ముకొచ్చిన మేఘాలు.

నాన్న ఆరు కాకముందే ఇంటికొచ్చేశాడు. నాన్న వచ్చే సమయానికే సన్నటి జల్లు కురవ సాగింది. నాన్న మొహం వైపు చూడటానికే భయమేసింది. నాన్న కూడా నన్ను తప్పించుకునే తిరుగుతున్నాడని అర్థమైంది. నేనున్న చోట నాన్న ఉండటం లేదు. ఏదో పని కల్పించుకుని వేరే చోటు కెళ్ళి కూచుంటున్నాడు.

వర్షం పెద్దదయింది, ఆకాశం నిర్మించుకున్న నీటి ట్యాంకులన్నీ ఒక్కసారిగా బద్దలయి పోయి నట్టు... ఓరకంటితో నాన్న మొహంవైపు చూశాను. నల్లటిమేఘాలు ఆవరించిన ఆకాశంలా ఉంది. నాన్న కళ్ళల్లోంచి దుఃఖం వర్షంలా కురుస్తున్నట్టనిపించింది. చప్పున నాన్న దగ్గరకెళ్ళి మెడచుట్టూ చేతులేసి 'సారీ నాన్నా... నువ్వేం చేసినా నాకిష్టమే. అది పదిమంది దృష్టిలో తప్పయినా పర్లేదు. నువ్వు సంతోషంగా ఉంటే చాలు' అనాలన్న కోరిక.

నేను నాన్నతో మాట్లాడదామని ముందుకు రెండడుగులు వేశానో లేదో పెదనాన్న జడి వానలా లోపలికి దూసుకొచ్చాడు. వర్షంలో తడుస్తూనే పరుగెత్తుకు రావడం వల్ల అతని బట్టలపై నుంచి నీళ్ళు కారి ఇల్లంతా తడిపేశాయి. "తుఫాను అంటున్నార్రా.... మన పంటల్ని తల్చుకుంటే భయమేస్తోంది. నాలుగైదు రోజులు పోతే కోతలైపోయి ఉండేవి. చేతికొచ్చిన ధాన్యమంతా నీళ్ళపాలయ్యేలా ఉందిరా" అన్నాడు.

"ఈ సమయంలో వర్షాలేమిటో అనుకుంటున్నాను. తుఫాను అన్నమాట. ఏం చేద్దామంటావ్" అన్నాడు నాన్న.

"మన చేతుల్లో ఏముంది? ఈ తుఫాన్ ఎక్కువ నష్టం కలిగించకముందే తగ్గిపోవాలని కోరుకోవటం తప్ప" అన్నాడు పెదనాన్న.

పెద్దగా ఉరుములు..... గాలి విపరీతమైన వేగంతో వీస్తోంది. పెదనాన్న వెళ్ళిపోయాక నాన్న వంట మొదలెట్టాడు. అంతా పరధ్యానంగా చేశాడు. అన్నాలు తింటున్నప్పుడు కూడా ఏమీ మాట్లాడ లేదు. తల వంచుకుని తిని లేచాడు. నేను కూడా ఏమీ మాట్లాడలేదు.

మరునాడంతా వర్షం పడుతూనే ఉంది. కుంభ వృష్టి అంటారే... అలాంటి వర్షం. రెండో రోజు మధ్యాహ్నానికి కొంత తెరిపిచ్చింది. నాన్న పెదనాన్నతో కలిసి పొలానికెళ్ళి వచ్చాడు. ఇద్దరూ మొహాలు వేలాడేసుకుని వచ్చారు. పంటంతా నాశనమైపోయిందట. పెట్టుబడి మొత్తం తుడిచిపెట్టుకుపోయిందట. నాన్న దిగులుగా తలపట్టుకు కూచున్నాడు.

"పోయినేడాది వర్షాలు సకాలంలో పడక పంట నష్టపోయాం. ఆ ముందటేడాది విత్తనాలు నకిలీవని తెలీక వాటిని నాటి మొక్కవచ్చినా గింజపడక నష్టపోయాం. మూడేళ్ళుగా వరసగా నష్టాలు తప్ప రూపాయి లాభం కళ్ళచూళ్లేదు. ఈ నష్టమంతా ఎప్పటికి పూడుతుందో ఏమిటో? మన అయ్య మన కోసం ఇరవై ఎకరాలు సంపాదించి ఇచ్చిపోయాడు. మనం మన పిల్లలకు ఆస్తులు బదులు అప్పులు ఇచ్చిపోతామేమోనన్న భయం వేస్తోందిరా" అన్నాడు పెదనాన్న.

**రామకృష్ణకి ఆకలి వేయటం లేదు. అసలేమీ తినాలనిపించడం లేదు. అతనికి దుఃఖం కరిగిపోయేలా ఏడవాలని ఉంది. కానీ ఎంత ఏడ్చినా కరిగిపోవటంలేదే! ఇంతలో పొలం నుంచి వచ్చిన తండ్రిని చూశాడు. కానీ తండ్రి అతన్ని పలకరించలేదు. కనీసం కన్నెత్తి చూడలేదు. తప్పించుకు తిరుగుతున్నాడు. ఎందుకని? అసలేం జరిగింది?**

నాన్న మొహం చూస్తే భయమేసింది. పది లంఖణాలు చేసినవాడిలా కన్పిస్తున్నాడు. కళ్ళ కింద నల్లటి వలయాలు మందంగా ఏర్పడ్డాయి. కళ్ళల్లోకి చూసి మాట్లాడటం లేదు. మాట కూడా నూతిలోంచి వస్తున్నట్టు బలహీనంగా విన్పిస్తోంది.

పెదనాన్న వెళ్ళిపోయాక నేను నాన్న పక్కన కూచుని "నువ్వు దిగులుపడకు నాన్నా, పంట పోతే పోయిందిలే. నేను బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం తెచ్చుకుంటా. నాకు నువ్వేమీ ఆస్తులు ఇవ్వక్కరలేదు. నువ్వు సంతోషంగా ఉంటే చాలు నాన్నా" అన్నాను.

నాన్న నన్ను వాటేసుకుని పెద్దగా ఏడ్చాడు. ఎప్పటినుంచి దాచుకున్న దుఃఖమో కట్టలు తెంచుకుని కన్నీళ్ళ రూపంలో ప్రవహించింది.

"నన్ను క్షమించరా రామక్రిష్ణా" అన్నాడు.

"తుఫాను వల్ల పంట నష్టపోతే అందులో నీ తప్పేముంది నాన్నా" అన్నాను.

నాన్న ఏమీ మాట్లాడలేదు. రాత్రి ముభావంగానే ఉన్నాడు. యాంత్రికంగా పనులు చేస్తున్నట్లే అన్పించింది.

ఉదయం లేచాక వంట చేసి పెట్టాడు. పొలానికి వెళ్ళేముందు నన్ను దగ్గరకు పిలిచి "బాగా చదువుకుంటావుగా నాన్నా" అన్నాడు. నాన్న నన్ను రామక్రిష్ణా అని పిలవటం తప్ప నాన్నా అని పిలవడం చాలా అరుదు. నిన్ననేగా చెప్పాను బాగా చదువుకుని మంచి ఉద్యోగం తెచ్చుకుంటానని. మళ్ళా ఎందుకడుగుతున్నాడో అర్థం కాలేదు. చదువుకుంటానని చెప్పాను.

"వంట చేయడం నేర్పాను కదా, చేసుకోగలవా?" అన్నాడు.

"నువ్వు చేస్తావుగా నాన్నా... నీకు వంటలో సాయం చేస్తున్నాగా" అన్నాను.

"నాకు జ్వరమో జబ్బో చేస్తే నువ్వే నాకు వండి పెట్టాలిగా నాన్నా" అన్నాడు.

"చేస్తాను నాన్నా. నాకు బాగానే వచ్చు" అన్నాను.

నా భుజం మీద చేయివేసి ప్రేమగా నా కళ్ళల్లోకి చూస్తూ "ఇక పొలానికి వెళ్ళనా రామక్రిష్ణా" అన్నాడు.

ఈరోజు నాన్న ప్రవర్తన వింతగా ఉందేమిటా అనుకుంటూనే స్కూల్‌కి వెళ్ళాను. నిన్న నాన్నతో నాకు ఆస్తులివ్వకున్నా పర్లేదు. నువ్వు సంతోషంగా ఉంటే చాలని అన్నాగా. దాని ప్రభావం వల్లేమో

## కవిత్వమై ...




**చూ**పు ఆనినంతమేర
హొయలుపోతున్న ఈ స్నిగ్ధ హరితంలో
ఏకాంతమై స్నానించాలని వుంది.

వెన్నెల కెరటాల గిలిగింతలకు
పొరలి పొరలి నవ్వుతున్న
చిరుగాలినై
హాయిగా తేలిపోవాలని వుంది.

గుండె గుట్టమీద
పక్షితనాన్ని కూర్చుండబెట్టుకొని
నింగి చూరులో నగ్నంగా
జాబిలినై వేలాడాలనివుంది.

తుడుందెబ్బ మోగించి, గూడెంతో నర్తించి
ధింసా కేరింతల సంబరాన్ని వెలిగించి
రాత్రి మేను మీద రహస్తంత్రులను మీటి
మన్నెంతో పున్నమిని అలంకరించాలనివుంది.

ఒక పురాతన నిశ్శబ్దాన్ని
లయబద్ధంగా పాడుకుంటున్న
ఈ జలపాతంలో తడిసి
ఆధునికత మాటున అంటిన
కపటత్వాన్ని కడుక్కోవాలనివుంది.

ఈ నిసర్గ, నిర్మలలోకంలో
శ్రమైక జీవన స్వేదమై ప్రవహించి
సస్యశ్యామల దేహమై పైకిలేస్తున్న
ఆదివాసీ ఆత్మను మనసారా హత్తుకుని
మనిషితనాన్ని మళ్ళీ  కొత్తగా
పొదువుకోవాలనివుంది.

కత్తి ఎగిసి మీద పడుతున్నాబెదురు
చూపులెరుగని పచ్చని ధైర్యాన్ని
అక్షరాల్లో నింపుకుని
కవిత్వమై కళ్ళు తెరవాలనివుంది.

—పక్కి రవీంద్రనాథ్
సెల్: 9440364486

ననుకుని సమాధానపడ్డాను.

సైన్స్ పీరియడ్ అయిపోయింది. తర్వాత లెక్కల పీరియడ్. మాస్టారువచ్చి బోర్డు మీద లెక్క చేస్తుంటే నోట్‌బుక్‌లో రాసుకుంటున్నా. ద్వారం దగ్గర పెదనాన్న వచ్చి నిలబడ్డాడు. మాస్టారితో "మా రామక్రిష్ణని ఇంటికి పిల్చుకెళ్ళటానికి వచ్చాను. దయచేసి పంపించండి" అన్నాడు.

మాస్టారి అనుమతి లభించగానే పుస్తకాలు సంచిలో సర్దుకుని పెదనాన్న దగ్గరకెళ్ళి "ఇంటికెందుకు పెదనాన్నా? లెక్కల పీరియడ్ జరుగుతోంది. ఈ పీరియడ్ అయ్యాక వస్తాలే. నువ్వెళ్ళు" అన్నాను.

"లేదు క్రిష్ణా! చాలా ముఖ్యమైన పని పడింది. నువ్వు రాక తప్పదు. తొందరగా ఇంటికెళ్దాం పద" అన్నాడు. పెదనాన్న చాలా గంభీరంగా ఉండటం గమనించాను.

"ఏం పనో చెప్పు... వస్తాను" అన్నాను.

"నాన్నకు బాగాలేదురా. నిన్ను చూడాలంటున్నాడు" అన్నాడు. పెదనాన్న కళ్ళలో నీళ్ళూరటం చూశాను. నాకు ఊహ తెలిశాక పెదనాన్న కంట తడిపెట్టడం ఇదే మొదటిసారి.

నాలో కంగారు మొదలైంది. పెదనాన్న పెద్ద పెద్ద అంగలేస్తూ నడుస్తుంటే ఆయన పక్కన పరుగెత్తుతున్నట్టే నడుస్తూ "ఏమైంది నాన్నకు?" అని అడిగాను.

"సీరియస్ ఏమీ కాదు. కళ్ళు తిరిగి పడిపోయాడు. అంతే" అన్నాడు.

"ఎక్కడ పడ్డాడు? దెబ్బలేమైనా తగిలాయా?"

"పొలంలో పడిపోయాడు. ఇంటికి తెచ్చాం. పర్వాలేదు. పెద్దగా దెబ్బలేమీ తగల్లేదు" అంటున్నప్పుడు పెదనాన్న గొంతు దుఃఖంతో వణికింది.

బాగా దెబ్బలు తగిలి ఉంటాయనిపించింది. లేకపోతే పెదనాన్న అంతగా ఎందుకు బాధపడ్తాడు? కన్నీళ్ళెందుకు పెట్టుకుంటాడు?

ఆ ఆలోచన రాగానే మరింత వేగంగా నడిచాను. ఇంటికి వెళ్ళేటప్పటికి వసారాలో చాలామంది గుమికూడి ఉన్నారు. నాన్న వసారాలోనే చాపమీద పడుకుని ఉన్నాడు. మంచం మీద కాకుండా కింద ఎందుకు పడుకోబెట్టారో అర్థం కాలేదు.

నన్ను చూడగానే నా కోసమే ఎదురుచూస్తున్నట్టు ఆయన కళ్ళు క్షణకాలం పాటు మెరిశాయి.

"ఏమైంది నాన్నా నీకు" అన్నాను ఆయన తల దగ్గర కూర్చుని తలని నా ఒళ్ళోకి తీసుకుంటూ.

నాన్న నావైపు దీనంగా చూశాడు తప్ప ఏమీ మాట్లాడలేదు. పెదనాన్న సమాధానం ఇచ్చాడు. "నాన్న పొలానికెళ్ళి అక్కడ పురుగుల మందు తాగాడ్రా. తాగి చాలాసేపయి ఉంటుంది. అక్కడే కింద పడివుంటే ఎవరో చూసి నాకు కబురు పెట్టేటప్పటికి జరగాల్సిన నష్టం జరిగి పోయింది. అప్పటికే స్పృహలో లేడు. ఇంటికి తెచ్చి కొన్ని ఉపచారాలు చేశాక కొద్దిగా స్పృహ వచ్చింది. నీ పేరు పలవరించాడు. అందుకే నీకోసం పరుగెత్తుకుంటూ వచ్చా" ఏడుస్తూనే చెప్పాడు పెదనాన్న.

నాన్న ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ మాట బైటికి రావడం లేదు.

"నాన్నని ఆస్పత్రికి తీసుకెళ్దాం పెదనాన్నా" అన్నాను.

"లాభం లేదురా క్రిష్ణా. అంతా అయిపోయినట్టే. వాణ్ణి ఇంటికి తీసుకురాగానే ఇక్కడి డాక్టర్‌కి కబురెట్టాం. ఆయనొచ్చి చూసి ఒంగోలు ఆస్పత్రికి పిల్చుకెళ్ళేంత సమయం లేదనీ, వెళ్ళినా ప్రయోజనం ఉండదనీ చెప్పాడు. ఇవే చివరి క్షణాలు... మూడేళ్ళుగా నాకూ వ్యవసాయంలో నష్టాలు వచ్చాయి. వ్యవసాయం అన్నాక తప్పదు. ఒకసారి లాభం వస్తే మరోసారి నష్టం రావొచ్చు. నష్టాలొచ్చాయని ఇలా ప్రాణాలు తీసుకుంటారా ఎవరైనా?" అన్నాడు.

నాన్న కళ్ళు నన్నే చూస్తున్నాయి. ఆ కళ్ళు కూడా ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తున్నాయి. వెక్కివెక్కిఏడుస్తూనే "ఇలా నన్ను ఒంటరిగాచేసి వెళ్తున్నావా నాన్నా... నాకోసమే బతుకుతున్నా నన్నావుగా. మరి ఎందుకు చావాలనుకున్నావు?" అన్నాను.

"నన్ను క్షమించు రామక్రిష్ణా" అనే మాటలు చాలా ముద్దగా బలహీనంగా విన్పించాయి. నాన్న అతి కష్టం మీద మాట్లాడుతున్నాడు.

"ఎందుకిలా చేశావు నాన్నా... పంట నష్టం

## మనమీదేనర్రోయ్!

సరసి





వస్తే ఏమైంది?” అన్నాను.

నాన్న విషాదంగా నవ్వాడు. “నీకు ఆదర్శంగా బతకాల్సిన మేమే తప్పులు చేశాం. నువ్వు ఇవేమీ మనసులో పెట్టుకోకు. గొప్పవాడివనిపించుకో. నాకిష్టమైన రామక్రిష్ణ పరమహంస పేరుపెట్టాను. దాన్ని సార్థకం చేసుకో” అన్నాడు నాన్న. ఇంకా ఏదో మాట్లాడబోయి ఓపికలేక ఆయాసపడుతూ ఆగిపోయాడు. అసహాయంగా నా వైపు చూశాడు.

పెదనాన్న తులసి నీళ్ళు తీసుకురమ్మని సుందరాన్ని పురమాయించాడు. సుందరం రాగి చెంబులో నీళ్ళనింపి అందులో తులసాకులు వేసి తెచ్చి నా చేతికిచ్చాడు.

“నాన్న గొంతులో తులసి తీర్థం పోయి క్రిష్ణా” అన్నాడు పెదనాన్న.

రెండు చెంచాలు నాన్న నోట్లో పోశాను. గుటక వేయలేక పోతున్నాడు.

నాన్న కళ్ళు బేలగా నావైపు చూస్తున్నాయి. ‘నిన్నొదిలి పోతున్నందుకు నన్ను క్షమించవా’ అంటున్నట్టు.

నేను ఏడుస్తున్నాను. పెదనాన్న ఏడుస్తున్నాడు. చుట్టూ పెద్దమ్మ, సుందరం, కీర్తి నిలబడి ఉన్నారు. అప్పుడే రిక్షాలోంచి రమత్త, కాత్యాయని, మామయ్య దిగినట్టున్నారు. అత్త ఏడుస్తూనే పరుగెత్తుకుంటూ వచ్చి “ఎంత పని చేశావన్నయ్యా” అంటూ నాన్న గుండెల మీద పడిపోయి బిగ్గరగా రోదించింది.

నాన్న అత్తవైపు కళ్ళుతిప్పి చూశాడు. తర్వాత కాత్యాయని వైపు చూశాడు. మళ్ళా నా వైపు చూశాడు. నాన్న కనుకొలకుల్లోంచి కన్నీళ్ళు పక్కకు జారిపోతున్నాయి.

“నువ్వేం చెప్పాలనుకుంటున్నావో నాకర్థమైందన్నయ్యా. రామక్రిష్ణని నా స్వంత కొడుకులా చూసుకుంటాను” అంది అత్త.

నాన్న పెదనాన్న వైపూ, పెద్దమ్మ వైపూ చూశాడు. మళ్ళా నా వైపు చూస్తూ గుటకేశాడు. ప్రాణం ఎప్పుడు పోయిందో తెలియదు. కళ్ళు మాత్రం నాపైనే నిలిచి ఉన్నాయి.

***

దహన సంస్కారాలు పూర్తయ్యాక రమత్త భర్త ఒంగోలు వెళ్ళిపోయి మళ్ళా దశదినకర్మ రోజు వచ్చాడు. ఈ పది రోజులూ రమత్త నాకు వండి పెడుతూ ఇంట్లోనే ఉండిపోయింది.

కర్మకాండలు పూర్తయ్యాక నా బాధ్యత ఎవరు తీసుకోవాలనే విషయం మీద తర్జన భర్జన జరిగింది. మా ఇంటి వసారాలో చాపలు పరిచారు. పెద్దమ్మ, పెద్దనాన్న, అత్తామామయ్యలతో పాటు ఊరి పెద్దలు కూడా హాజరైనారు.

“చిన్నన్న చనిపోయేముందు తన కనుసైగల ద్వారా బాబుని చూసుకోమని నాతో చెప్పాడు కదా. ఎలాగూ ఈ యేడాదితో రాము పదో తరగతి పాసవుతాడు. వచ్చే యేడు ఇంటర్ కొస్తాడు. ఈ ఊళ్లో పదో తరగతి వరకేగా ఉంది. ఇంటర్ చదవాలంటే ఒంగోలుకి రావాల్సిందే. మా ఇంట్లో ఉంటే రోజూ ఈ ఊరి నుంచి ఒంగోలు వచ్చే శ్రమ తగ్గుతుంది. అందుకే నా దగ్గర పెట్టుకుని చదివిస్తాను. నాకు చిన్నన్నకిచ్చిన మాటని నిలబెట్టుకున్నానన్న తృప్తీ ఉంటుంది” అంది అత్త.

“తమ్ముడు చివరిక్షణాల్లో నా వైపు కూడా చూశాడు. క్రిష్ణ మా దగ్గరే ఉంటాడు. సుందరం రోజూ స్కూటర్ మీద ఒంగోలు వెళ్ళి చదువుకోవడం లేదా? వాడితో పాటు వీడూ వెళ్తాడు. అదేమీ సమస్య కాదు. ఇక వాడెక్కడ ఉన్నా ఎవ్వరి మీదా ఆర్థిక భారం పడదు. తమ్ముడి పేర్న ఉన్న పదెకరాల పొలాన్ని నేనే సాగుచేసి, దాని ద్వారా వచ్చిన సొమ్ముని బ్యాంక్ ఖాతా తెరిచి అందులో వేస్తాను. మరీ నా పదెకరాల్తో పాటు వీడి పదెకరాల్ని కూడా సాగుచేయ లేననుకుంటే కౌలుకిస్తాను. వాడి చదువుకీ ఇతర ఖర్చులకీ ఆ డబ్బులు సరిపోతాయి” అన్నాడు పెదనాన్న.

“ఇక్కడ వాడికయ్యే ఖర్చుల గురించి ప్రస్తావన ఎందుకన్నా... వాడు నా చిన్నన్న కొడుకు. రక్త సంబంధం... నాకేమీ బరువుకాదు. నా కూతురు కాత్యాయనితో పాటు కలిసి చదువు కుంటాడు. నాకు డబ్బులేమీ అక్కరలేదు. అవి బ్యాంక్‌లో వేసి వీడు పెద్దయ్యాక వీడి చేతిలో పెట్టు... చాలు” అంది అత్త.

“నువ్వు ఒప్పుకున్నా నీ మొగుడు ఒప్పుకోవాలి కదా” అన్నారు ఊరి పెద్దలు.

“నా మొగుడు నా మాట కాదనడు” అంది ధైర్యంగా. మామ ఏదైనా అంటాడేమోనని ఎదురు చూశాను. అతను అత్త చెప్పేదానికి తల ఊపాడు తప్ప ఏమీ మాట్లాడలేదు.

“నాన్నా... రామక్రిష్ణ మనింట్లోనే ఉంటాడు. చెల్లి క్లాసేగా. ఇద్దరూ కలిసి చదువుకుంటారు. కాలేజ్ కెళ్ళాలంటే నా స్కూటర్ మీద తీస్కెళ్తాను. వాణ్ణి ఎక్కడికీ పంపొద్దు నాన్నా” అన్నాడు సుందరం.

సుందరం అన్నకు నేనంటే ఎంతిష్టమో నాకు తెలుసు.

ఊరి పెద్దలు పెదనాన్న వైపు చూశారు.

“నేను ముందే చెప్పాగా. క్రిష్ణ మా ఇంట్లోనే ఉంటాడు. నాకు ముగ్గురు పిల్లలనుకుంటాను” అన్నాడు పెదనాన్న.

ఊరి పెద్దలు “నీ అభిప్రాయమేమిటి రామక్రిష్ణా?” అని అడిగారు.

నాకు నేను పుట్టిపెరిగిన ఇల్లు వదిలి వెళ్ళాలని లేదు. ఈ ఇంటితో ముడిపడి ఎన్ని జ్ఞాపకాలో... అమ్మ వెళ్ళిపోయిన క్షణం వరకు అన్నీ మధురమైన జ్ఞాపకాలే. తర్వాత నాన్న కన్నీళ్ళనీ, నాన్న పడిన మానసికహింసనీ ఈ ఇంట్లోనే ప్రత్యక్షంగా చూశాను.

“నేనిక్కడే ఉంటాను. ఈ ఇంట్లోనే ఉంటాను” అన్నాను.

నా ఆలనాపాలనా పెదనాన్న చూసుకునే విధంగా తీర్మానం జరిగింది. మా పదెకరాల పొలం ద్వారా వచ్చిన ఆదాయంలో నా ఖర్చులు పోను మిగతాది నా పేరున బ్యాంక్‌లో జమ చేయాలని నిర్ణయించబడింది.

“ఇది మీ కుటుంబ వ్యవహారం. అయినా అమ్మానాన్న లేని పిల్లాడికి న్యాయం జరగాలన్న ఉద్దేశంతోనే ఈ ఊరి పెద్దలం కల్పించుకున్నాం. నీ తమ్ముడూ నువ్వూ ఎంత సఖ్యంగా ఉండేవారో మా అందరికీ తెలుసు. నీ మంచితనమూ తెలుసు. డబ్బు పాపిష్టిది. నీకు మాట రాకుండా వీడికి సంబంధించిన డబ్బు లెక్కలు జాగ్రత్తగా రాసి పెట్టు” లేచి వెళ్ళబోతూ పెదనాన్నతో ఊరి పెద్దలన్న మాటలవి.

నేను తన దగ్గర ఉండటానికి ఒప్పుకోకుండా పెదనాన్న దగ్గర ఉంటానన్నందుకు అత్త మొహం మాడ్చుకుంది. చాలాసేపు నాతో మాట్లాడలేదు. అత్తకు కోపం వచ్చి ఉంటుందని నాకర్థమైంది.

నాకు వంట చేసిపెట్టి ఒంగోలు తిరిగి వెళ్ళే ముందు అడిగింది. “అలా ఎందుకన్నావు రామూ? మీ అమ్మకన్నా బాగా చూసుకునేదాన్నిరా. నీకూ సౌకర్యంగా ఉండేది. మా ఇంట్లో ఉంటే కాలేజీకి వెళ్ళి రావడం సులభమయ్యేది కదా. నీకు చదువుకోడానికి ఎక్కువ సమయం దొరికేది”.

అత్త ఇలా అడుగుతుందని ఊహిస్తున్నదే కాబట్టి సమాధానం తయారుగా పెట్టుకున్నాను. “నువ్వంటే నాకు చాలా ఇష్టమత్తా. కానీ ఇంటితో నాకున్న అనుబంధం నన్ను కట్టిపడేసింది. నాన్న జ్ఞాపకాలన్నీ ఈ ఇంటితోనే ముడిపడి ఉన్నాయి. ఈ ఇల్లు వదిలి రావడం ఇష్టం లేక అలా అన్నాను కానీ నువ్వు మా అమ్మ కన్నా ప్రేమగా చూసుకుంటావని నాకు తెలియదా?” అన్నాను.

రమత్త ఏమీ మాట్లాడలేదు. ఆమెను మరింత చల్లబర్చాలని “కాలేజీలో చేరాక మధ్యమధ్యలో మీ ఇంటికి వస్తుంటాన్లే అత్తా” అన్నాను.

“అలా చుట్టపు చూపుగా రావడం కాదు. వారంలో రెండు మూడు రోజులు మా ఇంట్లో ఉండి పోవాలి” అంది.

“అలాగే అత్తా” అన్నాను.

నాన్న చనిపోయాక అనాథగా మిగిలినా, నా పోషణ బాధ్యత తీసుకోడానికి రమత్తా పెదనాన్నా పోటీపడటం కొంత మనశ్శాంతినిచ్చింది. నేను అనాథను కాను. నాకు నా అనే వాళ్ళున్నారన్న భరోసా.. ఒకవేళ నాన్న పేరున ఈ ఇల్లు, పదెకరాల పొలం లేకుండా ఉన్నా వీళ్ళు అలానే పోటీ పడేవాళ్ళా? ఏమో... నన్ను అల్లుడిని చేసుకోవచ్చని రమత్త ఉత్సాహం చూపేదేమో.. ఏదైనా ఇలాంటి విషయాల్లో స్వలాభాలు, ఆస్తులు ముఖ్య భూమిక పోషిస్తాయని తెలియని వయసు నాది.

**(ఇంకా వుంది)**

## రేడియోలో మొదటి తెలుగు నాటకం


ఆచంట జానకీరామ్

రేడియోలో ప్రసారమైన మొదటి తెలుగు నాటకం ‘అనార్కలి’. *1938*, జూన్ నెలలో మద్రాసు రేడియో కేంద్రం నుంచి ఈ నాటకం ప్రసారమైంది. శ్రీయుతులు విశ్వనాథ సత్యన్నారాయణ, వింజమూరి నరసింహారావు, ముద్దుకృష్ణ రచనల ఆధారంగా ఆచంట జానకీరామ్ ఈ సంగీతప్రధాన నాటకాన్ని తయారు చేశారు. ఇందులో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు సలీం పాత్ర పోషించడం విశేషం అని ‘నా అంతరంగం’ పుస్తకంలో పి.పాండురంగారావుగారు పేర్కొన్నారు.

**సేకరణ: ఎన్. తారకరామారావు**




# కాలం మారిపోయింది

**పేపర్ మొదటి పేజీలో టైటాన్ యాడ్ చూసిన వెంటనే- వాచీని రిపేర్ చేయించుకోవాలనే విషయం గుర్తుకొచ్చింది. ఆఫీసుకు వెళ్లేటప్పుడు కుదరదు కాబట్టి వచ్చేటప్పుడు చేయించుకుందామనుకున్నా! సందర్భం వచ్చింది కాబట్టి నా వాచీ గురించి చెప్పాలి.**

నేను డిగ్రీలో చేరినప్పుడు అమ్మ కొనిచ్చిన స్ప్రింగ్ వాచీ అది. భౌతికమైన వస్తువులకు అభౌతిక విషయాలు అంటవు అంటారు కానీ.. భౌతికమైన విషయాలతోనే మన జ్ఞాపకాలు. ఇంకా చెప్పాలంటే



మన జీవితాలు ముడిపడి ఉంటాయి. అందుకే నేను ఉద్యోగంలో చేరిన తర్వాత, రకరకాల వాచీలు కొనుక్కున్న తర్వాత కూడా.. అప్పుడప్పుడు ఆ వాచీ పెట్టుకుంటా! ఎందుకో తెలియదు కానీ ఆ వాచీ పెట్టుకుంటే అదో ధైర్యం.

### అన్నిచోట్లా వెతికా...

సాయంత్రం ఆఫీసునుంచి వచ్చేటప్పుడు వాచీల షోరూంకు వెళ్తే "ఈ టెక్నాలజీ ఇప్పుడు లేదు మేడం.. మేము బాగుచేయలేం.." అన్నాడు నావైపు జాలిగా చూసి. నేను మరో ప్రశ్న అడిగే లోపులోనే "ఈ టైపు స్ప్రింగ్ వాచీలు హెచ్ఎంటీ మొదలుపెట్టినప్పుడు వచ్చేవి.." అన్నాడు కొద్దిగా వెటకారంగా. నాకు చాలా కోపం వచ్చింది. నన్ను పాతతరందానిలా లెక్కవేసినందుకు కాదు.. నా వాచీని తక్కువ చేసినందుకు. ఆ వాచీని ఎలాగైనా బాగుచేయించాలనే పట్టుదలను కూడా పెంచాయి ఆ మాటలు. శనివారం పదకొండు గంటలకు స్ప్రింగ్ వాచీలను బాగుచేసే షాపు వెతుక్కుంటూ బయలుదేరా! జూబ్లీహిల్స్, బంజారాహిల్స్, మణికొండల్లో వెతకటం పూర్తయిపోయింది కానీ ఫలితం లేదు. చివరకు ఒక షాపులో మెకానిక్ "యూసఫ్‌గూడా చెక్‌పోస్ట్ నుంచి పైకి వెళ్తుంటే ఒక చిన్న షాపు ఉంటుందమ్మా! అతను ఇలాంటి వాచీలు బాగుచేస్తాడు" అని హింటిచ్చాడు. "పేరేదైనా గుర్తుందా?" అని ఆశగా అడిగా. ఆ మెకానిక్ సర్వజ్ఞుడిలా ఓ నవ్వు నవ్వాడు.

"చిన్న షాపమ్మా! పేరేం ఉండదు. పాతికేళ్ల నుంచి అక్కడే ఉన్నాడు" అన్నాడు. ఈసురోమంటూ కారును యూసఫ్‌గూడా వైపు తిప్పా.



### అలా వచ్చాను

షాపులో మెకానిక్ చెప్పినట్లే కృష్ణానగర్ వైపు వెళ్తుంటే ఓ చిన్న షాపు. జాగ్రత్తగా చూడకపోతే అలాంటి షాపు ఒకటుంటుందని కూడా గమనించం. ఆ షాపును చూడగానే నాకు తెలియకుండానే ఒక రిలీఫ్. బహుశా అది నా మొహంలో కనిపించినట్లుంది. "వాచీ రిపేరు చేస్తారా?" అని అడగకుండానే డబ్బా లోపల కూర్చున్న వ్యక్తి చేయి చాపాడు. బ్యాగులోంచి వాచీ తీసిచ్చా. అతను దాన్ని ముందుకీ వెనక్కీ తిప్పి ఆప్యాయంగా చూశాడు. వాచీ వెనకున్న క్యాప్‌ను జాగ్రత్తగా విప్పాడు. కంటికి భూతద్దం పెట్టుకొని అందులో భాగాలు చూడటం మొదలుపెట్టాడు. "ఇది స్ప్రింగ్ టెక్నాలజీతో హెచ్ఎంటీ చేసిన వాచమ్మా! అప్పుడు రూ. 250 అనుకుంటా. ఒకప్పుడు ఇది పెట్టుకోవటం గొప్ప. ఈ వాచీ చూసి కూడా చాలా ఏళ్లైపోయింది.." అన్నాడు. అతని మాటల్లో నోస్టాల్జియా స్పష్టంగా కనిపిస్తోంది. 'మీ పేరు..' అని అడిగా. 'బషీర్ మహ్మద్' అంటూ తలెత్తి చూశాడు. వాచీలో భాగాలు ఒక్కొక్కటి బయటకు తీయటం మొదలుపెట్టాడు. 'ఎంత కాలం నుంచి మీరు వాచీలు రిపేర్ చేస్తున్నారు?' అని అడిగా. 'హైదరాబాద్‌కు వచ్చి పాతికేళ్లయిందమ్మా! అంతకు ముందు గుంటూరులో షాపు ఉండేది. ఓనర్ ఖాళీ చేయమంటే హైదరాబాద్‌కు వచ్చేశా. మా నాన్న స్కూలు టీచర్. ఆయన చెప్పినట్లు విని ఉంటే నేను టీచర్ అయ్యేవాడిని. ఇప్పుడు మెకానిక్‌గా మిగిలిపోవాల్సి వచ్చింది..' అన్నాడు బాధగా. 'మెకానిక్ అంటే చిన్నదేం కాదుగా.. మాకు టైం చెప్పేది మీరేగా..' అని హ్యూమర్ చేయటానికి ప్రయత్నించా. "కాలం మారిపోయిందమ్మా! ఒకప్పుడు స్ప్రింగ్ వాచీలుండేవి. పాడైపోతే రిపేరు చేయించుకునేవాళ్లు. జపాన్‌వాళ్లు ఎలక్ట్రానిక్ వాచీలు పట్టుకొచ్చారు. దాంతో స్ప్రింగ్ వాచీలే పోయాయి. ఇప్పుడు మొబైల్స్ వచ్చిన తర్వాత వాచీలు పెట్టుకునేవారే తక్కువైపోతున్నారు. ఎవరి దాకానో ఎందుకు.. నేను కూడా టైమ్ చూడాలంటే నా ఫోన్‌లోనే చూస్తా.." అన్నాడు.

### కేవలం వ్యాపకమేనా?

నాతో మాట్లాడుతూనే వాచీలో భాగాలు ఒకదాని తర్వాత మరొకటి పెడుతున్న బషీర్‌ను చూస్తుంటే పొలంలో శ్రద్ధగా వరినారును నాటే రైతు గుర్తుకొచ్చాడు. 'కాలంతో పాటు అవసరాలు మారతాయిగా.. మీ పిల్లలేం చేస్తున్నారు..' అన్నా. "నాకు ఒక్కడే కొడుకమ్మా! వాడిని ఇంజినీర్ చేద్దామనుకున్నా. కానీ నాలాగే మెకానిక్ అయ్యాడు. వాచ్ మెకానిక్ కాదు..క్రేన్ మెకానిక్. దండిగా సంపాదిస్తున్నాడు." అన్నాడు. 'పోన్లెండి..తను సెటిల్ అయిపోయాడు కదా.. ఇది మీకు కేవలం వ్యాపకమే కదా..' అన్నా. మేము మాట్లాడుతున్న సమయంలోనే బషీర్ వాచీ రిపేర్ పూర్తి చేశాడు. వాచీ పనిచేస్తోందా లేదా అని కొద్దిగా ముందుకు వంగి చూశా. సెకన్ల ముల్లు తిరుగుతోంది. 'మీ ఫీజు..' అన్నా. బషీర్ నవ్వి యాభై ఇవ్వండి అన్నాడు. బ్యాగులోంచి వంద తీసి ఇచ్చా. బషీర్ చిల్లర కోసం వెతుకుతుంటే 'మీరు అడిగితే ఐదొందలైనా ఇచ్చేదాన్ని. కానీ యాభయ్యే అడిగారు. మిగిలింది ఉంచండి. అది మీ అనుభవానికి..' అన్నా. ఆ మాట అన్నవెంటనే అలా ఎందుకన్నానా అని నాకే సిగ్గేసింది. 'మీ అనుభవం యాభై రూపాయలని నా ఉద్దేశం కాదు. అది కేవలం నా కృతజ్ఞత అనుకోండి' అన్నా. బషీర్ ఏం మాట్లాడలేదు. మౌనంగా ఊరుకున్నాడు. బయట జల్లు పడుతోంది. కారు దాకా వెళ్లేలోపులో తడిసిపోతానా? అనుకున్నా. తడిసినా పర్వాలేదులే అనుకుని రెండు అడుగులు వేశా. "వాచీ జాగ్రత్తమ్మా! వానలో తడిస్తే పాడైపోతుంది.." అనే బషీర్ మాటలు వినిపించాయి. వెనక్కి తిరిగి చూశా. వానలో తిరగవద్దని బిడ్డను మందలించే తల్లిలా కనిపించాడతను!

–సీత

email: fbackfm@gmail.com

# ఇలా కూడా జరుగుతుందా?

## -వి.వి.కూర్మారావు

**"అమ్మాయ్ గీతా, రెండురోజులుగా నీ దగ్గరనుంచి ఫోన్ లేదు. అమ్మ గాబరా పడుతోంది. నువ్వు నీ పనిలో చాలా బిజీగా ఉంటావని సర్ది చెప్పాను. ఈ మధ్య నీకో సంబంధం చూశాను. కుర్రాడిపేరు రవి. బుద్ధిమంతుడు. వారిది మన సంప్రదాయమే. హైదరాబాదులో ఓ ప్రసిద్ధ ఇంజనీరింగ్ కంపెనీలో మంచిహోదాలో పనిచేస్తున్నాడు. తండ్రి సుబ్రమణ్యం. నా మిత్రుడే. ఇక్కడే మన విశాఖపట్నం అక్కయ్యపాలెంలో ఉంటున్నారు. ఈ మధ్యనే అబ్బాయి తల్లి పరమపదించింది. రవి ఒక్కడే ఆయన సంతానం. నీకు పెళ్ళి చేయాలని నేనూ, అమ్మా ఉత్సాహపడుతున్నాం. ఫొటో పంపిస్తాను. ఆలోచించి నీ అభిప్రాయం తెలియజేయి. నీ ఇష్టానికి వ్యతిరేకంగా ఏ నిర్ణయం జరగదు".**

తండ్రి మాటలు చాలా ఓపికగావిన్న గీత తత్తరపడింది! "నేను ఇప్పుడు ఓ ప్రాజెక్టుకు ఇన్‌చార్జిగా ఉన్నాను. దీనిని పూర్తిచేయటానికి మేనేజ్‌మెంట్ నాకో నిర్దిష్ట సమయం కేటాయించింది. ఆ సమయంలోపు నేను, నా టీమ్ ఈ ప్రాజెక్టు విజయవంతంగా పూర్తి చెయ్యాలి. కాబట్టి కొన్నిరోజులు నేను చాలా పనిఒత్తిడిలో ఉండవలసి వస్తుంది. ప్రస్తుతానికి మీ ప్రతిపాదన అంగీకరించే స్థితిలో లేను నాన్నగారు. కొన్నిరోజులు వివాహ ప్రస్తావన చేయవద్దని మనవి చేస్తున్నాను. మీరు అర్థం చేసుకుంటారని భావిస్తాను" సౌమ్యంగా నచ్చచెప్పే ప్రయత్నం చేసింది గీత.

"తగిన సమయం నువ్వే సూచించు. అప్పుడే నీ కోసం పెళ్ళికొడుకులను వెతికే ప్రక్రియ మొదలుపెడతాను. ఇదిగో అమ్మతో మాట్లాడు" ఫోన్ భార్య సుగుణకు ఇచ్చారు కమలాకరరావు.

"గీతా, ఎలాఉన్నావ్? హాస్టల్లో భోజనం బాగుంటోందా? గది సౌకర్యంగా ఉంటుందా? నీ ఆరోగ్యం జాగ్రత్త" తల్లి ప్రశ్నలకు జవాబులు చెప్పి సంభాషణ ముగించింది గీత.

***

బెంగళూరులో ఓ సాఫ్ట్‌వేర్ కంపెనీ ఉద్యోగి గీత. ఆమె తండ్రి కమలాకరరావు విశాఖపట్నం ఆంధ్రా యూనివర్సిటీలో ఓ ముఖ్యమైన విభాగంలో ప్రొఫెసర్‌గా పనిచేసి పదవీ విరమణచేశారు. సురేష్, గీత ఆయన సంతానం. సురేష్ మొదట్లో హైదరాబాద్‌లో ఓ సాఫ్ట్‌వేర్ కంపెనీలో చేస్తూ కంపెనీ పనిమీద అమెరికా వెళ్ళాడు. ఆ ప్రాజెక్టు పూర్తయ్యాక మరో కంపెనీలోకి మారి అమెరికాలోనే స్థిరపడ్డాడు. తండ్రిమాట ప్రకారమే రాజమండ్రి సంబంధం చేసుకున్నాడు. సురేష్ భార్య సురేఖ ఎం.సి.ఎ చదివింది. ప్రస్తుతం అమెరికాలో ఉద్యోగ ప్రయత్నాలు చేస్తోంది.

కమలాకరరావుగారు, సుబ్రమణ్యం మంచి మిత్రులు. ఇద్దరూ ఆంధ్రాయూనివర్సిటీలో ప్రొఫెసర్లు. ఆ చనువుతోనే సుబ్రమణ్యం మిత్రుడిదగ్గర, గీతతో తన కొడుకుపెళ్ళి చెయ్యాలనే ప్రస్తావన తీసుకొచ్చారు.

కమలాకరరావుగారు సంప్రదాయాలు గౌరవించే వ్యక్తి. చాదస్తం అనుకున్నా, పనులన్నీ విలువలతో చేయాలనుకునే మనిషి. నెమ్మదైన మనస్తత్వం. పిల్లల పెళ్ళిళ్ళు సంప్రదాయబద్ధంగా జరగాలనుకునే స్థిరమైన అభిప్రాయంగలవారు. మిత్రుడు సుబ్రమణ్యంతో సంబంధం కలుపుకోవడం కమలాకరరావుగారికి కూడా ఇష్టంగానే తోచింది.

***

ఉదయం పదకొండు గంటల సమయం.

"మీ కోసం నాగేశ్వర్ అనే వ్యక్తి వచ్చారు. రిసెప్షన్‌లో వెయిట్ చేస్తున్నారు" ఇంటర్‌కామ్‌లో రిసెప్షనిస్టు చెప్పినమాట విని ఉలికిపడింది గీత. 'ఆ పేరుగల వాళ్ళెవరూ తనకు తెలిసిన వాళ్ళల్లో లేరు. ఎవరై ఉంటారు? తెలియదనిచెప్పే ముందు వివరాలు తెలుసుకోవడం మంచిదేమో' అనుకుని, "సరే వస్తున్నాను, అక్కడే వెయిట్ చెయ్యమను" అని చెప్పి కిందకు వెళ్ళింది గీత.

"నా పేరు నాగేశ్వర్. హైదరాబాద్ హైటెక్‌సిటీలో ఓ ప్రముఖ సాఫ్ట్‌వేర్ కంపెనీలో మేనేజర్‌గా ఉన్నాను. మాది విశాఖపట్నమే. ఆంధ్రాయూనివర్సిటీలో మీ నాన్నగారి దగ్గరే చదువుకున్నాను. వారంటే నాకెంతో గౌరవం. మా తల్లిదండ్రులు ఎం.వి.పి.లో ఉంటారు. ఓరోజు బ్యాంకులో మీ నాన్నగారిని చూశాను. పలకరించి కుశలప్రశ్నలు అడిగాను. ఆయనకూడా నా వివరాలు అడిగి, మాటల సందర్భంలో 'పెళ్ళి చేసుకున్నావా' అనడిగారు".

"ఇంకా చేసుకోలేదు, తెలిసిన సంబంధంఏదైనా ఉంటే చెప్పండి" అన్నాను. "చూద్దాం" అని ఊరుకున్నారు. నేను మళ్ళీ "మీ అమ్మాయి ఇంజనీరింగ్ చేసిందని విన్నాను. ఇప్పుడేం చేస్తోంది" అని అడిగాను. మీ వివరాలు నాకు ఇచ్చారు. "నాకు బెంగళూరువెళ్ళే పని ఉంది, మీ అమ్మాయిని కలిసి ఆమె యోగక్షేమాలు మీకు చెప్తానులెండి అన్నాను" అని నాగేశ్వర్ ముగించాడు.

అంతావిన్న గీత కాసేపు అతడి కంపెనీ విషయాలు, ప్రాజెక్టు వివరాలు మొదలైనవి మాట్లాడి అక్కడ నుంచి కదలబోయింది.

"మేడం, మీకు అభ్యంతరం లేకపోతే ఓ విషయం ముచ్చటించవచ్చా?" అన్నాడు నాగేశ్వర్. ఆ చొరవకు తత్తరపడింది గీత.

ఆశ్చర్యంగా ముఖంపెట్టి "చెప్పండి" అంది.

"మీ నాన్నగారి మాటల్లో మీకింకా వివాహం కాలేదని తెలుసుకున్నాను. మిమ్మల్ని, మీ మాట తీరును చూసిన తర్వాత నాకెంతో ముచ్చటవేసింది. మీకు అభ్యంతరం లేకపోతే, నా ప్రొఫైల్ మీకు నచ్చితే పెళ్ళి విషయంలో మనం ముందుకెళదాం" అన్నాడు.

నాగేశ్వర్ మాటలకు మరింత ఆశ్చర్యపోయింది గీత. "ఇదేమిటి? ఇంత ధైర్యంగా తనొక్కడే నా ఆఫీసుకువచ్చిమరీ పెళ్ళిప్రస్తావన చేస్తున్నాడు... నిజంగా ఇది చాలా విస్మయపరిచే సంగతే' అనుకుంది మనసులో. ఎలా జవాబివ్వాలా అని ఆలోచిస్తూ "నా వివాహం విషయంలో ఇంతవరకూ ఎటువంటి ఆలోచన చెయ్యలేదు. ఆ సమయం వచ్చినప్పుడు చూద్దాం" ఇంక ఈ విషయం ఇంతటితో కట్టిపెట్టండన్నట్టు చెప్పింది గీత.

"ఆలోచించి నిర్ణయం తీసుకోండి" అంటూ అక్కడి నుండి సెలవు తీసుకున్నాడు నాగేశ్వర్.

***

"నాన్నగారు, మీరు నాగేశ్వర్ అనే వ్యక్తిని నా దగ్గరకు పంపించారు. అతను నాకు మ్యారేజ్ ప్రపోజల్ చేశాడు. మీకు ఇదివరకే తెలియజేశానుకదా, సమయం వచ్చినప్పుడు చెప్తానని. ఇంతలోనే మీరు తొందరపడుతున్నట్లనిపించింది" తండ్రికి ఇవ్వాల్సిన గౌరవానికి భంగం కలగకుండా తన అభిప్రాయాన్ని ఫోన్ ద్వారా వెల్లడించింది.

"అమ్మా, నాగేశ్వర్‌ని నేను నీ దగ్గరకు పంపించలేదు. బ్యాంకులో కలిసినప్పుడు అతనే బెంగళూరు వెళ్ళే పని ఉందనీ, నీ యోగక్షేమాలు తెలుసుకుంటానని మాత్రమే చెప్పాడుతప్ప ఇలా వివాహ ప్రస్తావన చేస్తాడని నేను ఊహించలేదు" గీత నొచ్చుకుందని బాధపడుతూ జరిగిన విషయం ఆమె ముందుంచారు కమలాకరరావు.

***

"గీతా, డైరెక్టర్‌గారు పిలుస్తున్నారు" ప్రాజెక్టు మేనేజర్ దుష్యంత్ మాటలతో ఒక్కసారిగా ఉలికిపడింది. 'ఏమై ఉంటుందబ్బా! కొంపదీసి నామీద ఎవరైనా కంప్లైంట్ చేశారా?' అనేక సందేహాలతో డైరెక్టర్ ఛాంబర్లోకి అడుగుపెట్టింది గీత.

"హౌ ఆర్ యూ గీతా? నీకో గుడ్ న్యూస్. మన కంపెనీ ప్రోగ్రెస్ దృష్ట్యా ఢిల్లీలో జరుగుతున్న ఓ ట్రైనింగ్ కోర్సుకు కొంతమందిని ఎంపికచేసి పంపించాలని మేనేజ్‌మెంట్ నిర్ణయించింది. నువ్వు కూడా ఆ ట్రైనింగ్‌కు హాజరుకావలసి ఉంటుంది. నువ్వు బయలుదేరవలసిన తేదీ, ఇతర వివరాలూ మన దుష్యంత్ తెలియజేస్తారు. ఈ విషయం చెప్పాలనే పిలిపించాను, బెస్ట్ ఆఫ్ లక్" చెప్పాడు డైరెక్టర్ సందీప్.

"తప్పకుండాసార్, మన కంపెనీ ప్రతిష్టపెంచే చర్యల్లో నన్నుకూడా భాగస్వామిని చేసినందుకు కృతజ్ఞతలు" ముక్తసరిగాచెప్పి ఆ ఛాంబర్ నుండి నిష్క్రమించింది గీత.

***

గీతతో సహా పదిమంది ఆమె కంపెనీ ఉద్యోగులు శిక్షణా కార్యక్రమానికి ఢిల్లీ వెళ్ళారు. గీతతోపాటు టీమ్‌లో నలుగురు మహిళా ఉద్యోగులు ఉన్నారు. వాళ్ళందరికీ ఓ స్టార్ హోటల్‌లో వసతి సౌకర్యాలు ఏర్పాటుచేశారు. హైదరాబాద్ హైటెక్ సిటీలోని ఓ ప్రముఖ సాఫ్ట్‌వేర్ ఉద్యోగి గోవిందను

**ఓ సాఫ్ట్‌వేర్ కంపెనీలో ముఖ్యమైన ప్రాజెక్టు పనిలో తలమునకలై ఉందామె. వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌లో తమ కూతురు ఒంటరిగా ఉంటోందని ఆమె తల్లిదండ్రులకు కంగారు. పిల్లకు పెళ్ళిచెయ్యాలనే ఆత్రుత ఒకవైపు, ఒత్తిడిచేసి ఆమెను నొప్పించకూడదనే ఆలోచన మరోవైపు. కానీ అంతలోనే ఊహించని దారుణం జరిగిపోయింది!**

శిక్షణా సమయంలో వారికి టీమ్ హెడ్‌గా నియమించారు. ఐ.టి రంగంలో ఐదేళ్ళ అనుభవజ్ఞుడైన గోవింద్ మంచి మంచి సలహాలు, సూచనలతో గీత సందేహాలన్నీ తీర్చడం ఆమెకు చాలా ఉపకరించింది. గోవింద్ నేర్పు, ఓర్పు, శిక్షణా సమయంలో గీతకు తీయటి అనుభూతులు పంచాయి. ఇరువురి సంభాషణల్లో తమ తమ కుటుంబ నేపథ్యాలుకూడా పంచుకున్నారు. గోవింద్ సాహచర్యం గీతకెంతో తృప్తినిచ్చింది. ఆవిధంగా శిక్షణాకాలంలో గీతకు ఎన్నో విషయాలు నేర్చుకునే అవకాశం చిక్కింది. ఓ ప్రతిష్టాత్మకమైన స్టార్‌హోటల్‌లో విందుతో వారి ఢిల్లీ శిక్షణ సమాప్తమైంది.

***

హఠాత్తుగా విశాఖపట్నం వచ్చిన కుమార్తెను చూసి ఒకింత ఆశ్చర్యానికి గురయ్యారు కమలాకర రావుగారు.

"ఫోన్ చెయ్యలేకపోయావా?"

"అనుకోకుండా బయలుదేరవలసి వచ్చింది" తండ్రి ప్రశ్నకు సమాధానమిచ్చిన గీత. "జరగరాని సంఘటన నా జీవితంలో జరిగిపోయింది" అన్నది.

"ఏమిటమ్మా? ఏం జరిగింది?" అంటూ కరుణాకర రావుగారు, సుగుణ కూతురువైపు ఆత్రుతగా చూశారు. "మీతోతప్ప ఇంకెవ్వరితోనూ ఈ విషయం చర్చించలేను, అంతటి ఘోరమైన దారుణమే జరిగింది" గీత మాటలతో ఆ దంపతుల్లో భయం ప్రవేశించింది.

"నేను ప్రాజెక్టు పూర్తిచెయ్యాల్సిన సమయం దగ్గర పడింది. దాంతో ఒకరోజు పని పెరిగిపోయింది. ఆఫీసువేళ మించిపోయినా తప్పదనుకుని ఆఫీసులోనే ఉండి చాలావరకు ఆ పని పూర్తిచేశాను. ఆఫీస్ క్యాబ్ వెళ్ళిపోవడంవల్ల, నేను ఉంటున్న వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌కి ఆటోలో ఒంటరిగా బయలుదేరాను. ఆటోవాడు నన్ను తప్పుదారిలో తీసుకెళ్ళి ఘోరంగా నాపై అత్యాచారం చేశాడు. ఒక ఆగంతుకుని చొరవతో ఆటోవాడు ఉడాయించాడు. ఎలాగో రూముకి చేరుకుని ఆ రాత్రంతా మూగగా రోదించాను. ఇలాంటి పరిస్థితి ఎదురవుతుందని ఊహించని నేను ఎంతో వేదననుభవించాను. ఎవరికీ చెప్పుకోలేకపోయాను. పోలీసులకు ఫిర్యాదుచేస్తే పరువు మర్యాదలేమవుతాయోననే బెంగతో ఓ రెండురోజుల్లో పనంతా పూర్తిచేసి సెలవుపెట్టి ఇలా ఇంటికి వచ్చాను" అంటూ విలపించింది.

నోటమాటరాక స్థాణువైపోయారు కమలాకర రావు దంపతులు.

'ఎంతఘోరం జరిగింది? ఏమిటిది, దేశంలో మహిళలకు రక్షణ లేదా? నా కూతురుకూడా ఇలాంటి దారుణానికి బలైపోయిందా?' మనసులో వెక్కివెక్కి ఏడ్చారు ఆ దంపతులు. పోలీసు రిపోర్టు ఇద్దామనుకుంటే పరువు ప్రతిష్ఠలు అడ్డొస్తున్నాయి. విషయం బయట కుపొక్కితే గీతకు పెళ్ళికాకుండా పోతుందనే బెంగతో పోలీసు రిపోర్టు ఇవ్వాలనే ఆలోచన విరమించుకున్నారు.

"అమ్మా, ఈ విషయం ఎక్కడా ప్రస్తావించలేదు కదా!" దుఃఖం నిండిన కంఠంతో అడిగారు కమలాకర రావుగారు.

"లేదు, కొంతమంది కొలీగ్స్‌కి తెలిసినట్టు బయట పడింది. వారు కూడా నా వద్ద ఈ సంగతి లేవనెత్తలేదు. కొన్నాళ్ళు సెలవు తీసుకొని ఇక్కడే ఉండిపోవాలని నిశ్చయించుకున్నాను" విషణ్ణ వదనంతో చెప్పింది గీత.

***

"నాన్నగారు, నా వివాహం గురించి మనసులో మీరు చాలా మథనపడుతున్నారని నాకు తెలుసు. ఈ విషయం దాచిపెట్టి నాకు ఎలా పెళ్ళి చేయాలా? అని మీరూ అమ్మా కుమిలిపోతూ ఉండొచ్చు. ఈ విషయం దాచిపెట్టి నా జీవితంలోకి ఇంకొకర్ని ఆహ్వానించడం నాకు ఇష్టంలేదు. అందుకే ఒక ప్రతిపాదన మీ ముందు ఉంచాలనుకుంటున్నాను. దానికి మీరు సమ్మతిస్తారని నమ్ముతున్నాను" కొంత బెరుకుగానే మనసులోమాట బయటపెట్టింది గీత.

"ఏమిటమ్మా అది?" ఎంతో ఆత్రుతతో అడిగారు కమలాకరరావుగారు.

"ఢిల్లీలో శిక్షణా కార్యక్రమంలో ఉండగా హైదరాబాద్ సాఫ్టువేర్ కంపెనీ మేనేజర్ గోవింద్ అనే వ్యక్తితో నాకు పరిచయం ఏర్పడింది. చాలా విషయాల్లో అతను నాకు మార్గదర్శనం చేశారు. ట్రైనింగ్‌లో నాకు ఎంతో సహాయపడ్డారు. ఆ మధ్య మా బెంగళూరు ఆఫీసుకుకూడా వచ్చారు. మా ఆఫీసులో పనిచేసే అనంత్ ఆయన స్నేహితుడట. నాకు జరిగిన అవమానంకూడా అతని దృష్టికి వెళ్ళింది. అనంత్ ద్వారా గోవింద్ నన్ను కలిశారు. కుశలప్రశ్నలడిగి వివాహ ప్రస్తావనచేశారు. జరిగిన 'ఆ సంఘటన' మరచిపొమ్మనీ, అభ్యంతరం లేకుంటే వివాహం చేసుకుంటాననీ ఆయన ముందుకు వచ్చారు. అయితే గోవింద్ ఒకసారి పెళ్ళయిన వ్యక్తి. అభిప్రాయభేదాలవల్ల భార్యనుంచి విడాకులు తీసుకున్నారు. అందుకే ఈ విషయం మీతో పంచుకోవడానికి నాక్కూడా చాలా ఇబ్బంది అనిపించింది" అన్నీ వివరించి తల్లిదండ్రులు ఏమంటారో అని బెరుకుగా చూసింది గీత.

"చాలా పొద్దుపోయింది, రేపుమాట్లాడుకుందాం" అని కమలాకరరావుగారు తన బెడ్‌రూములోకి వెళ్ళిపోయారు.

***



"గీతా, నువ్వు చెప్పిన విషయం అమ్మా నేనూ చర్చించాం. ఈ పరిస్థితుల్లో నువ్వు అనుసరించే మార్గమే ఉత్తమం అనిపిస్తోంది. సంప్రదాయబద్ధంగా నీ వివాహం జరిపించే అదృష్టం మాకు లేదనుకుంటాం. అందువల్ల నువ్వు రిజిస్టర్ మ్యారేజ్ చేసుకోవడమే మంచిది" బరువైన హృదయంతో మనసులోని మాట బయట పెట్టారు కమలాకరరావు.

"సరే నాన్నగారూ, మీరు చెప్పినట్లే చేస్తాను" అని చెప్పి మరుసటిరోజు తిరుగు ప్రయాణమైంది గీత.

***

"పరమ ఛాందసవాది, సంప్రదాయాలకు బహు విలువనిచ్చే మా నాన్నగారిని ఒప్పించడం చాలా కష్టమైనపనిగా తోచింది. అందుకే ఒక కొత్తమార్గం ఎన్నుకున్నాను. అది కొంచెం ఇబ్బందికరమైన మార్గమైనా, నిన్ను చేరుకోవడానికి, పెళ్ళిచేసుకోవడానికి ఆ మార్గం అనుసరించకతప్పలేదు" రిజిస్టర్ మ్యారేజీ అనంతరం, మొదటి రాత్రి గోవింద్‌తో చెప్పింది గీత.

"ఇంతకీ ఏమిటా కొత్తమార్గం?" ఆసక్తిగా అడిగాడు గోవింద్.

"నాపై అత్యాచారం జరిగిందనీ, ఆ సంఘటన తెలిసిన తర్వాత కూడా నువ్వు నన్ను వివాహం చేసుకోవడానికి సిద్ధపడి ముందుకువచ్చావనీ మా తల్లిదండ్రులను నమ్మించాను" అంది గీత.

షాకయ్యాడు గోవింద్.

"మన ప్రేమను రక్షించుకోవడానికి ఎంత సాహసం చేశావు గీతా! ఏ స్త్రీ చేయనటువంటి సాహసమే ఇది" తనని చేరుకోవడానికి గీత తెగువ అతన్ని కదిలించింది. ఇలాక్కూడా జరుగుతుందా అనే విస్మయం అతడి ముఖంలో ప్రతిఫలించింది.

**సెల్: 99485 21903**




ఆగస్టు 9 నుంచి
ఆగస్టు 15 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

చిన్నారుల విషయాలు, పెట్టుబడులు, విద్యా విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి విద్యా కోర్సుల్లో ప్రవేశానికి అనుకూలం. దూరంలో ఉన్న ప్రియతములు నుంచి కీలక సమాచారం అందుకుంటారు. సినీ, రాజకీయరంగాల వారు జాగ్రత్తగా వ్యవహరించాలి. 12, 13 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. సాంకేతిక కోర్సుల్లో ప్రవేశానికి అనుకూల సమయం. 14, 15 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి అడుగేయాలి. ఫీజులు, బిల్లులు చెల్లించేందుకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ప్రియతముల కోసం ఖర్చులు అధికం.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, మార్పులు, విద్యా విషయాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా శుభప్రదం. బ్యాంకులు, ఆర్థిక సంస్థల వారికి కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. 12, 13 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. 14, 15 తేదీల్లో బదిలీ ప్రయత్నాలకు అటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

విద్య, ఇంటర్వ్యూలు, సోదరీసోదరుల విషయాలు, ప్రయాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. ఇంటర్వ్యూలలో ఆచితూచి వ్యవహరించాలి. 12, 13 తేదీల్లో బంధుమిత్రుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. విద్యా సంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. స్నేహ బాంధవ్యాలు విస్తరిస్తాయి. 14, 15 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించాలి. వాగ్వివాదాలకు దూరంగా ఉండండి.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, షాపింగ్, ఆర్థికపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత విద్య, ప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఖర్చులు అధికం. 12, 13 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 14, 15 తేదీల్లో బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో ప్రియతముల వైఖరి ఆవేదన కలిగిస్తుంది.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆర్థిక నిర్ణయాలు, ప్రయాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో పెట్టుబడుల గురించి ఆరా తీస్తారు. రుణాలు మంజూరవుతాయి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. 12, 13 తేదీల్లో బంధుమిత్రుల కలయిక ఉల్లాసం కలిగిస్తుంది. ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలిస్తాయి. న్యాయ, బోధనా రంగాల వారికి ప్రోత్సాహకరం. 14, 15 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో కీలక అంశాలపై దృష్టి సారిస్తారు. కొత్త ప్రాజెక్టుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. లక్ష్యసాధనలో పెద్దల సహకారం లోపిస్తుంది.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

భాగస్వామి విషయాలు, వేడుకలు, సంస్మరణలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో సినీ, రాజకీయ రంగాలవారు గౌరవ, మన్ననలు అందుకుంటారు. న్యాయ, రక్షణ రంగాల వారికి శుభప్రదం. జనసంబంధాలు విస్తరిస్తాయి. శ్రీవారు, శ్రీమతి వైఖరి ఆవేదన మిగులుస్తుంది. 12, 13 తేదీల్లో పాత బకాయిలు వసూలవుతాయి. వైద్యం, విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 14, 15 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారు ఆచితూచి ముందడుగు వేయాలి. బోధన, రక్షణ రంగాల వారికి నిరుత్సాహకరంగా ఉంటుంది.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఆర్థిక విషయాల్లో సహోద్యోగుల సహకారం లభిస్తుంది. హోటల్, పరిశ్రమలు, వైద్య రంగాల వారికి ఆర్థికంగా అనుకూలం. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 12, 13 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లలో సత్ఫలితాలు సాధిస్తారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. 14, 15 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. మ్యూచ్యువల్ ఫండ్స్, బీమా గురించి ఆరా తీస్తారు.

### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)



వృత్తి, వ్యాపారాలు, ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. సృజ నాత్మకంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. విద్యా విషయాల్లో పెద్దల సహకారం లోపిస్తుంది. 12, 13 తేదీల్లో ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. సిబ్బందిని నియమించుకుంటారు. పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. 14, 15 తేదీల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. వేడుకల్లో ప్రముఖులను కలుసుకుంటారు. భాగ స్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. గౌరవ, ప్రతిష్ఠలకు భంగం కలిగే అవకాశం ఉంది.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. ఇంటికి అవసరమైన వస్తువులు కొనుగోలు చేస్తారు. కుటుంబ వ్యవహారాల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. 12, 13 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. అడ్మిషన్లు లభిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 14, 15 తేదీల్లో హోటల్, వైద్య, ఉపాధి రంగాల వారికి నిరుత్సాహకరంగా ఉంటుంది. లక్ష్య సాధనకు అధికంగా కృషి చేయాలి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురు, శుక్రవారాల్లో విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థిక విషయాల్లో సోదరీ సోదరుల సహకారం లభిస్తుంది. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 12, 13 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 14, 15 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఖర్చులు అంచనాలు మించిపోతాయి. పెట్టుబడులు, పొదుపు పథకాల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

వేడుకలు, సోదరీ సోదరుల విషయాలు, భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో స్పెక్యులేషన్లు, పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం సమకూర్చుకుంటారు. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది. 12, 13 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో కీలకపాత్ర పోషిస్తారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. ప్రియతములకు సంబంధించి ఒక శుభవార్త వింటారు. 14, 15 తేదీల్లో కుటుంబసభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి.

### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)



విందు వినోదాలు, వృత్తి, వ్యాపారాలు, ఇంటర్వ్యూలు, ప్రయాణాలపై ఈ వారం దృషి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఆరోగ్యం మెరుగవుతుంది. విందుల్లో పాల్గొంటారు. సహోద్యోగుల వైఖరి మన స్తాపం కలిగిస్తుంది. 12, 13 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఇంక్రిమెంట్లు అందుకుంటారు. హోటల్, వైద్య రంగా వారికి ప్రోత్సాహకరం. 14, 15 తేదీల్లో ఇంటర్వ్యూలలో నిరాశ తప్పకపోవచ్చు. వృత్తిపరమైన చర్చలు ఫలిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లలో పొరపాట్లు దొర్లే అవకాశం ఉంది. నవ్య






## డ్యాన్స్‌లు చేయనంటున్న మామ్

మామ్ అంటే ఇంకెవరు? టాలీవుడ్ అతిలోక సుందరి శ్రీదేవి. హీరోయిన్‌గా చేసే సమయంలో శ్రీదేవి డ్యాన్స్‌లంటే కుర్రకారు పడిచచ్చేవారు. ఆమె అందానికే కాదు, ఆమె డ్యాన్స్‌లకు కూడా బోలెడంత మంది అభిమానులున్నారు. అంత టాలెంట్ ఉన్న శ్రీదేవి ఇప్పుడు డ్యాన్స్‌లు చేయను అని స్పష్టంగా చెబుతోంది. దానికి కారణం కూడా ఉంది. ఈ వయస్సులో డ్యాన్స్‌లు చేస్తే ఛండాలంగా ఉంటుంది. అవి చేయడానికి యంగ్ జనరేషన్ ఉంది. నాలాంటి వాళ్ళు తప్పుకుని వాళ్ళకి ఛాన్స్ ఇస్తే బాగుంటుందని శ్రీదేవి అంటోంది. అయితే శ్రీదేవి ఇక్కడొక విషయం మరచిపోయిందనీ, బాలీవుడ్‌లో శ్రీదేవిలా సినిమాలు చేసే వారు తక్కువ మంది ఉంటారనీ, వారిలో కూడా డ్యాన్స్ వచ్చిన వారూ, బాగా చేయగలిగిన వారూ వేళ్ళమీద ఉంటారు కనుక శ్రీదేవి స్టార్ హీరోయిన్లుగా ముద్రపడిన వారిమీదే సెటైర్లు వేసిందని బాలీవుడ్ జనాలు అంటున్నారు. శ్రీదేవి మాటల్లో నిజముందని మరికొందరు అంటున్నారు.

## వ్యవసాయం చేస్తాడట!

తనకు 'బాహుబలి'లా సినిమా తీయడం చేతకాదనీ, మణిరత్నంలాగా ఓపాట హృద్యంగా చిత్రీకరించడం చేతకాదని చెబుతున్నారు స్టార్ డైరెక్టర్ కృష్ణవంశీ. ఎప్పటికైనా రాజమౌళి, మణిరత్నంలా సినిమాలు తీయాలన్నది తన ధ్యేయమట! అది కుదరనిరోజు వ్యవసాయం చేసుకుంటూ మిగిలిన జీవితాన్ని గడుపుతాడట తప్ప తిరిగి సినిమాల జోలికి పోనని స్పష్టం చేస్తున్నాడు. తను ఈ రంగంలోకి వచ్చి ఇన్నిరోజులైనా అసిస్టెంట్ డైరెక్టర్‌గానే ఫీలవుతానని చెప్పుకొచ్చాడు. కాకపోతే కృష్ణవంశీ మాటలు విన్నవారు అతగాడికి పిచ్చిపట్టలేదు కదా? అన్న అనుమానాన్ని వ్యక్తం చేశారట!



## జగ్గూభాయ్‌ని హింసించిన బోయపాటి

బోయపాటి, బెల్లంకొండ కాంబినేషన్‌లో ఓ సినిమా వస్తున్న సంగతి తెలిసిందే! ఈ సినిమాలో జగ్గూభాయ్ అంటే జగపతిబాబు ఓ ముఖ్యపాత్ర పోషిస్తున్నాడు. ఈ పాత్ర డైలాగు కోసం జగపతిబాబు నాలుగు రోజుల పాటు 20 షాట్లు తీసుకున్నాడట! ఈ డైలాగు సమయంలో బోయపాటి తనను తెగ హింసించాడంటూ జగపతిబాబు ఇటీవల జరిగిన ఓ కార్యక్రమంలో చెప్పుకొచ్చాడు. తన కెరీర్ మొత్తంలో ఇలాంటి హింస ఇంతవరకూ పడలేదని అంటున్నాడు. కాకపోతే డైలాగ్స్ బాగారావడానికే బోయపాటి అంత శ్రమ పడ్డాడు అంటూ వివరించాడు. సీనియర్ నటుడినే బోయపాటి అంత హింస పెడితే బెల్లంకొండ శ్రీనును ఇంకెంత హింస పెట్టి ఉంటాడో అని టాలీవుడ్ జనాలు అంటున్నారు.

## కండలవీరుడు సిగ్గుపడిన వేళ....

కండలవీరుడు సల్మాన్‌ఖాన్ సిగ్గుపడడం ఏమిటని ఆశ్చర్యపోతున్నారా? నిజమే...అదీ ఓ ఆడపిల్లని చూసి సిగ్గుపడ్డాడట! ఇంతకీ జరిగిన సంగతి ఏమిటంటే....సల్మాన్ ఇటీవల ఓ కార్యక్రమంలో పాల్గొనడానికి వెళ్ళాడు. అక్కడికి సనాఖాన్ కూడా వచ్చింది. సల్మాన్‌ని చూసిన వెంటనే మర్యాదపూర్వకంగా అతగాడిని హగ్ చేసుకోబోయింది. సల్మాన్ ముందు కొంత ఉత్సాహం చూపించినా ఆ తరువాత వెనక్కు తగ్గాడట! కారణం సనాఖాన్ వేసుకొచ్చిన డ్రస్‌లో బ్యాక్ అంతా ఖాళీగా ఉందట! సనా బాగా దగ్గరకువచ్చిన తరువాత ఈ విషయాన్ని గమనించిన సల్మాన్ కొంత వెనకడుగు వేశాడని అంటున్నారు. ఎంతైనా ఐదుపదుల వయస్సులో ముందున్న జోరు చూపించలేడు కదా! కాస్త హుందాగా ప్రవర్తించాడని బాలీవుడ్ జనాలు అంటున్నారు.





'చమక్ చలో' అంటూ టాలీవుడ్‌ను పలకరించి, ఆ తరువాత అందమైన ఎమ్మెల్యేగా తెలుగువారిని అలరించింది కేథరిన్ థ్రెస హీరోయిన్‌గానే చేయాలన్న నియమం ఏదీ పెట్టుకోకుండా మంచి అవకాశాలను వినియోగించుకుంటూ ముందుకు సాగిపోతోంది. సెకండ్ హీరోయిన్‌గా చేసినా, ఐటెంసాంగ్ చేసినా తన ప్రత్యేకతను చాటుకుంటున్న కేథరిన్‌తో....

# అందుకే బరువు తగ్గా

## -కేథరిన్ థ్రెస

**ఎక్కువగా సెకండ్ హీరోయిన్ పాత్రలకే పరిమితమయినట్టున్నారు?**

సినిమా ఒప్పుకునే ముందు నాది ఫస్ట్ లేదా సెకండ్ హీరోయిన్ పాత్ర అన్నది చూడను. కథ మాత్రమే చూస్తాను. నాది పవర్‌ఫుల్ పాత్ర అనుకుంటే ఎంత చిన్న రోల్ అయినా చేస్తాను. 'సరైనోడు'లో నా పాత్ర చిన్నదే కానీ ఎంత పేరు వచ్చిందో తెలిసిందే! ఇప్పుడు 'గౌతమ్‌నంద'లో కూడా నాది పవర్‌ఫుల్ పాత్రే! 'నేనే రాజు నేనే మంత్రి' సినిమాలో కూడా హీరోయిన్‌తో సమానమైన క్యారెక్టర్. చేసే పాత్రకి ఎంత ప్రాధాన్యముంటే అంత కష్టపడతా! అందుకే వైవిధ్యంగా ఉండే సినిమాలనే ఎంచుకుంటున్నాను.

**ఇటీవలి కాలంలో బాగా సన్నబడినట్టున్నారు?**

'సరైనోడు' సినిమా సమయంలో కొద్దిగా ఎక్కువ బరువే ఉన్నాను. అప్పుడు డ్యాన్స్‌లు చేయాలంటే కొద్దిగా ఇబ్బంది అనిపించింది. అందుకే పట్టుపట్టి బరువు తగ్గాను. ఇప్పుడు డ్యాన్స్‌లు బాగా చేయగలుగుతున్నాను. ఇక మీదట ఇదే బరువు మెయిన్‌టెయిన్ చేస్తాను. నేను చిన్నతనం నుంచీ డ్యాన్స్ నేర్చుకున్నాను కనుక ఎంత క్లిష్టమైన స్టెప్ అయినా కొద్దిపాటి ప్రాక్టీసుతో చేయగలను. అదే నాకు ప్లస్ పాయింట్.

**డబ్బింగ్ చెప్పుకోవాలని ఎందుకు అనిపించింది?**

'ఇద్దరమ్మాయిలతో', 'పైసా' సినిమాలు చేసే సమయంలోనే తెలుగు భాష మీద పట్టుకు కసరత్తులు మొదలుపెట్టా! 'గౌతమ్‌నంద'కి డబ్బింగ్ చెప్పాలని మొదటే డిసైడ్ అయ్యాను. అదే విషయం డైరెక్టర్ గారికి చెప్పగానే ఆయన ఓకే అన్నారు. సినిమా షూటింగ్ సమయంలో యూనిట్ వాళ్ళతో తెలుగులోనే మాట్లాడేదాన్ని. దాంతో బాగా ప్రాక్టీస్ అయింది. డబ్బింగ్ సమయంలో కూడా ఇంటి వద్ద ఒకటికి రెండు సార్లు ప్రాక్టీసు చేసుకుని వెళ్ళేదాన్ని. మన పాత్రకి మనం డబ్బింగ్ చెప్పుకుంటే ఆ తృప్తి వేరే ఉంటుంది. దాన్ని ఈ సినిమా సమయంలో పూర్తిగా అనుభవించాను.

**తెలుగు నేర్చుకునేందుకు ట్యూషన్ తీసుకున్నారా?**

ఉస్మానియా యూనివర్సిటీ లెక్చరర్ వద్ద కొన్ని



రోజులు ట్యూషన్ చెప్పించుకున్నాను. ఏ పదాన్ని ఎలా విడగొట్టాలి? ఎలా పలకాలి? అన్న విషయాలను ఆయన చాలా బాగా నేర్పించారు. ఆ తరువాత సినిమా యూనిట్‌సభ్యుల సహకారంతో చాలా వరకూ భాష మీద పట్టు సాధించాననే అనుకుంటున్నాను.

**'గౌతమ్‌నంద'లో బికినీ వేశారట?**

పాత్రపరంగా వేయాల్సి వచ్చింది. అంతే తప్ప కావాలని వేయలేదు. గతంలో కొద్దిగా బొద్దుగా ఉండేదాన్ని. దాంతో పాత్ర డిమాండ్ చేసినా వేసుకోనని చెప్పేదాన్ని. ఇప్పుడు కొద్దిగా సన్నబడ్డాను. ఇప్పుడు వేయడానికి ఇబ్బంది లేదు. అలాగని అనవసరంగా బికినీ వేసుకోమంటే మాత్రం వేసుకోను.

**'నేనే రాజు నేనే మంత్రి'లో ఎలాంటి క్యారెక్టర్ చేస్తున్నారు?**

నెగెటివ్ షేడ్స్ ఉన్న పాత్ర. ఈ పాత్రలో చాలా వేరియేషన్స్ ఉంటాయి. అవన్నీ ఇప్పుడే చెప్పేస్తే కిక్ ఉండదు. ఇప్పటి వరకూ నేను చేయని పాత్ర. విలనిజానికి కొద్దిగా దగ్గరగా ఉంటుంది. అలా అని పూర్తి స్థాయి విలనిజం కూడా ఉండదు. ఈ సినిమా తరువాత నాకు అందరూ అలాంటి పాత్రలే ఆఫర్ చేస్తారేమో అన్న అనుమానం కూడా వస్తోంది. నాలోని నటిని పూర్తిగా బయటకు తీసుకు వచ్చింది ఆ పాత్ర.

**ఈ సినిమాలో మీరు సిగరెట్ కాలుస్తారట నిజమేనా?**

చెప్పానుగా ఆ పాత్ర స్వభావం అలా ఉంటుంది. అందుకే తేజగారు నాతో సిగరెట్ కాల్పించారు. నిజజీవితంలో నాకు అలాంటి అలవాట్లు లేవు. సీన్ చేసే సమయంలో కొద్దిగా ఇబ్బంది పడ్డాను.

**తేజగారితో చేయడం కష్టం అనిపించలేదా?**

ఈ సినిమా ఒప్పుకున్నాను అన్న తరువాత చాలా మంది నన్ను భయపెట్టారు. ఆయన చండశాసనుడు. షాట్ సరిగ్గా రాకపోతే బాగా తిడతాడు. కోపం పట్టలేకపోతే కొడతాడు కూడా. ఆయన సినిమా ఎందుకు చేస్తున్నావు? తరువాత ఏడవాల్సి వస్తుందేమో అని చాలా చెప్పారు. కానీ షూటింగ్ సమయంలో ఆయనలో అలాంటి లక్షణాలేవీ నాకు కనపడలేదు. బహుశా ఆయన మారిపోయి అన్నా ఉండాలి. లేకపోతే ఆయన అంచనాలకు తగినట్టు నేను నటించి అన్నా ఉండాలి. ఆయనతో ఒక్క మాట కూడా అనిపించుకోకుండా షూటింగ్ పూర్తి చేశాను. తేజగారు సెట్‌లో దర్శకుడిగా కాకుండా ఓ మాస్టారులా అన్ని విషయాలు విడమరిచి చెబుతుంటారు. ఆయనకు ఏం కావాలో నటిస్తున్న వారికి తేలికగానే తెలిసిపోతుంది.

**ఇప్పటి వరకూ మీతో చేసిన హీరోల గురించి?**

అందరూ మంచివాళ్ళే! ఒక్కొక్కరిలో ఒక్కో స్పెషాలిటీ ఉంటుంది. సినిమాల పరంగా, నటన పరంగా చూస్తే నేను చిన్నదాన్ని కానీ వాటిని పట్టించుకోకుండా చాలా ఫ్రెండ్లీగా ఉండేవారు. నా హీరోలందరూ బుద్ధిమంతులు.

**మీ కాబోయే భర్త ఎలా ఉండాలనుకుంటున్నారు?**

ప్రతి ఆడపిల్లా తన భాగస్వామికి కొన్ని క్వాలిటీస్ ఉండాలని కోరుకుంటుంది. దానికి నేనేమీ మినహాయింపు కాదు. నాక్కాబోయే భర్త ఎలా ఉండాలి? అన్న దాంట్లో నాకు ఫుల్ క్లారిటీ ఉంది. నాకు షూస్ అంటే చెప్పలేనంత ఇష్టం. నా దగ్గర రకరకాల షూ కలెక్షన్లు ఉన్నాయి. నా భాగస్వామికి కూడా నాలాంటి అభిరుచే ఉండాలి. నాకన్నా ఎక్కువ కలెక్షన్లు తన దగ్గర ఉండాలి. నా కన్నా కొద్దిగా ఎత్తు ఎక్కువే ఉండాలి. ఎందుకంటే నేను హైహీల్స్ వేసుకోవడానికే ఇష్టపడతాను. ఆఖరిది, ముఖ్యమైనది మరొకటి ఉంది. నాకు కార్ల పిచ్చి చాలా ఉంది. తన దగ్గర రకరకాల కార్లు ఉండాలి. ఎన్ని కార్లు ఉంటే అంత మంచిది.

**టాలీవుడ్‌ని కుదిపేస్తున్న డ్రగ్స్ గురించి?**

నిజం చెప్పాలంటే ప్రస్తుత పరిస్థితుల గురించి లేటెస్ట్ అప్‌డేట్స్ నేను ఫాలో కావడం లేదు. నా వరకూ నేను వాటికి పూర్తి వ్యతిరేకిని. భగవంతుడు ఇచ్చిన ఈ లైఫ్‌ని సద్వినియోగం చేసుకోకుండా డ్రగ్స్ బారిన పడి నాశనం చేసుకోకూడదు. డ్రగ్స్ ఎంత వరకు ఆనందాన్ని ఇస్తాయో నాకు తెలియదు. వీటి కన్నా ఆనందాన్ని ఇచ్చేవి ప్రపంచంలో చాలా ఉన్నాయి. వాటిని తెలుసుకోగలిగితే వీటి బారిన పడరు అని నేను అనుకుంటున్నాను. స్కూలు విద్యార్థులు దగ్గర నుంచి సెలబ్రిటీల వరకూ అందరికీ నేను ఇచ్చే సలహా ఒకటే! చెడు అలవాట్ల బారిన పడి చక్కటి జీవితాన్ని నాశనం చేసుకోకండి.



**ఒకేసారి మీవి రెండు సినిమాలు విడుదల కావడం ఎలా ఉంది?**

చెప్పలేనంత టెన్షన్‌గా ఉంది. ఇంత వరకూ ఇలాంటి పరిస్థితిని ఫేస్ చేయలేదు. 'గౌతమ్ నంద'లాగే ఆ రెండు సినిమాలు కూడా మంచి విజయాన్ని సాధించాలని కోరుకుంటున్నాను.

**తెలుగులో చేయబోతున్న సినిమాలు?**

లేదు. ఇప్పటి వరకూ ఏ సినిమా ఒప్పుకోలేదు. తమిళంలో మాత్రం ఓ సినిమా చేస్తున్నాను. మంచి పాత్ర అయితే ఏ భాషలో చేయడానికి అయినా నేను రెడీ.

–స్పందన రెడ్డి

# విలనిజం చేదుమందు

-మురళీశర్మ

## ఇంటర్వ్యూ

**విలన్‌లాగా క్రూరంగా కనిపించగలడు. తండ్రిలాగా ప్రేమనూ కురిపించగలడు. పోలీసాఫీసరుగా నేరస్థుల గుండెల్లో నిద్ర పోగలడు. ఇలా ఏ పాత్ర అయినా అందులో ఒబ్బిడిగా ఇమిడిపోయే స్వభావం ఉన్న నటుడు మురళీశర్మ. అమ్మమ్మ గారి ఊరు ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డున ఉన్న గుంటూరే అయినా, పెరిగిందీ చదువుకున్నదీ మాత్రం ముంబయిలోనే. ఈ కారణంగా మురళి శర్మ తెలుగు ప్రేక్షకులకు పరిచయం కావడానికి చాలాకాలం పట్టింది. దాదాపు పది సంవత్స రాలుగా టాలీవుడ్‌లో వివిధ రకాల పాత్రలు చేస్తూ తనకంటూ ఓ గుర్తింపుని తెచ్చుకున్న మురళీశర్మతో....**

### మీ గురించి....

మా అమ్మది గుంటూరు. పుట్టిందీ, పెరిగిందీ మాత్రం ముంబయిలోనే. నాన్న వాళ్ళది ఉత్తరప్రదేశ్ లోని మథుర. పెళ్ళి అయిన తరువాత అమ్మ గుంటూ రుకు వెళ్ళిన సందర్భాలు వేళ్ళ మీదే లెక్క పెట్టవచ్చు. నాకు ఇద్దరు సోదరులు. ఆ ఇద్దరిలో ఒకరు ముంబయి లోనూ, మరొకరు బెంగుళూరులోనూ సెటిల్ అయ్యారు. మా కుటుంబంలో నేనొక్కడినే నటనవైపు అడుగులు వేశాను. డిగ్రీ తరువాత ఉద్యోగమా? నటనా? అన్న ప్రశ్న తలెత్తింది. నా మనసు నటనవైపే మొగ్గు చూపింది. నా నిర్ణయాన్ని విని మా వాళ్ళు మొదట్లో అభ్యంతరం చెప్పారు. ఈ రంగంలో నిలదొక్కు కోలేకపోతే? అన్నారు. చదువు ఎటూ ఉంది కనుక, ఏదో ఒక ఉద్యోగం వెతుక్కుంటాను అని వారిని ఒప్పించి ఈ రంగంలోకి వచ్చాను. దక్షిణాదిలో దాదాపు అన్ని భాషల్లోనూ నటించాను. తెలుగు, తమిళం భాషలు ఇబ్బంది లేదు. ఈ రెండింటిలో నా డబ్బింగ్ నేనే చెప్పు కుంటున్నాను. ఒక్క మలయాళంలోనే డబ్బింగ్ చెప్పడం లేదు. ఇప్పుడిప్పుడే మలయాళం నేర్చుకుంటు న్నాను. త్వరలోనే అక్కడ కూడా డబ్బింగ్ చెబుతాను.

### నటన వైపు ఎలా వచ్చారు?

మాది మధ్యతరగతి కుటుంబం. సినిమాలు, నాట కాలు అంటే అస్సలు ఒప్పుకునే వారు కాదు. చదువు కునే రోజుల్లో స్కూలు, కాలేజీ ఎగ్గొట్టి మరీ నాటకా లకు వెళ్ళేవాడిని. ఆ సంగతి తరువాత ఎప్పుడో ఇంట్లో తెలిసేది. ఇంకేముంది? మా ఫాదర్ చేతిలో తిట్లు, తన్నులు. ఓ రెండు మూడు రోజులు కామ్‌గా ఉండే వాడిని. మళ్ళీ మామూలే! అలా డిగ్రీ వరకూ లాక్కొ చ్చాను. ఆ తరువాత నటనను వృత్తిగా తీసుకోవాలని డిసైడ్ అయ్యాను. అతి కష్టం మీద వాళ్ళని ఒప్పించి ముంబయిలో యాక్టింగ్ స్కూల్లో శిక్షణ తీసుకున్నాను. శిక్షణ అయిపోయిన వెంటనే సినిమాల్లో అవకాశాలు కోసం ప్రయత్నించాను. ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. అక్కడ తీసుకున్న శిక్షణ సరి పోదు, అంతకు మించిన శిక్షణ అవసరం అనిపిం

చింది. మరికొంత కాలం శిక్షణ తీసుకుందామను కుంటున్న సమయంలో 'రిపోర్టర్ అనే టీవీ సీరియల్‌లో కొత్తవారి కోసం చూస్తున్నారని తెలిసింది. అవకాశం వస్తుందా? రాదా? అని సంకోచించాను. ప్రయత్నిస్తే నష్టం లేదు కదా? అనుకుని ట్రై చేశాను. అనుకోకుండా ఆ సీరియల్‌లో ఛాన్స్ వచ్చింది. ఆ సీరియల్ ద్వారా మంచి పేరు వచ్చింది. ఆ తరువాత మూడు నాలుగు సంవత్సరాల పాటు సీరియల్స్ చేశాను. 2002లో హిందీ సినిమాల్లో అవకాశం వచ్చింది. ఆ తరువాత హిందీ సినిమాల్లో వరుసగా అవకాశాలు వచ్చాయి. చిన్నది, పెద్దది అని కాకుండా అన్ని పాత్రలూ చేశాను. సీరియల్స్, సినిమాల కన్నా ముందు కొన్ని స్టేజి నాటకాలు కూడా చేశాను.

**తెలుగులో అవకాశం ఎలా వచ్చింది?**

హిందీ సినిమా చేస్తున్న సమయంలోనే తెలుగులో 'అతిథి' సినిమాలో ఛాన్స్ వచ్చింది. ఆ పాత్రతో మంచి గుర్తింపు వచ్చింది. ఆ తరువాత వరుస అవకాశాలు తలుపు తట్టాయి.

**చాలా భాషలు మాట్లాడేటట్టున్నారు?**

మొత్తం అయిదు భాషలు బాగా వచ్చు. కొత్త కొత్త భాషలు నేర్చుకోవడం అంటే చాలా ఇష్టం. హిందీ, మరాఠీ బాగా వచ్చు. తెలుగు, తమిళం మాట్లాడడం వచ్చు కానీ రాయడం రాదు. మలయాళం కూడా కొద్దిగా వచ్చు. అసలు ప్రకాష్‌రాజ్ గారిలా అన్ని భాషలూ మాట్లాడుతూ అన్ని భాషల్లో డబ్బింగ్ చెప్పాలని ఉంది.

**దక్షిణాది పరిశ్రమకూ, ఉత్తరాది పరిశ్రమకూ తేడా ఉందంటారా?**

నాకైతే ఆ తేడా లేదు. ఎక్కడైనా నటన అనేది కామన్‌గానే ఉంటుంది కదా? ఇక భాష ఒక్కటే తేడా. నటులకి ఆ తేడా ఉండదు, ఉండకూడదు కూడా! దక్షిణాది వారు నన్ను ఉత్తరాది వాడిగా ఎప్పుడూ చూడలేదు. తమలో ఒకడిగానే ఆదరించారు. అసలు సంవత్సరంలో ఎక్కువరోజులు దక్షిణాదిలోనే ఉంటాను.

**ఇప్పటి వరకూ మీతో నటించిన వారి గురించి....**

ఇప్పటి వరకూ దాదాపు 70 సినిమాలు చేశాను. అందులో కొన్ని సినిమాలు స్టార్ హీరోలతో చేశాను. మరికొన్ని చిన్న సినిమాలు చేశాను. స్టార్ హీరోలతో చేసేటప్పుడు వారిలో ఆ భేషజం అస్సలు కనిపించలేదు. అందుకేనేమో వారంతా స్టార్ హీరో స్థాయికి ఎదగగలిగారు. వారే కాదు క్యారెక్టర్ ఆర్టిస్టు లందరూ ఓ ఫ్యామిలీలాగా ఉంటాం. అందరం కలుసుకోవడం చాలా అరుదుగా జరుగుతుంది. అప్పుడు ఆప్యాయంగా, ప్రేమగా మాట్లాడుకుంటాం. ఉత్తరాదిన ఈ యూనిటీ కొద్దిగా తక్కువే అనిపిస్తుంది. అక్కడ కొద్దిగా ఈగో ఫీలింగ్ ఎక్కువ.



**తెలుగులో మీరు నటించిన సినిమాలు మీ కుటుంబ సభ్యులు చూస్తుంటారా?**

అన్నీ చూడడం కుదరదు. కొన్ని మాత్రం చూస్తుంటారు. 'భలే భలే మగాడివోయ్' సినిమా మా ఫ్యామిలీ మొత్తానికి బాగా నచ్చింది. ఇక హైదరాబాదులో మా బంధువులుంటారు. వాళ్ళు మాత్రం నా సినిమాలు రెగ్యులర్‌గా చూసి వారి అభిప్రాయాలను చెబుతుంటారు.

**మీ భార్య కూడా ఈ రంగంలోనే ఉన్నట్టున్నారు?**

తను ఎక్కువగా మరాఠీ సీరియల్స్, హిందీ సినిమాలు చేస్తుంటుంది. తెలుగులో రెండు సినిమాలు మాత్రమే చేసింది. సినిమా రంగమే మా ఇద్దరిని కలిపింది. ఓ షూటింగులో మా ఇద్దరికీ పరిచయం ఏర్పడింది. అది ప్రేమగా మారి పెళ్ళికి దారి తీసింది.

**ఇద్దరూ కలిసి చేసే అవకాశం ఉందా?**

అవకాశం ఇస్తే ఎందుకు చేయం? తనకి సినిమాల కన్నా కూడా సీరియల్సే సౌకర్యం అంటుంది.

**మీ స్వంత ఊరు గుంటూరు అన్నారు కదా... ఎప్పుడైనా అక్కడికి వెళ్తారా?**

మా మదరే గత కొన్ని సంవత్సరాలుగా ఆ ఊరికి వెళ్ళలేదు. ఇక నాకు ఎక్కడ కుదురుతుంది? ఆ ఊరిలో మా బంధువులెవరూ నాకు తెలియదు. ఒక వేళ వెళ్ళినా నటుడిగా గుర్తుపడతారేమో కానీ, బంధువుగా గుర్తించలేరు. ఎప్పుడైనా షూటింగ్ సందర్భంగా వెడితే మా బంధువులను కలుసుకుంటాను.

**ఈ రంగంలోకి వచ్చినందుకు బాధపడిన సందర్భం?**

మొదట్లో ఓ నాలుగు సంవత్సరాలు సరైన గుర్తింపు రాక ఇబ్బంది పడ్డాను. అప్పుడు చేతినిండా పని ఉండేది కానీ, మురళీశర్మ మంచి నటుడు అన్న గుర్తింపు రావడానికి చాలా సమయం పట్టింది. ఆ తరువాత ఎప్పుడూ బాధపడలేదు. బుల్లితెర మీద ఎలా ఆదరించారో వెండితెర మీద అంతకు రెట్టింపు ఆదరణ లభించింది. సినిమాలు చేయడం మొదలుపెట్టిన తరువాత ఖాళీగా ఉన్న సందర్భం లేదు. కొన్నిసార్లు కుటుంబానికి దూరంగా కూడా ఉండవలసి వస్తోంది. సినిమాల సక్సెస్‌తో ఆ బాధను మరచిపోతున్నాను.

**తండ్రి పాత్రలు చేయడం కష్టమా? విలనిజం కష్టమా?**

దేని కష్టం దానికే ఉంటుంది. తండ్రిగా, అన్నగా, బాబాయిగా ప్రేమను కురిపించే పాత్రలు చేస్తున్నప్పుడు మనసంతా ఆనందంగా తేలికగా అనిపిస్తుంది. అదే విలనిజం చేసేటప్పుడు చేదు మాత్ర మింగిన ఫీలింగ్ కలుగుతుంది.



ఆ ఫీలింగ్ కొంత కాలం అలాగే ఉంటుంది.

**విలన్ పాత్రలు చేస్తున్నందుకు మీ కుటుంబ సభ్యుల ఫీలింగ్?**

కెరీర్ ప్రారంభంలో ఎక్కువగా విలన్ పాత్రలే చేసేవాడిని. ఓ దుష్టుడుగా, చెడ్డవాడుగా మా వాళ్ళు తెర మీద నన్ను చూడలేకపోయేవారు. సినిమాలు మానేయ్. ఇలాంటి పాత్రలు వద్దు అనేవారు. నెమ్మదిగా వాటిని తగ్గించుకుని ఇతర పాత్రలు చేయడం మొదలుపెట్టాను. ఇప్పుడు వాళ్ళు ఫుల్ హ్యాపీ.

**అదృష్టాన్ని నమ్ముతారా? భగవంతుడిని నమ్ముతారా?**

భగవంతుని దయ ఉంటేనే అదృష్టం ఉంటుంది. అది ఉంటేనే అవకాశాలు వస్తాయి. పేరు వస్తుంది. ముందు భగవంతుడు, ఆ తరువాత అదృష్టం. వీటికి తోడు నా శ్రమను నమ్ముకుంటాను. ఈ మూడే నన్ను ఈ రోజు ఈ స్థాయిలో నిలబెట్టాయి.

**ఓ నటుడిని ప్రేక్షకుల దగ్గరకి చేర్చేది నాటకాలా? సినిమాలా?**

నాటకం అయితే ప్రేక్షకుల ఎదురుగా నటిస్తాం. వారి స్పందన నేరుగా తెలుసుకునే అవకాశం ఉంటుంది. వారికి నచ్చితే వెంటనే స్పందిస్తారు. ఈలలు, చప్పట్లతో వారి ఇష్టాన్ని తెలియజేస్తారు. ఓ నటుడికి ప్రేక్షకుల ఈలలు, చప్పట్ల కన్నా మించిన బహుమతి ఉండదు. సినిమాల దగ్గరకి వచ్చేసరికి ప్రేక్షకుల సంఖ్య పెరుగుతుంది. వారి స్పందన తెలియాలంటే కొంత కాలం ఆగాల్సిందే! ఫలితం సమిష్టిగా ఉంటుంది. ఏ ఒక్కరికో పరిమితం కాదు. కాకపోతే నాటకం కొంతమందికే పరిమితం అయితే సినిమా చాలామందికి చేరుతుంది. దేని లాభాలు దానికి ఉన్నాయి. నష్టాలూ ఉన్నాయి.

—ఎం. లాస్య

# నూరుకట్ల పిశాచం కథలు ⑥

-వసుంధర

**ఒకానొక గ్రామంలో నిర్భయుడు అనే యువకుడు ఉండేవాడు. చిన్నతనంలోనే అతడికి తల్లిదండ్రులు మరణించారు. దాంతో మేనమామ ఇంట పెరిగాడు నిర్భయుడు. ఆ మేనమామకు చంపకవతి అనే కూతురు ఉంది. తన కూతురును నిర్భయుడికి ఇచ్చి వివాహం చేయాలని మొదట్లో మేనమామ అనుకున్నాడు. అయితే, నిర్భయుడు చిన్నతనంనుంచి మహామొండిగా ఉండేవాడు. అతడికి భయమంటే ఏమిటో తెలియదు. అర్ధరాత్రిపూటకూడా, ధైర్యంగా గ్రామ వీధుల్లో తిరిగేవాడు.**

# నిర్భయుడి కథ

అతడికి సాహసకృత్యాలంటే ఇష్టం. ఎత్తైనచెట్లు ఎక్కడం, వడిగా ప్రవహించే కొండవాగుల్లో ఈత కొట్టడం, మారుమూల గుహల్ని శోధించడం అతడికి ముఖ్యమైన సరదాలు. నిర్భయుడి ధైర్యం అంతాఇంతా కాదు. విషసర్పం ఎదురైతే, పాదంతో తొక్కి చంపేవాడుతప్ప కర్రను వాడేవాడు కాదు. అతడి గురి, చురుకుతనం కూడా అసామాన్యం.

ఆ గ్రామంలో ప్రసేనుడనే గృహస్థుడు ఉన్నాడు. ఆయన ఆ దేశపు సైన్యంలో కొంతకాలం పనిచేసి, మహావీరుడని పేరు తెచ్చుకున్నాడు. కానీ ఆ తర్వాత, ఆరోగ్యం దెబ్బతినడంవల్ల, ఆ గ్రామానికి వచ్చి ఏదో ఒక పని చేసుకుంటూ స్థిరపడ్డాడు. ప్రసేనుడు నిర్భయుణ్ణి చూసి ముచ్చటపడి, రోజూ తనఇంట అతడికి యుద్ధవిద్యలు నేర్పేవాడు. నిర్భయుడు చాలా తొందరగా ఆ యుద్ధవిద్యలన్నీ నేర్చుకున్నాడు.

"నువ్వువెళ్ళి రాజునుకలిసి, నీ సామర్థ్యం ప్రదర్శించు. రాజుకొలువులో నీకు మంచి ఉద్యోగం దొరుకుతుంది" అనేవాడు ప్రసేనుడు. నిర్భయుడికి రాజధానికి వెళ్ళాలనే ఉంది. కానీ మేనమామకి ఇష్టంలేదు. ఏవో సాకులుచెప్పి నిర్భయుడిని వెళ్ళకుండా ఆపేశాడు. నిర్భయుడివల్ల ఆ గ్రామానికి చాలాసార్లు మేలు జరిగింది. ఒకసారి గ్రామంలో ఓ పొగరుబోతు ఆబోతు ప్రవేశించి విచ్చలవిడిగా తిరుగుతూంటే, నిర్భయుడు ఒంటిగా ఎదురెళ్ళి లొంగదీశాడు. మరోసారి అర్ధరాత్రివేళ, ఊళ్ళోకివచ్చి పడ్డ పదిమంది బందిపోటు దొంగల్ని, అతడొక్కడే ఎదిరించి చిత్తుచేసి బంధించాడు.

అయితే, నిర్భయుడిలో క్రూరత్వం కూడా ఉండేది. అతడు తనకంటే బలహీనులను హింసించేవాడు. తనను ఎవరు ఎదిరించినా, సహించేవాడు కాదు. కోపమొస్తే, ఎదుటివాళ్ళ ప్రాణాలు తీయడానికి కూడా వెనుకాడేవాడు కాదు. ఐతే స్వతహాగా నిర్భయుడు మంచివాడు. ఎవరైనా రెచ్చగొడితేనే అతడి క్రూరత్వం బయటపడేది. ఇది తెలిసిన కొంతమంది నిర్భయుణ్ణి చేరదీసి, మంచిమాటలు చెప్పి, తమ శత్రువుల్నీ, అయిష్టుల్నీ అతడిద్వారా భయంకరంగా హింసింపజేసేవారు.

ఇందువల్ల, నిర్భయుడి మేనమామకు, అతడి మీద రోజూ ఫిర్యాదులు వచ్చేవి. ఆయనకిదో పెద్ద తలనొప్పిగా తయారైంది. పెళ్ళి చేస్తే అతడు కుదుట పడతాడని కొందరన్నారు. కానీ నిర్భయుడి గురించి ఇన్ని తెలిశాక, చూస్తూ చూస్తూ తన కూతురు చంపకవతిని అతడికిచ్చి పెళ్ళిచేయడం శ్రేయస్కరం కాదనిపించింది మేనమామకు.

చంపకవతికి నిర్భయుడంటే చాలా ఇష్టం. ఆమె అతడి సాహసకృత్యాల గురించి, అందరికీ గొప్పగా చెప్పేది. అయితే, ఆమెది దయాగుణం. మెత్తని స్వభావం. ఎవరికేకష్టం కలిగినా, ఆమె మనసు నొచ్చుకుంటుంది. తనను హింసించిన వారిని కూడా హింసించాలనుకోదు. దేనికీ ఆమెకు కోపం రాదు. ఇలాంటి తన కూతురు నిర్భయుడివద్ద అష్టకష్టాలు పడుతుందని భావించి, మేనమామ ఆమెకు వేరే సంబంధం చూడాలని అనుకున్నాడు. కూతురికి నిర్భయుడంటే ఇష్టమని ఆయనకు తెలుసు. ఆ ఇష్టం ప్రేమగా మారి, పెళ్ళి చేసుకుంటానని మొండిపట్టు పడుతుందేమోనన్న భయంతో, ఆయన వారిద్దరినీ కలుసుకోనిచ్చేవాడు కాదు. అలా వాళ్ళిద్దరూ ఒకరికొకరు ఎదుటపడి మాట్లాడుకున్నదే చాలా తక్కువ.

ఇలా ఉండగా, ఒకసారి పెద్ద ఎత్తున యుద్ధవిద్యల పోటీలు ఏర్పాటు చేస్తున్నట్లు ఆ దేశరాజు దేశమంతా చాటింపు వేయించాడు. ఆ పోటీల్లో పాల్గొనమని ప్రసేనుడు నిర్భయుణ్ణి ప్రోత్సహించాడు. నిర్భయుడు కూడా ఆ పోటీల్లో పాల్గొనాలని ఉత్సాహపడ్డాడు. ఈసారి నిర్భయుడి మేనమామ కూడా అందుకు అంగీకరించాడు. అందుకు కారణం ఏమిటంటే నిర్భయుడు లేని సమయంలో, తన కూతురికి వేరే సంబంధంచూసి పెళ్ళి చెయ్యాలని ఆయన అనుకుంటున్నాడు. ఆయన మేనల్లుడితో, "పోటీలు అయిన వెంటనే తిరిగి మన గ్రామానికి వచ్చేసేయ్! రాజుగారు ఎంత ఆశపెట్టినా, ఆయన కొలువులో పనిచేయకు. నీలాంటి దుడుకు స్వభావం గల మనిషి రాజాస్థానంలో నెగ్గుకు రాలేడు" అని కూడా చెప్పాడు.



